డా. ఉమర్ అలీషా గారి

# ఉమర్ ఖయ్యామ్ రుబాయీల అనుశీలన





షేక్ ముహమ్మద్ ముస్తఫా

డా. ఉమర్ అలీషాగారి

# ఉమర్ ఖయ్యామ్ రుబాయీల అనుశీలన



"సాహిత్యరత్న"
షేక్ మహమ్మద్ ముస్తఫా
ఎమ్. ఏ., ఎమ్. ఫిల్.,

1980 సం. నాగార్జున విశ్వవిద్యాలయం వారి ఎమ్. ఫిల్. పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం.

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంచే ప్రచురింపబడినది.

ప్రచురణ
నవ్యసాహితీ సమితి
ప్రొద్దుటూరు. • కడప జిల్లా.

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మార్చి 1987

వెల రు. **20.00**



ప్రతులకు:

షేక్ హయాతున్నిసా
~~24/79, పవర్ హౌస్ రోడ్డు~~
~~ప్రొద్దుటూరు - 516 360.~~

9/367, విద్యానగర్
కళ్యాణదుర్గం - 515 761
అనంతపురం జిల్లా

డా. ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షులు,
యువభారతి.

హైదరాబాదు,
23-1-87.

# అభినందనం.

***********

ప్రపంచంలో అన్ని నాగరక సాహిత్యాలను దాదాపు వెయ్యేండ్ల నుండి ప్రభావితం చేస్తున్నాయి సుప్రసిద్ధ పారసీకవి ఉమర్ ఖయ్యామ్ ఆలోచనలు. వేదాంతం, జ్యోతిష్యం, ప్రణయతత్త్వం, అర్థనీతి, రాజనీతి, మానవతత్త్వం, జీవిత పరమార్థం వంటి మహావిషయాలెన్నో ఆయన రుబాయిల్లో ఒదిగి పోయినవి. రుబాయీ అరబ్బీ, పారసీ భాషల్లో బహుజన ప్రియమైన నాలుగు పాదాల ఛందో విశేషం. "అల్పాక్షరములందు అనల్పార్థ" కల్పన చేయగలిగిన విద్వత్కవులను రుబాయి బాగా ఆకట్టుకుంటుంది. ముక్తక జాతికి చెందిన పద్యమిది. నాలుగు పాదాల్లోనే చెప్పగలిగినదంతా చెప్పాలి. అంత్యప్రాస నియమం మూడవ పాదానికి మాత్రం ఉండదు. ఇటీవల తెలుగు కవులు తమకు ఈ ఛందః ప్రయోగం చిరతరాభ్యస్తమేమో అన్నంత నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు. ఆటవెలదుల్లో వేమన్న సత్యాల ముత్యాలు తళుక్కుమని పించినట్లే ఖయ్యాం తన రుబాయిల్లో నిత్య సత్యాల కాంతులను విరజిమ్మి నాడు. ప్రపంచంలోని ఎందరో కవితా ప్రతిభా సముపేతులకు ఖయ్యాం రుబా యీలను తమ భాషల్లో వెలువరించాలనె ఆకాంక్ష కలిగింది. వాల్మీకివలె, వ్యాసునివలె, షేక్స్పియర్ వలె, భర్తృహరివలె, ఖలీల్ జిబ్రాన్‌వలె ఖయ్యాం ఎందరో కవులకు అనుసరణీయుడైనాడు. ఆయన విశ్వకవి.

రుచిరార్థసూక్తులపట్ల తెలుగు కవులకున్న ప్రాత్యయం, మక్కువ ఎల్లరమూ ఎరిగినదే. ఎందరో తెలుగు కవులు ఖయ్యాం రుబాయీలకు తెలుగు వేషం వేసి, చూసుకొని ముచ్చట పడ్డారు. సరాసరి పారసీనుంచి తెనిగించిన వారిలో దువ్వూరి రామిరెడ్డి, బూర్గుల రామకృష్ణారావు, ఉమర్ అలీషాగారలను ప్రముఖులుగా పేర్కొనవచ్చు.

ఉమర్ అలీషా తెలుగుకవి మాత్రుడే కాదు, తాత్త్వికుడు, సంస్కర్త, దేశసేవా నిరతుడు. సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు, ఫారసీ భాషలతో చక్కని అభినివేశం సంపాదించిన పండితుడు. ఆయన వ్రాసి రాశిపోసిన కావ్యఖండికలు ఆయన ప్రతిభా వ్యుత్పత్తులకు నిదర్శనాలుగా నిలబడినవి. నేటి తెలుగు సాహిత్య చరిత్రలో అరుదైన స్థానాన్ని సంపాదించుకోగలిగాడు.

షేక్ మహమ్మద్ ముస్తఫాగారు ఉమర్ అలీషా తెలుగు చేసిన రుబాయీలను గూర్చి పరిశీలనచేసి నాగార్జున విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్. పట్టాను సంపాదించినారు. ఎన్నో గ్రంథాలను చదివి, ఎందరో పండితులను సంప్రదించి సరళ సుందరమైన వ్యావహారిక భాషలో తమ పరిశోధనాంశాన్ని రచించినారు. ఆయన వ్రాసిన ఈ ఎం. ఫిల్. సిద్ధాంత వ్యాసాన్ని ముద్రణకు పూర్వమే చదివే సదవకాశం నాకు లభించింది. పరిశోధకునికి కావలసిన మెలకువలు, శ్రద్ధ, అభినివేశం, యథార్థ దృక్పథం ఈ పుస్తకంలో అంతటా పరచుకొని ఉన్నవి.

ఉమర్ అలీషా సాహిత్యాన్నంతటినీ మథించాలని ఆయన ఆకాంక్ష. ఈ పుస్తకంలో "ఉమర్ అలీషాగారి సారస్వతసేవ" అన్న ప్రకరణంలో దిఙ్మాత్రంగా ఈ ప్రయత్నానికి అంకురార్పణ చేసినారు. ఉమర్ అలీషా సాహిత్య పరిశీలనం సమగ్రంగా సాగించాలనుకుంటున్న ముస్తఫాగారి కృషి సఫలం కావాలని నా కోరిక.

చదువదగిన ఒక మంచి పుస్తకాన్ని పరిశోధకులలోకానికి అందిస్తున్న ముస్తఫా గారిని మనసారా అభినందిస్తున్నాను.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక అవార్డు గ్రహీతలు శ్రీ ముస్తఫా. హిందీ భాషా సాహిత్యాలను తలస్పర్శిగా అధ్యయనం చేసిన "సాహిత్య రత్న" శ్రీ ముస్తఫా. ఆయన కేవలం అధ్యాపనంతోనే తృప్తిపడక పరిశోధనపట, సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలపట్ల ఆసక్తిని పెంచుకుని సహృదయ సమాజానికి చేరువగా వ్యవహరించగలిగే సంస్కారాన్ని పెంపొందించుకుంటున్న సరసుడు. ఆయన సాహిత్య వ్యాసంగం నిర్విఘ్నంగా కొనసాగేందుకు పరాత్పరుడు తోడ్పడాలని ఆశిస్తున్నాను.

(సం) ఇరివెంటి కృష్ణమూర్తి

ఆచార్య జి. యస్. రెడ్డి,
వైస్ చాన్సలర్,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం.

తిరుపతి,
26-1-87.

# ప్రశంస

✲✲✲✲✲

'సాహిత్యరత్న' శ్రీ షేక్ ముహమ్మద్ ముస్తఫాగారు తెలుగు రచయితగా పరిశోధకులుగా గుర్తింపుగల ఆంధ్రోపన్యాసకులు.

ఆధునిక తెలుగు కవుల్లో విశాలమైన భారతీయ పారశీక సాహిత్య సంస్కృతుల అవగాహనతో, నిరుపమానమైన హిందూ ముస్లిం సంప్రదాయాల సమదృష్టితో తనదైన ఒక ప్రత్యేక స్థానాన్ని ప్రాధాన్యాన్ని స్థాపించుకొన్న ప్రతిభామూర్తి డా. ఉమర్ అలీషాగారు. అంతేకాదు. ఒక [illegible] పీఠాచార్యులుగా, భారతీయ స్వాతంత్ర్య సమరయోధులుగా కేంద్రశాసన సభ్యులుగా, శ్రోతల్ని ఉత్తేజపరచిన మహావక్తగా లబ్ధప్రతిష్ఠులై లౌకిక జీవిత సమన్వయానికి, మత సామరస్యానికి, విశ్వమానవ భ్రాతృత్వానికి ఒక ఆదర్శమూర్తిగా వెలిగిన మహనీయులు కీర్తిశేషులు ఉమర్ అలీషాగారు. తెలుగులో వివిధ ప్రక్రియలకు చెందినట్టి రచనలు- కావ్యాలు, గేయాలు, నాటకాలు, నవలలు, అనువాదాలు ఆధ్యాత్మిక ప్రధానాలు అయినట్టి రచనలు- దాదాపు ఏభై వరకు రచించి ఆధునిక తెలుగుసాహిత్యాన్ని తాను సైతం సుసంపన్నం చేసిన పురోగామి ఉమర్ అలీషాగారు. అట్టి సాహిత్యోపాసకుని సాహిత్య మూర్తిమత్వాన్ని ఈ గ్రంథరూపంలో రచయిత ముస్తఫాగారు లోకానికి పరిచయం చేయడం ముదావహం. అయితే ఈ గ్రంథం ఉమర్ అలీషాగారి సాహిత్యమూర్తికి సమగ్ర దర్పణం కాదు. ఉమర్ అలీషాగారి జీవిత సాహిత్య స్వరూపాలను ఒక ఉద్గ్రంథ రూపంలో వెలువరించ వలసిన అవసరం ఎంతైనా వుంది. అట్టి రచనకు ఈ చిన్న పరిశోధన గ్రంథం నాంది ప్రాయమని నా అభిప్రాయం. శ్రీ ముస్తఫాగారు తమ పరిశోధనను ఇంకా ద్విగుణీకృత ఉత్సాహంతో సాగించి ఉమర్ అలీషాగారి జీవిత సార్థక్యాన్ని వారి సాహిత్య వైవిధ్యాన్ని లోకానికి గ్రంథరూపంగా సుప్రసన్నం చేయాలని ఆశిస్తున్నాను. అట్టి అభిరుచి, నిబదత శ్రీ ముస్తఫాగారికి వున్నందుకు సంతోషం; అభినందనలు.

ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు వివిధభాషానువాద రూపాల్లో విశ్వవ్యాప్తిని పొందినాయి. అలౌకికమూ, ముక్తక రచన ప్రాయమూ అయిన రుబాయీల కృతికి కలిగినంత విశ్వప్రశస్తి ప్రపంచంలో మరేకృతికీ కలగలేదు. ఉమర్ ఖయ్యాం రుబాయీలకు తెలుగులో కూడ అనువాదాలు వచ్చినాయి.

ఈ గ్రంథంలో శ్రీ ముస్తఫాగారు ఉమర్ ఖయ్యామ్, ఉమర్ అలీషాల జీవిత రేఖల్ని రుబాయీల తెలుగు అనువాదాలను తులనాత్మకంగా పరిశీలించి అందిస్తున్నారు. సాహిత్య ప్రియుల దృక్పథాన్ని విశాలంచేసే రచన ఇది.

పాఠకలోకంలో ఈ గ్రంథానికి ఆదరణ, రచయితకు ప్రోత్సాహం కలుగుతుందని నా నమ్మకం.

ఇట్లు
(సం) జి. యస్. రెడ్డి

డా. యస్. గంగప్ప,
ఎమ్. ఏ., పి. హెచ్. డి.,
రీడర్
తెలుగు ప్రాచ్యభాషావిభాగం,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్-522 510

సి/73, శ్రీనివాసనగర్ కాలనీ,
గుంటూరు-522 006.
27-1-87.

## అభినందన

*******

ఉమర్ ఖయ్యాం కవి మాత్రమే కాదు. మహాతత్త్వవేత్త; ఖగోల గణిత జ్యోతిశ్శాస్త్రజ్ఞుడు. కాని ప్రపంచంలో పండితలోకంలో కవిగానే ఆయనకి ప్రఖ్యాతి ఉండడం విశేషం. ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు దాదాపు అన్ని భాషల్లోకి అనూదితమై ఖయ్యామ్ కీర్తిని దశదిశలా వ్యాప్తి చెందించాయి. పారశీ భాష నెరిగి అనువదించినవారు డా. ఉమర్ అలీషాగారు. వాటి అధ్యయనమే ఈ "డా. ఉమర్ అలీషాగారి ఉమర్ ఖయ్యామ్ రుబాయీల అనుశీలన" [illegible] శ్రీ ఎస్. ఎమ్. ముస్తఫా నా పర్యవేక్షణలో ఎమ్. ఫిల్. పట్టాకై చేసిన కృషి ఫలితమే. దీనిని ముద్రించడం నాకు ముదావహం. గ్రంథరచన ఒక ఎత్తు. దాని ముద్రణ మరో ఎత్తు. రెంటిని సాధించిన మిత్రుని అభినందిస్తున్నాను.

ముస్తఫాగారు ఉమర్ ఖయ్యామ్, ఉమర్ అలీషాగార్ల జీవితరేఖల్ని వివరించి, ఆ వెనుక అలీషాగారి పద్యాల్లో వ్యక్తమయ్యే ఖయ్యామ్ పాండితీ వైభవాన్ని విపులీకరించారు. ఫారశీ భాషలో రుబాయి ఛందస్సుకు ఒక ప్రత్యేకత ఉంది. దాన్ని గ్రహించే ఉంటారు. అలీషాగారు ఆనడకను ఇలా తమపద్యంలో పొందుపరచారు.

"మనుజకోటిలో దెలివిగా మసలవలయు
నెల్ల పనులందు శాంతిమై నెసగవలయు
శ్రవణ నయన జిహ్వేంద్రియ శక్తులెంత
గలిగియున్నను లేనట్లె మెలగవలయు"

దీని విశిష్టతను ముస్తఫాగారు విశదీకరించిన తీరు మెచ్చుకోదగ్గ అంశం.

ఉమర్ అలీషాగారి అనువాద సరళిని గురించి వివరిస్తూ ముస్తఫా విమర్శనాత్మక విజ్ఞతను ప్రకటించారు, (పు. 62, 63) ఎక్నానీ బదోరోజ గరషవద్ హాసిలె మర్ద..." అనే మూలానికి అలీషాగారి అనువాదం ఇది—

"రెండు దినాలకైన నొకరేయొక రొట్టె లభించెనేని నో
రెండిసవేళ నింత జలమిచ్చెడు పెంకు లభించెనేని, నే
నొండొరు వేడి వాని కొలువుండను - నాగతి మానవుండె, భూ
వుండును - వాని గొల్చుచును పొట్టను నింపుకొనంగ బోదునే"

ఈ రుబాయిని దువ్వూరు రామిరెడ్డిగారు ఒక తేట గీతిలో అనువదించారు.

"రెండు దినముల కొకతూరి యెండు రొట్టె
బోసి ముంతెడు చలినీళ్లు పుట్టునేని
ఏల నినుబోలు వానికి కేలు మోడ్చ
నొకన్నికి గులామనై ఎందుకూడ్చి గింప"

ఈ రెంటగల తారతమ్యాన్ని వివరిస్తూ మూలానుగుణమైనఅలీషా గారి అనువాదరీతిని మిక్కిలి సహజంగా సూక్ష్మేక్షికతో వివరించిన తీరు ప్రశంసకు పాత్రమైన అంశం.

అలీషాగారి అనువాదానికిగల స్థానాన్ని ఆ వె
నిర్ణయించారు ముస్తఫాగారు. దువ్వూరి రామిరెడ్డిగారి పా
లేని ఈ భువనమంత" అనే పద్యానికి మూలమైన
మొదలుకొని అనేకులు చేసిన అనువాదాల్ని పేర్కొని (
అలీషాగారి అనువాద విశిష్టత విశదీకరించిన తీరు ప్రశంస

చివర అలీషాగారు మహమ్మదీయులైనా ఏంతో
ముట్టిపడేట్టు రచన చేయగలిగిన కవిసత్తముడనీ, వారు తె
మనం ఏమిచ్చినా ఋణం తీరదన్న విషయాన్ని స్పష్టీకరి

పరిశోధనకై ఒకఅంశాన్ని ఎన్నుకోవడంలోనే ప
పోతుంది. ఇంత విశిష్టమైన అంశాన్ని ఎన్నుకొని
సాహిత్యాన్నంతా తరచి అన్వేషించి నిగ్గు తేల్చిన ము
అభినందిస్తున్నాను.

ఇంకా ఇలాంటి ఉత్తమ విమర్శనాత్మక రచన
రావాలని ఆకాంక్షిస్తూ అందుకు తగిన బుద్ధి కుశలత,
విశదీకరణ వారి కున్నాయని నమ్ముతున్నాను.

(సం

# విషయసూచిక.

పుట.



## మొదటి ప్రకరణం

## రెండో ప్రకరణం



## మూడో ప్రకరణం

# నాలుగో ప్రకరణం



# ఐదో ప్రకరణం



✲✲✲✲✲✲✲✲✲

# కృతజ్ఞతా నివేదనం

*****************

ఈ పరిశోధనకు అవకాశం కల్పించి విలువైన సలహాలిచ్చి అభివృద్ధి ఆకాంక్షించిన పూజ్యులు ఆచార్య తూమాటి దొణప్పగారికి

నా పరిశోధనకు దర్శకత్వం వహించి అమూల్యాంశాలెన్నో తెలియజేసి ముందుకు నడిపించి 'అభినందనం' అందించిన మాన్యులు డా॥ ఎస్. గంగప్ప గారికి

దయతో తమ అభిప్రాయాలు అందజేసి గ్రంథానికి విలువ పెంచిన యువభారతి అధ్యక్షులు డా. ఇరివెంటి కృష్ణమూర్తి, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం వైస్ చాన్సలర్ ఆచార్య జి. ఎన్. రెడ్డి గార్లకు

నా పరిశోధన ఫల ప్రదం కావాలని ఎన్నో పుస్తకాలు, పత్రికలు, నాడు అందించి తోడ్పడిన డా॥ షేక్. మస్తాన్‌గారికి, సహకారమిచ్చిన మిత్రులు డా॥ వి. సుబ్రహ్మణ్యం గారికి

తమ వద్దగల గ్రంథాలనిచ్చి ఎన్నో విషయాలు తెలియపరచిన ఆంధ్ర విశ్వవిద్యాలయ హిందీ శాఖాధ్యక్షులు ప్రొ॥ కర్ణరాజశేషగిరిరావు, కర్నూలు ఉస్మానియా కళాశాల రిటైర్డ్ తెలుగు లెక్చరర్ శ్రీ షేక్ దావూద్ సాహేబ్, ప్రొద్దుటూరు ప్రాచ్యకళాశాల సంస్కృతోపన్యాసకులు శ్రీ బండ్ల వేంకట రమణయ్య, నవ్యసాహితీ సమితి కార్యదర్శి శ్రీ ఏ. సి. దస్తగిరి, ఉర్దూ లెక్చరర్ జనాబ్ టి. ఎన్. అమానుల్లాఖాన్ (కడప), జనాబ్ ఎస్. గౌస్ సాహెబ్ (కర్నూలు) గార్లకు

నా కృషికి ప్రోత్సాహం కలిగించి సహకరించిన నాటి ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ టి.వి.జి. కృష్ణమూర్తిగారికి, బనగానిపల్లె నవాబ్ మీర్ గులామ్ అలీఖాన్ బహద్దూర్ వారి విలువైన గ్రంథాలు అందించి తోడ్పడిన జూనియర్ కళాశాల గ్రంథాలయాధికారి శ్రీ ఎమ్. కెస్సర్లింగ్ గారికి

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అందజేసిన తెలుగు విశ్వ విద్యాలయం వారికి

అన్నివిధాల సహకరించిన మిత్రులు శ్రీ డి. వి. శంకర్ (లెక్చరర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, చంద్రగిరి), ప్రొద్దుటూరు వాస్తవ్యులు శ్రీ ఆర్.నీలకంఠారెడ్డి(ప్రస్తుతం హిస్టరీ లెక్చరర్, ప్రభుత్వ డిగ్రీ కళాశాల,కళ్యాణ దుర్గం), ముఖచిత్ర కల్పన చేసిన కళాకారుడు మిత్రుడు శ్రీ కె. తిరుమల కొండయ్య (ఆర్ట్ మాష్టర్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, కళ్యాణదుర్గం,) ఈ గ్రంథాన్ని ముద్రించి ఇచ్చిన ప్రొద్దుటూరు శ్రీ కిరణ్ ప్రింటింగ్ ప్రెస్ అధినేత కె. నాగసూర్యప్రసాద్ గార్లకు వారి సిబ్బందికి

నా కృతజ్ఞతలు.

—షేక్ ముహమ్మద్ ముస్తఫా



# ప్రస్తావన

పారశీక దేశంలో జన్మించి తన రుబాయీలద్వారా లోకానికి అమృతో పదేశం అందించిన మహాతత్త్వవేత్త ఉమర్ ఖయ్యామ్. ఇతని ఫారసీ రుబాయీలు ప్రపంచంలోని అన్ని ముఖ్యభాషల్లోకి అనువదించబడ్డాయి. తెలుగు అనువాదాల్లో డా. ఉమర్ అలీషా గారి 'ఉమర్ ఖయ్యామ్' గ్రంథం తలమానికం. ఈ గ్రంథాన్ని గూర్చి ఇంతవరకు పరిశోధన జరగలేదు. శ్రీ బండారు తమ్మయ్యగారు 1951 నవంబరు 'భారతి' లో తాము వ్రాసిన 'ఉమర్ ఖయ్యామ్ ఉమర్ అలీషాకవి' అనే వ్యాసంలో ఉమర్ ఖయ్యామ్ గ్రంథాన్ని గూర్చి కొంతవరకు చర్చించారు. ఇంకా కొందరు విమర్శకులు ఉమర్ ఖయ్యామ్ రుబాయీల తెలుగు అనువాదాల్ని గూర్చి పరిశీలిస్తూ, ఉమర్ అలీషాగారి అనువాదాన్ని దిఙ్మాత్రంగా పరిచయం చేశారు. అంతేకాని ఉమర్ అలీషాగారి 'ఉమర్ ఖయ్యామ్' గ్రంథాన్ని గూర్చిన సంపూర్ణ పరిశీలన జరగలేదు. ఎన్నో అమూల్యగ్రంథాలు రచించి తెలుగు వాఙ్మయానికి ఎనలేని సేవచేసిన ఉమర్ అలీషాగారు ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను రసవంతంగా అనువదించి ఆంధ్ర జగత్తుకు అందజేశారు.

అలాంటి ఉమర్ అలీషాగారి జీవిత విశేషాలు తాత్త్వికకవి ఉమర్ ఖయ్యామ్ జీవితంతో పాటు పరిశీలించడం, 'ఉమర్ ఖయ్యామ్' గ్రంథాన్ని పరశోధనాత్మకంగా సమీక్షించడం ఈ సిద్ధాంత వ్యాసోద్దేశం. ఇందులో ఐదు ప్రకరణాలున్నాయి.

మొదటి ప్రకరణంలో ఉమర్ ఖయ్యామ్, ఉమర్ అలీషాల జీవిత రేఖలు సంగ్రహంగా వివరించబడ్డాయి. ఇరువురు తత్త్వవేత్తలు బహుముఖ పాండితీ గరిమ కలిగినవారు కాబట్టి ఇరువురి జీవితాల్ని గూర్చి పోల్చడం కూడ జరిగింది.

ఉమర్ అలీషాగారి పద్యాలలో వ్యక్తమయ్యే ఖయ్యామ్ పాండితీప్రకర్ష, ఖయ్యామ్ చేపట్టిన రుబాయీలు- వాటి విశిష్టత, ఖయ్యామ్ తత్త్వామృతాన్ని పాశ్చాత్యులకు చవి చూపిన ఫిట్జ్‌రాల్డ్ ప్రసక్తి మున్నగు అంశాల చర్చ రెండో ప్రకరణంలో ఉంది.

మూడో ప్రకరణంలో ఉమర్ అలీషాగారి అనువాద సరళి - కవితా మాధుర్యం వివరించబడింది. ఖయ్యామ్ తాత్త్విక చింతన సమగ్రంగా విపులంగా చర్చించబడింది. ఈ ప్రకరణం నా యీ సిద్ధాంతవ్యాసానికి హృదయస్థానం.

రుబాయీల తెలుగు అనువాదాల్లో ఉమర్ అలీషాగారి అనువాదానికి గల స్థానం నాలుగో ప్రకరణంలో నిర్ణయించడం జరిగింది.

ఐదో ప్రకరణం ఉప సంహారం. ఉమర్ అలీషాగారు తెలుగు సారస్వతానికి చేసిన విశిష్టమైన సేవ ఇందు వివరించబడింది.

ఉమర్ అలీషాగారి ఉమర్ ఖయ్యామ్ గ్రంథాన్ని గూర్చి సమగ్ర పరిశోధనచేసే నిమిత్తం అనేకప్రదేశాలు తిరిగాను. ఉర్దూ పారశీక పండితుల్ని కలుసుకొన్నాను. అయితే ఎంతప్రయత్నించినా ఉమర్ అలీషాగారు చూచిన పారశీక రుబాయీల మూల ప్రతి పూర్తిగా లభించలేదు. ఇందుకు చింతిస్తున్నాను.

అయినా ఉమర్ అలీషాగారి అనువాద విధానం రచనా నైపుణ్యం సమగ్రంగా వివరించడంతో పాటు, ఉమర్ ఖయ్యామ్ తాత్త్విక చింతన, ఉమర్ ఖయ్యామ్ బోధలు పూర్వంలేని విధంగా మౌలికంగా స్పష్టంచేయడం జరిగింది.

—రచయిత

# మొదటి ప్రకరణం

## ఉమర్ ఖయ్యామ్ ఉమర్ అలీషాల జీవిత రేఖలు.

ఉమర్ ఖయ్యామ్ ప్రపంచ సాహితీ చరిత్రలో పేరు ప్రఖ్యాతులుగల మహాతాత్త్విక కవి. లోకానికి కర్తవ్యం బోధించిన ఇతడు ఏ మహాకావ్యం రచించలేదు. ఫారసీఛందఃప్రక్రియ రుబాయీని స్వీకరించి ప్రజాశైలిలో అపూర్వమైన కవిత అల్లాడు. ఊహాతీతమైన తాత్త్విక విషయాలు, విజ్ఞానదాయకమైన బోధలు, సంస్కరణం ఆశించిన నీతులు కల ఇతని రుబాయీల కవిత్వం యావత్ప్రపంచాన్ని ఆకర్షించింది. రచనలో సిద్ధహస్తులైన కవులు తమ తమ భాషల్లో ఈ రుబాయీలను అనువదించి ఖయ్యామ్ తత్త్వానికి సజీవరూపం కలిగించారు.

ఈ వశలో తెలుగు కవుల్ని సైతం ఖయ్యామ్ విశేషంగా ఆకర్షించాడు. తత్ఫలితంగా ఖయ్యామ్ రుబాయీల పెక్కు అనువాదాలు తెలుగునేలను వెలిశాయి. ఇలాంటి మహాకవి ఉమర్ ఖయ్యామ్ జీవితరేఖల్ని గూర్చి పరిశీలించేముందు అతని మాతృభూమి పారశీక దేశాన్ని గూర్చి కొంత ప్రస్తావించక తప్పదు.

## పారశీక దేశం - పూర్వరంగం

నేటి ఈరాన్ ఆసియా ఖండంలో ఒక స్వతంత్ర రాజ్యం. పూర్వం ఈరాన్ తెగకు చెందిన ఆర్యులు నివసించే ప్రాంతం 'ఆర్యానా' అని ఈ ఆర్యానా శబ్దభవమే 'ఈరాను' అని అంటారు.1 ఈ ఈరాన్ దేశమే పర్షియా లేక పారశీక దేశమని కూడ పిలువబడుతుంది. రాజధాని టెహరాన్. దేశభాష పారశీకం లేక ఫారసీ.

"The transition from ancient to modern Persian is formed by the PARSEE, or as the Arabs and the modern persians themselves call it FARSI..."2

---

1. కె. విఠల్‌రెడ్డి, ఈరాను (భూ), సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, రెండవ సంపుటము, పు. 138
2. Persian Language and Literature, The illustrated Chambers's Encyclopedia, Volume VIII. W.R. chambers Limited, London, 1930, P. 39

పారశీకులు ఆర్యులు. అగ్నిని పూజించేవారు. పూర్వం నుండి నాగరికతకు పేరుగన్నవారు. జాతీయ భావం, ప్రాచీన సంప్రదాయాలపట్ల గౌరవం కలవారు. మంచిని పెంచేవారు. వివిధ జాతులవారితో సహజీవనం గడిపినవారు.

"ఈదేశము (ఈరాను) ప్రాక్పశ్చిమ ఖండములకు నడుమ నెలకొని యున్న కారణమున, ఇయ్యది వివిధజాతుల ప్రజలకు సమావేశరంగముగ పరిణమించినది. ఈరానుపై అనేక జాతులవారు దండెత్తివచ్చి ఈ భూభాగమున కెంతయో నష్టము కలిగించుచుండెడివారు. కాని ఇందువలన పారశీకజాతి వారికి ఎట్టి శాశ్వతమైన హానియు కలుగలేదు. అందులకు మారుగ వారికి మేలే చేకూరినది. ఇతర జాతులయందుగల మంచి లక్షణములను గుర్తించి వాటిని తమ జీవితములోనికి సంక్రమింపచేసికొను ఉదారత, సమన్వయ బుద్ధియు పారశీకులకు అనాదినుండియు అలవడి యుండెను." 3 అని శ్రీఖండవల్లి బాలేందు శేఖరం వివరించారు.

ఏడవ శతాబ్ది ప్రారంభంలో అరబ్బులు పారశీక దేశంపై దాడిచేసి విజయం సాధించారు. ఇస్లామ్ రాజ్యస్థాపన అక్కడ జరిగింది. అరబ్బీ రాజభాష అయింది. పండిత సభల్లోను రాజాస్థానాల్లోను ఈ భాష వ్యవహరించబడింది. పారశీకులు అరబ్బీ నేర్చుకొన్నారు. ఆ భాషలో కవిత్వం వ్రాశారు. పారశీకం లోనికి అరబ్బీ పదాలు విచ్చలవిడిగా ప్రవేశించాయి. ఫారసీభాషకొకవింత సౌందర్యం కలిగింది. ఇదేవిధంగా మత విషయకంగా పారశీక మతం ఇస్లామ్ మతాల పరస్పర సమ్మేళనం జరిగింది. తొమ్మిదో శతాబ్దంలో వేదాంతం (సూఫీమతం) తలచూపింది. 4 అనంతరం కొంతకాలానికి ఉమర్ ఖయ్యాం జన్మించాడు.

3. ఖండవల్లి బాలేందు శేఖరం, ఈరాను (చ), సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, రెండవ సంపుటము. పు. 138.
4. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో. పు. IV-V

## ఉమర్ ఖయ్యామ్ జన్మసంవత్సరం - విభిన్నాభిప్రాయాలు

ఉమర్ ఖయ్యామ్ జన్మస్థానం పారశీకంలోని నిషాపూరు. ఇతని జన్మసంవత్సరం గూర్చి పలువురు పలు అభిప్రాయాలు వ్యక్తం చేశారు.

సర్. ఇ. డి. రాస్ మహాశయుడు ఖయ్యామ్ జన్మసంవత్సరం 1040 అని, సయ్యద్ సులేమాన్ నద్వీ 1048 అని నిర్ణయించారు. వి. యం. దాతారు గారు[5] జహరుద్దీన్ అబుల్ హసన్ బైహికి రచించిన 'పారశీక తత్త్వవేత్తల జీవిత చరిత్రములు' అనే గ్రంథం ఆధారంగా 1048 మే 16 అని నిర్ణయించారు.[6] 1015-1035 మధ్య జన్మించి ఉంటాడని శ్రీ దువ్వూరి రామిరెడ్డి[7] 1018 సంవత్సరమని శ్రీ ఉమర్ అలీషా[8] 1015 - 1020 మధ్య జన్మించి ఉంటాడని డా. బూర్గుల రామకృష్ణారావు[9] ఇలా ఉండగా అమెరికాలో ప్రచురించబడిన ఒక ఆంగ్ల శబ్దకోశంలో ఇతని జననమరణ సంవత్సరాలు A.D. 1050?-1123? అనిఉంది.[10]

"Omar Khayyam was born at Nishapur in Khorasan in the latter half of our Eleventh and died within the First quarter of our 12 th century"[11] అని ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్ల గ్రంథం.

---

5. హైదరాబాదు ప్రభుత్వ ఆర్థికశాఖలో ఉద్యోగి. అనంతరం సన్యసించి గోవిందతీర్థస్వాములవారని పేరు పెట్టుకొన్నారు. 1941 లో ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను ఆంగ్లంలోనికి అనువదించి The Nectar of Grace అనే పేరుతో గ్రంథం ప్రచురించారు.
6. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో. పు. XIII
7. ______ పై గ్రంథమే ______ ఉపో. పు. XII
8. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పీ. పు. VII
9. డా. బూర్గుల రామకృష్ణారావు, సారస్వత వ్యాసముక్తావళి. పు. 20
10. William Morris, Editor, The American Heritage Dictionary of the English Language, American Heritage Publishing Com., New york, 1973.
11. EDWARDFITZGERALD, The Rubaiyat of Omar Khayyam, P. 25

"Omar Khayyam the astronomer-Poet of Persian, was born at Nishapur, the capital of Khorasan about the middle of 11 th century" 12 అని విజ్ఞాన సర్వస్వం.

కాబట్టి ఖయ్యామ్ జన్మ సంవత్సరం గూర్చి ఇదమిత్థంగా నిర్ణయించడం సమస్యాయుతంగా ఉంది.

ఖయ్యామ్ పూర్తి పేరు గయాజుద్దీన్ అబుల్ ఫతహ్ ఉమర్ ఇబ్న్ ఇబ్రహీమ్ అలఖైయామీ. పారశీకుల పేర్ల చివర తండ్రిపేరు జోడించబడుతుంది. అందువల్లనే ఖయ్యామ్ తండ్రిపేరు ఇబ్రహీమ్ అని స్పష్టమైంది. ఖయ్యామ్ ఎక్కడేకాని తన వ్యక్తిగత జీవితాన్ని వివరించలేదు.భార్యాపుత్రుల ప్రసక్తిలేదు. అతని సమకాలికులు, శిష్యులలో కొందరు అప్పుడప్పుడు వ్రాసిన కొన్ని వ్రాతలవల్ల ఇతని జీవితంలోని కొన్ని అంశాలు వెలుగులోకి వచ్చాయి.

## ఖయ్యామ్ శబ్దానికిగల అర్థం : పలువురి అభిప్రాయాలు

'ఖయ్యామ్' శబ్దానికిగల అర్థం గుడారాలు వేసే వాడని. ఈ విశేషణమాతని పూర్వుల వృత్తిని సూచిస్తుందని అనేకులు విశ్వసిస్తున్నారు. ఆదేశపు కవుల చరిత్రను, ఆకాలపరిస్థితుల్ని కనుగొన్నట్లయితే ఈవిశ్వాసానికి బలమైన ఆధారాలు కలవని శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారన్నారు 13

"పారసీక కవులందరును తఖల్లుస్ నామము పెట్టుకొనుట సామాన్యాచారమై యుండినది. ఫిరదౌసి, హాఫీజ్, అత్తారి, సాది, జామి అనునవి యిట్టి పేరులే. సంస్కృతకవులలో కూడ రత్నఖేటుడు, కోటిసారుడు, భవభూతి అను మారుపేరులుగల కవులుండిరి. ఇటువంటి లాంఛనములను బట్టి వారివారి వృత్తులను. నిర్ణయింప సాహసించుట చూడ బేకర్, బార్బర్, స్మిత్ అనుపేరులు గల ఆంగ్లేయులందరు ఆయావృత్తులకు సంబంధించిన వారని చెప్పినట్లుండును"14 అని దువ్వూరి రామిరెడ్డి గారన్నారు.

12. OMAR KHAYYAM, The illustrated chambers's Encyclopedia, Volume VII, chambers Limited, London, 1930, P. 602.
13. డా॥ బూర్గుల రామకృష్ణారావు, సారస్వతవ్యాసముక్తావళి, పు. 21
14. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో. పు. XIII.

ఉమర్ ఖయ్యామ్ జీవితం గురించి లభించిన ఆధారాల్ని బట్టి గుడారాలు వేసినట్లు ఎక్కడా కన్పించదు. ఇతని పూర్తిపేరుకు గుడారాలు నిర్మించే కుటుంబానికి చెందిన ఇబ్రహీమ్ పుత్రుడని అర్థం. దీన్ననుసరించి ఇతని తండ్రి తాతలు డేరాలు వేసేవారని కొంత ఊహించ వీలవుతుంది. అయితే ఉమర్ ఖయ్యాముకు ఈ వృత్తికి సంబంధం కన్పించడంలేదు.

"శబ్దములు అనుడేరా వేసి రుబాయీలనెడి నాలుగుపాదములను కఱ్ఱలతో భావములను తెలుపువాడని అర్థము కానోపు" 15 అని శ్రీ కర్ణ రాజశేషగిరిరావు గారును, "ఈతడు తన జీవితకాలములో గుడారాలు వేసినట్లు సాక్ష్యాలు లేవు గాని యీనాటికిని తానువేసిన విజ్ఞానపు గుడారాలలో వివేకవంతులకు విశ్రాంతి నొసగుచునే ఉన్నా" 16 డని స్ఫూర్తిశ్రీగారును లోతుగా తరచిచూచి విశిష్టార్థాన్ని వెలికి తీశారు.

ఈ విధంగా ఖయ్యామ్ పేరులోనే సాధారణార్థం, విశిష్టార్థం రెండూ గోచరిస్తున్నాయి. ఇతని ప్రతిరుబాయీ సాధారణంగా ఇలాంటి రెండర్థాలు కలిగి ఉంటుంది. అందువల్లనే ఖయ్యామ్‌ను గురించి వింతగా చెప్పుకొంటారు సాహితీప్రియులు.

## ఖయ్యామ్ విద్యాభ్యాసం - ప్రతిభ

పద్దెనిమిదేండ్లప్రాయంలోనేసకల విద్యలు నేర్చుకోగలిగిన ధీశాలి ఖయ్యామ్. ఈతడు జన్మించిన నిషాపూర్ పారశీకంలోని ఖురాసాన్ ప్రాంతానికి చెందింది. ఆరోజుల్లో ఈపట్టణంలో రాజప్రతినిధి ఉండేవాడు బాగ్దాదులో సైతం లేనన్ని విశ్వవిద్యాలయాలు ఇక్కడ ఉండేవి. వాటిల్లో నైజామియా విశ్వవిద్యాలయంపేరుగన్నది. 'ఇమామె గజ్జాలి' అనే అరబ్బీ మహా విద్వాంసుడు దీనికి ప్రధానాచార్యుడు. ఖయ్యామ్ ఈ విశ్వవిద్యాలయంలో ఉత్తీర్ణుడయ్యాడు. అంతటితోతృప్తిపడలేదు. అఖండ ప్రజ్ఞాధురీణులయిన విద్వాంసు లెక్కడ ఉన్నా వెళ్లి తర్కవ్యాకరణ జ్యోతిష్యం వంటి శాస్త్రాలు కూలంకషంగా అధ్యయనం చేశాడు. ఇంతేగాక ఖగోళం, తత్త్వశాస్త్రం, చరిత్ర, భౌతికశాస్త్రం, గణితం, వైద్యం వంటి విభిన్న శాస్త్రాల్లో తిరుగులేని జ్ఞానం సంపాదించాడు.

15. కర్ణరాజశేషగిరిరావు, ఉమరు ఖయ్యాము, భారతి జూన్ 1969.
16. స్ఫూర్తి శ్రీ, తెలుగులో ఉమర్ ఖయ్యాము. సాహితీ వాల్లభ్యము, పు.469

'తఖ్వీమె జలాలీ' అనేగొప్ప జ్యోతిష సిద్ధాంత గ్రంథం ఖయ్యామ్ రచించాడు. ఇప్పటి ఇంగ్లీషు కాలెండరు ఇతని సిద్ధాంతం అనుసరించిందే అని గిబ్బన్ వంటి చరిత్రకారులు అంగీకరించారు. 'అరాయిసన్ నఫాయిస్' అనేతత్త్వశాస్త్రం (PHILOSOPHY), వ్రాశాడు. అల్‌జబర్ (ALGEBRA) అరబ్బీలో వ్రాశాడు. ఇది అనంతరం ఫ్రెంచిభాషలో పరివర్తించబడింది. ఒఖలీదస్ (GEOMETRY) వ్రాసి కఠినతరసమస్యల్ని ప్రస్తరించి చూపాడు. ఇల్మెతబీయాత్, దర్బారయె హుక్మతుల్ ఖాలిఖ్ (వేదాంతశాస్త్రం), రిసాలా [శారీర అర్థిక శాస్త్రం], రిసాలాయె మౌసూమా (తర్కశాస్త్రం), ఇంకా రసాయన శాస్త్రం-వంటి వివిధ శాస్త్రాలకు సంబంధించిన అమూల్య గ్రంథాలెన్నో వ్రాసి అపూర్వమైన తన ప్రజ్ఞ పాటవం ప్రదర్శించి విశ్వవిఖ్యాతుడయ్యాడు. ఇప్పటికి వీటిని ప్రమాణ గ్రంథాలుగా పండితులు పరిగణిస్తున్నారు.17

గణితజ్యోతిశ్శాస్త్రాలపై ఇతనికి అంతులేని అభిమానం. సమకాలికులే ఇతన్ని దైవజ్ఞుడుగా అభివర్ణించారు. గణితం వంటివిభిన్నశాస్త్రాల్లో ఎనలేని విజ్ఞానం గడించిన ఇతనికి రసవత్కవిత అల్లే నైపుణ్యం ఎలాకలిగిందో ఊహాతీతం. అభ్యుదయ పురోగామియై ప్రతివిషయం హేతువాద దృష్టితో వితర్కించి నిర్ధారణ చేసేవాడు. శాస్త్రవేత్తగా వేదాంతిగా దేశమంతటా ఖ్యాతిగన్నాడు. ఇతన్ని హకీమ్ అనిపిలిచేవారు. హకీమ్ అంటే వేదాంతి, వైద్యుడు అని రెండర్థాలు. ఉమర్‌ఖయ్యామ్ వేదాంతియేకాదు, వైద్యుడుకూడ. 'ఇమామ్' అని కూడ పిలిచేవాళ్లితన్ని. 'ఇమామె-ఖురాసాన్' 'అల్లామ-ఉల్లమా' అనే బిరుదులు కూడ ఇతనికి ఉన్నట్లు ఖిఫ్తీ అనే చరిత్రకారుడు వ్రాశాడు.18

ఉమర్ ఖయ్యామ్ విద్యాభ్యాసకాలంలో జరిగిన ఒక వింతకథ ఉద్ఘాటింపవగింది. ఇమామ్ మౌఫిక్ అనే సుప్రసిద్ధ శాస్త్రవేత్త నిషాపూరులో ఉండేవాడు. ఇతడు ఆచార్యుడుగా ఆరాధనీయుడు. ఇతనివద్ద చదువుకొన్నవాళ్లు అదృష్టవంతులవుతారనే విశ్వాసం ఉండేది. నిజాముల్‌ముల్క్, ఉమర్ ఖయ్యామ్, హసన్‌బిన్ సబాహ్ ముగ్గురు ఇమామ్‌గారివద్ద శిష్యులయి కలసి

17. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పీ. పు. IX, X.
18. ఎస్. సదాశివ, ఫారసీకవుల ప్రసక్తి, పు. 25.

మెలసి అధ్యయనం చేసేవారు. మన ముగ్గురిలో ఎవరిని అదృష్టదేవత వరించినా మిగిలినవారిని అతడు తనతో సమానమైన వారినిగా చేయాలని హసన్‌బిన్ సబాహ్ చేసిన ప్రతిపాదన ముగ్గురు అంగీకరించారు. కొన్నాళ్లకాలదృష్టం నిజాముల్‌ముల్క్‌కు కలిగింది. అల్ప్‌అర్సలాన్ ప్రభువువద్ద అతడు ప్రధాన మంత్రి అయ్యాడు. ఒకరోజు ఉమర్ ఖయ్యామ్ నిజాముల్‌ముల్క్ దగ్గరికి వెళ్లాడు. పదవీకాంక్షతో మాత్రంకాదు. గతంలో జరిగిన ఒడంబడిక నిజాముల్ ముల్క్ స్మృతిపథంలో మెదిలింది. ఉమర్ ఖయ్యామ్‌ను అతడు గౌరవించాడు. పాదుషా వద్ద రాజోద్యోగమిప్పిస్తానన్నాడు. ఆమాటవిన్న ఖయ్యామ్ ప్రశాంత చిత్తంతో చిన్ననాటి ఒప్పందం గుర్తుంచుకొని మీరు చూపుతున్న శ్రద్ధాసక్తులకు కృతజ్ఞుణ్ణి. మీదయవల్ల నా అధ్యయనం, అధ్యాపకం రెండూ ఏ ఒడుదుడుకులూ లేకుండా జరిగితే మరేమీ కోరను అన్నాడు.

ఖయ్యామ్‌కు ఉద్యోగాపేక్షలేదని నిజాముల్‌ముల్క్ గ్రహించి సంవత్సరానికి 1200 తోమానులు[19] ఆదాయం వచ్చే జాగీరు నిషాపూరులో ఇచ్చి పంపాడు,[20]

ఖయ్యామ్ ఏ అధికారం పదవి ఆశించని వాడని విద్యాదాత అని స్పష్టమైంది,

**"He [OMAR KHAYYAM] lived with his own thoughts and studies and pleasures, and did not aspire to the official dignities and courtly occupations he might have had"[21]** అని అనడంలో ఎంతో వాస్తవముంది.

---

19. తోమాను — ఇరవైరూపాయలు
20. EDWARD FITZGERALD, The Rubaiyat of OMAR KHAYYAM, P. P. 26-29
21. The fame of Omar Khayyam as an astronomer and Mathematician, The Children's Encyclopedia, Volume VIII, The Educational Book Company Limited, London E. C. 4P. 5676.

## ఉమర్ ఖయ్యామ్ కవిగా

చరిత్రకారులితనిని ఖగోళశాస్త్రజ్ఞుడుగా, గణిత శాస్త్రజ్ఞుడుగా, జ్యోతిష్కుడుగా మాత్రమే గుర్తించారు. కవిగా ఇతడు చరిత్రకెక్కలేదు. అయితే ఈనాడు ఇతని అఖండమైన ఖండాంతర కీర్తి రుబాయీల పైనే ఆధారపడి ఉంది. తాను కవిగా రాణించాలనే కాంక్ష అతనికిలేదు. మహాకావ్యాల రచనకు పూనుకోలేదు. శాస్త్రపరిశ్రమలో విసుగెత్తిన మనస్సుకు వినోదం కలిగించే నిమిత్తం కవిత్వం చెప్పాడు. తనచుట్టూ ఉన్న పరిస్థితుల్ని అవగాహన చేసుకొన్నాడు. మనసులోని ఆవేదనలు, ఆవేశాలు రుబాయీల రూపంలో పరుగులు తీశాయి. ఆశువుగా చెప్పిన నాలుగుపాదాల రుబాయీల్లో పెల్లుబికిన కవితాధార అన్నిదేశాల్లో అడ్డులేని ప్రవాహమై పరవళ్లు త్రొక్కింది. ఈ రుబాయీల సంగ్రహమే 'రుబాయియాత్' అనివ్యవహరించబడింది.

ఖయ్యామ్ రుబాయీల్లో శాశ్వతంగా జీవించాడు. ఎందరెందరు మహారాజులో కత్తిపట్టి అరివీరభయంకరులుగా ప్రవర్తించి రాజ్యవిస్తరణ చేసి ఏపేరూ లేకుండా కాలగర్భంలో కలిసిపోయారు. కాని ఖయ్యామ్ పేరు ఈనాటికి ప్రజల నాలుకల్లో మెదలుతూ ఉంది. రాజుకన్నా కవి ఎంత గొప్పవాడో స్పష్టపరచేందుకు ఖయ్యామ్ జీవితమొక్కటిచాలు తార్కాణంగా చెప్పుకోడానికి.

"రాజు మరణించె నొకతార రాలి పోయె
కవియు మరణించె నొకతార గగన మెక్కె
రాజు జీవించె రాతి విగ్రహము లందు
సుకవి జీవించె ప్రజలనాలుకల యందు"22

అనిమున్నుచెప్పిన జాషువాగారి మాట నిత్యసత్యం కాదని ఎవరనగలరు? గొప్పకావ్యాలు వ్రాయకపోయినా గుణప్రధానమైన ఏకొద్దిపాటి కవిత్వమో వ్రాసి ప్రజాహృదయాల్లో నిలిచిపోయిన కవులెందరో ఉన్నారు.

---

22. జి. జాషువ, క్రొత్తలోకము, పు. 10

దువ్వూరి రామిరెడ్డిగారన్నట్లు ఒక్క శతకం రచించి మయూరుడు గొప్పకవి అనిపించుకొన్నాడు. ఒక్క ఎలిజీవల్లనే థామస్‌గ్రే ప్రఖ్యాతుడయ్యాడు. భాషా దేశపాన్ కవి కొన్ని 'హైకు' పద్యాలు (మనద్విపదకంటే చిన్నవి) వ్రాసి ప్రసిద్ధుడయ్యాడు. ఆటవెలదుల్లో వేమన జీవించాడు.23

ఈ కోవకు చెందిన కవుల్లో ఉమర్ ఖయ్యామ్ ప్రముఖస్థానం వహించాడు. ప్రపంచంలోని అన్నిముఖ్యభాషల్లోకి ఇతని రుబాయీలు అనువదించ బడడమే ఇందుకు కారణం కావచ్చు.

## జ్యోతిశ్శాస్త్రజ్ఞుడుగా

మలిక్‌షా అనేపేరుతో ప్రసిద్ధి గాంచిన జలాలుద్దీన్ పారశీక చరిత్రలో ముఖ్యస్థానం వహించిన పాదుషా. ఇతనికాలం (క్రీ. శ. 1079) లో జలాలీశకం ప్రారంభమైంది. ఇతడు జ్యోతిషాలయం స్థాపించాడు.

జ్యోతిశ్శాస్త్రంలో ఖయ్యామ్‌ను మించినవారు ఆకాలంలో ఎవ్వరూలేరని అతి. పంచాగం సంస్కరించే నిమిత్తం ప్రసిద్ధ జ్యోతిష్కుల్ని మలిక్‌షా నియమించాడు. ఖయ్యామ్ వారికి నాయకుడై కడుసామర్థ్యంతో ఆపని నెరవేర్చి ప్రశంసలు పొందాడు.

గ్రహగతుల ననుసరించి వాతావరణం మార్పును ముందుగా గ్రహించడంలో ఖయ్యామ్ అద్భుత ప్రజ్ఞ కలవాడు.

"పాదుషా సదరుద్దీన్ మొహమ్మద్ వేటకు వెళ్లదలిచాడు. గాలీవానా లేనిదినం నిశ్చయించవలసిందని ఖయ్యామ్‌కు కబురు చేశాడు. రెండు దినాలు ఆలోచించి ఒక దినం నిర్ణయించాడు ఖయ్యామ్. ఆదినం బయల్దేరి వెళ్తుంటే రెండు కోసులు వెళ్లేటంతలో ఆకాశం మేఘావృతమైంది. వర్షం తప్పదని పించింది. పరివారజనులు తిరిగి వెళ్లటమే మంచిదన్నారు. ఖయ్యామ్‌ను

23. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో, పు. XXVII

పరిహసించారు. అతని పాండిత్యం మీద సంపూర్ణ విశ్వాసం వున్నందువలన ముందుకుసాగాడు పాదుషా.అరగంటలో ఎక్కడి మబ్బులక్కడవిచ్చిపోయాయి. చినుకైనా రాలలేదు నేలమీద. అంతటి జ్యోతిష జ్ఞాన మతనిది" 24

## వైద్యుడుగా

పాదుషా సంజర్ సల్జూఖీ ఉమర్‌ఖయ్యామ్‌ను అర్ధసింహాసనమిచ్చి గౌరవించేవాడు. ఇతడు యువరాజుగా ఉన్నప్పుడు మశూచి వ్యాధికి గురి అయ్యాడు. రాజవైద్యులు చికిత్స చేశారు. ఫలితం శూన్యం. పేరు మోసిన మహావైద్యులు సైతం నిస్సహాయత ప్రకటించారు. ఉమర్‌ఖయ్యామ్ చికిత్సచేసి అతనికి ప్రాణం పోశాడు. 25 ఇతని వైద్యశాస్త్రపరిజ్ఞానం అమోఘమయిందని వివరించడానికి ఈ ఒక్క సంఘటనచాలు.

## హేతువాదిగా

ఖయ్యామ్ అభ్యుదయ పురోగామి. పూర్వాచార పరాయణుడు కాడు. ప్రతివిషయం హేతుబద్ధంగా తర్కించి నిర్ధారణ చేసేవాడు. తాను రచించిన రుబాయీలు శిష్యులు మిత్రులు ఏర్పాటుచేసిన సభల్లో చదివేవాడు. హేతువాదంతో కూడిన ఇతని రుబాయీలుధర్మవిరుద్ధాలైన గీతాలని.సంప్రదాయ వినాశనానికి హేతువుగా రూపొందుతాయని నిష్ఠాగరిష్ఠులు వీటినిబహిష్కరించారు. వీటిలోని మధుపానం, మానినీలాలనం, ఆచార నిష్ఠాగరిష్ఠుల నిరసనం వారికి పరుషంగా తోచింది. ఖయ్యామ్ ప్రతిపాదించిన హేతువాద పూరిత తర్కాలు చార్వాక మతసిద్ధాంతాల వంటివని భావించబడింది. అందువల్ల ఇతడు కొన్ని బాధలకు గురి అయ్యాడు.

ఖయ్యామ్ జ్ఞాపకశక్తి అద్భుతమైంది. అస్ఫహాన్‌మఖాంలో విడిసి ఉన్నప్పుడు అమూల్యమైన గ్రంథమొకటి అతని కంట పడింది. గ్రంథంలోని అపూర్వవిషయాలు ఖయ్యామ్‌ను ఆశ్చర్య పరచాయి. అయితే ఆ పుస్తకం

24. ఎస్. సదాశివ, ఫారసీ కవుల ప్రసక్తి, పు. 25.
25. ఎస్. సదాశివ, ఫారసీకవుల ప్రసక్తి, పు. 25.

ఇంకెక్కడా లభించవు. అందువల్ల ఏడుసార్లు దాన్ని ఆమూలాగ్రంగా
. నిషాపూరుకు వచ్చి తన జ్ఞాపకశక్తిని బట్టి తిరుగవ్రాశాడు. తరువాత
ప్రతులకు మాతృకతో పోల్చి చూస్తే మూడు నాలుగు పొరపాట్లు తప్ప
ంతా సరిగా ఉందట.

## ఖయ్యామ్‌కు మార్గదర్శకులైన పండితులు

ాబీ (క్రీ.శ. 870-960)

ఇతడు మహామేధావిగా చరిత్ర ప్రసిద్ధి కెక్కాడు. అరబ్బీలో అఖండ
ం గడించినవాడు. అరిస్టాటిల్ తత్త్వశాస్త్రంపై సమగ్రమైన వ్యాఖ్య
మేగాక గ్రీక్ భాషలోని న్యాయశాస్త్ర, మానసికశాస్త్రాల్ని మరి కొన్ని
అరబ్బీలోనికి అనువదించాడు. 26

ౕసీనా (క్రీ. శ. 979-1037)

ఇతడు మహాకవిగా, తత్త్వవేత్తగా, వైజ్ఞానికుడుగా, గణితశాస్త్రజ్ఞుడుగా
ంతటా మధ్యయుగంలో పేరు పొందిన అరబ్బీ పండితుడు అబూ
హుస్సేన్ ఇబ్నుసీనా అన్నది ఇతని పూర్తి పేరు. ఇబ్నుసీనా అనే
తడు పాశ్చాత్యులకు పరిచితుడు. అరబ్బీలో దాదాపు 100 గ్రంథాలు
. వీటిలో అత్యధికభాగం వైజ్ఞానిక, గణిత, వైద్య, తత్త్వశాస్త్రాలకు
నవి. ఇతని 'అల్ కామూన్' అనే వైద్యశాస్త్రం, విజ్ఞాన సర్వస్వమనదగిన
'షిఫా' అనే మహాగ్రంథం విశ్వవిఖ్యాతి నార్జించాయి.27 దేవుడద్వ
ంద్రియగోచరుడు కాడని సృష్టికి హేతుభూతుడని ఇతని అభిప్రాయం.

రైహాన్ బేరూనీ (క్రీ. శ 973—1048)

తడు బహుభాషావిదుడు. చారిత్రకుడు. ఖగోళ శాస్త్రవేత్త. ఇతని పూర్తి

---

కుర్తి శేషగిరిరావు, మతరాజ్యయుగము, విజ్ఞానసర్వస్వము, మొదటి
టము, పు 103.

ూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ, అవిసిన్నా, విజ్ఞాన సర్వ
ం, ఆరవ సంపుటము, పు. 523.

పేరు అబుల్ రైహాన్ ముహమ్మద్ ఇబ్నె అహమ్మద్ అల్ బేరూని. అల్ బేరూనీ అనికూడ ఇతడు పిలువబడతాడు. సంస్కృతంలో పాండిత్యం గడించి హిందూ మత సంస్కృతుల గురించి బాగా తెలుసుకొన్నవాడు. అంతకుముందే అరబ్బీ, హిబ్రూ, పహ్లవీ, సిరియక్, సార్డియన్ భాషల్లోనూ గణిత, రసాయనిక, వృక్ష, ఖగోళశాస్త్రాల్లోను నిష్ణాతుడు. ఆయాశాస్త్రాలకు సంబంధించిన అనేక గ్రంథాలు రచించాడు. భారతదేశాన్ని సందర్శించి భారతదేశ మత, సంస్కృతి, చరిత్రలను తెలియజేసే అసన్-ఉల్-బఖియా, కితాబ్-ఉల్-హింద్ అనే రెండు గ్రంథాలు అరబ్బీలో రచించాడు. ఆకాలపు భారతదేశ సాంఘిక పరిస్థితిని, చరిత్రను తెలుసుకొనేందుకు ఈ గ్రంథాలు చరిత్రకారులకు ఎంతో ఉపకరిస్తున్నాయి.28

పై ముగ్గురు విద్వాంసులు సామాన్యులు కారని, వారి పాండిత్యం వర్ణనాతీతమని స్పష్టమైంది. ఖయ్యామ్ వీరిని మార్గదర్శకులుగా భావించి ఉంటాడు. అందుకే వీరిగ్రంథాల్ని బాగా అధ్యయనం చేశాడు. బహుముఖమై అప్రతిహతమయిన ప్రతిభతో రాణించాడు.

## జీవిత పరిసమాప్తి

ఇతని అపరవయస్సులో దేశం రాజకీయ దుస్థితికిలోనైంది. తనపేర జలాలీశకం స్థాపించుకొన్న మలిక్‌షా వంశాన్ని తాతారీలు పరాజితం చేశారు. తన చిన్ననాటి స్నేహితుడు హసన్‌బిన్ సబాహ్ ఇస్మాయీల నాయకుడయ్యాడు. ఇస్మాయీల సంఘం ఒక మత రాజకీయ సంస్థగా పరిగణించబడింది. ఖయ్యామ్‌కు జాగీరు ప్రసాదించిన నిజాముల్ ముల్క్ ఇస్మాయీలచే హత్య చేయబడ్డాడు. రాజకీయంగానే కాక మత సాంఘిక పరిస్థితులదృష్ట్యా దేశం అల్లకల్లోలమైంది. మూఢభక్తి, మతపాషండత్వాల, అజ్ఞానం తిరిగి విజృంభించాయి. స్వతంత్రభావుకుడు, హేతువాదియైన ఖయ్యామ్‌ను ఇవి కలచివేశాయి. క్రీ.శ. 1100వ సంవత్సరం ప్రాంతంలో ఇతడు మక్కాయాత్రచేసి వచ్చాడు. హిజరి 516(క్రీ.శ.1122)మొహరంనెల 12వతేదీ గురువారం నిషాపూరులో స్వర్గస్థు

---

28. చిమకుర్తి శేషగిరిరావు, అల్‌బెరూనీ, విజ్ఞాన సర్వస్వము, మొదటి సంపుటము, పు. 272 మరియు చూడు. పు. 103.

డయ్యాడు. శతాబ్దికంటె ఎక్కువకాలం జీవించాడని చరిత్రకారుల అభిప్రాయం.చివరిరోజు దాకా చక్కని ఆరోగ్యంతో ఉన్నాడు. ఖయ్యామ్ తన శిష్యప్రాయుడైన నిజామీ ఉరూజీతో నా సమాధిమీద చెట్లు పూలవర్షం కురిపిస్తాయిఅని అన్నాడట. అంతటి గొప్పవ్యక్తి వాక్కు వృథాకాదని నిజామీ ఉరూజీ అభిప్రాయం. ఖయ్యాం మరణానంతరం అతడు ఖయ్యామ్ సమాధిని దర్శించాడు. తోటగోడ ప్రక్కన ఎత్తైన పూల వృక్షాల క్రింద సమాధి నిర్మించబడి ఉంది. దట్టంగా పూల వర్షం కురుస్తూంది. ఆకాంక్షితంగా అతని కన్నులు చెమ్మగిల్లాయి.29 1934 లో ఈరాన్ ప్రభుత్వం ఈ సమాధిపై క్రొత్తగా పాలరాతి కట్టడం కట్టించింది.30

"ఈలోకంలో శాశ్వతమైంది ఏదీలేదు. జీవితం అశాశ్వతం. నిన్నటి సంగతి ఆలోచించదగిందికాదు. నేడునిజం. రేపు సందేహాస్పదం. జీవితాన్ని వ్యర్థంచేసుకోవద్దు.మధువును త్రాగు. మానిని పొందునుకోరు.పారలౌకికసుఖాలు ఇక్కడే అనుభవించు." - స్థూల దృష్టికి ఖయ్యామ్ రుబాయీల సారాంశమిది. అయితే ఇందులో ఎంతో తాత్వికార్థమూ ఉంది. అందుకే ఇతని సందేశం అపూర్వం, అమరం అని లోకం కొనియాడింది. ఖయ్యామ్ మహాకవిగా నిలిచాడు.

"The Poet of Agnostieism such was Omar Khayyam, though some in his poetry see nothing save the wine-cup and roses, and others read into it that Sufi mysticism with which, indeed, it was largely adulterated long after Omar's death. He was a true poet; Yet Fitzgerald's translation is so much finer that the value of the original is such mainly as attaches to Chaucer's or Shakespeare's Prototypes" 31

---

29. రియాజ్ జునేదీ, జజ్‌బాత్-ఎ- ఉమర్ ఖయ్యామ్, పు. 13
30. ఎస్. ఎమ్. రఫత్, ఉమర్ ఖయ్యామ్, విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పు. 593.
31. OMAR KHAYYAM, The illustrated Chamber's Encyclopedia, Volume VII, Chambers Limited, London, 1930, P. 602

అనే ఈవాక్యాల్లోగల వాస్తవం గమనార్హమైంది.

ఈ విధంగా సకల కళా కోవిదుడుగా, నానాశాస్త్ర పారంగతుడుగా, బహుముఖ ప్రజ్ఞాశాలిగా అన్నిటిని మించి మహాతాత్త్విక కవిగా సాటిలేని కీర్తి గడించిన ఉమర్ ఖయ్యామ్ అవిస్మరణీయుడు.

ప్రస్తుతం ఉమర్ ఖయ్యామ్ లేడుకాని ఆతని రుబాయీలేని దేశం లేదు.

ఇంతవరకు ఉమర్ ఖయ్యామ్ జీవితరేఖల్ని గూర్చి పరిశీలించడం జరిగింది. ఖయ్యామ్ హృదయాన్ని, ఆతని తాత్త్విక దృష్టిని కావ్యరూపంలో అపూర్వంగా చిత్రించిన డా. ఉమర్ అలీషా ఉదాత్తమైన వ్యక్తిత్వం కలవారు. తెలుగున సరససాహితీ సృష్టిచేసి కవిపండితవరుల ప్రశంసలందిన ప్రతిభావంతులు వీరు. ధారాశుద్ధి, భాషాప్రౌఢి, అర్థపుష్టికలిగిన సంప్రదాయకవిత్వం వ్రాయడంలో వీరు అందెవేసినచేయి. ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను తెలుగునకనువదించారు. 'ఉమర్ ఖయ్యామ్' అనే పేరుతో వెలసిన ఈ అనువాద గ్రంథం కమనీయమైన తెలుగు కావ్యంగా రూపు దిద్దుకొంది. అలీషాగారి ప్రతిభ బహుముఖమైంది. ఉత్తమ సాహితీవేత్తగా, మహాభావుకుడుగా, జాతీయాభిమానిగా, తత్త్వవేత్తగా, ఆధ్యాత్మిక విద్యాగురువుగా, వక్తగా రాజకీయవేత్తగా, కేంద్రశాసనసభ్యుడుగా కీర్తినార్జించారు. అలాంటి వీరి జీవితం ఖయ్యాం జీవితంతోపాటు పరిశీలించదగింది.

"ఏ పట్టణమున మ్రోల ఏలేరు ప్రవహించు
పృథివికి ముత్యాలపేరు వోలె
మున్నాట యువతి మూర్తి ఖేదములతో
విహరించు నేపీట వెల్గుపిండు
పీఠాంబ చెలియోగ పీఠహుంకృతి దుర్గ
ననిచి కాపుండు నే నగరి కెలన
కుంతీ మహాదేవి కూర్మి మేనల్లుండు
మాధవుండే పీట మరగినాడు

పెద్దగవనుల నేపుటభేదనమున
నెలమి నిలుచుండు వ్రీడావిహీన ఝషము
డట్టి పీఠాపురము జేరనరుగుదెంచె
పరమశైవుండు శ్రీ పరాశరసుతుండు"1

అని శ్రీనాథునిచే పొగడ్తగన్న పిఠాపురం ఉమర్ అలీషాగారి జన్మస్థలం. అలీషాగారు క్రీ. శ. 1885 వ సంవత్సరమున జన్మించారు. తండ్రి మొహియుద్దీన్ బాద్ షా. వేదాంతోప దేశగురుపులు. సూఫి తత్త్వవేత్త. చాంద్‌బీ అలీషాగారి జనని. పరమ భక్తురాలు.

"మన ఆంధ్రదేశమునందు తెనుంగున కవిత చెప్పిన ప్రప్రథమ ముస్లిములు వీరొకరే. తెలుగునందు పాండిత్యము సంపాదించిన పండిత ముస్లిములుండవచ్చును. చాలామంది ఉన్నారుకూడ. కాని ఆంధ్రసంస్కారముతో సంస్కృతము నభ్యసించి ప్రతిభతో సరసకవిత వ్రాసినవారు వీరు మాత్రమే. ఈనాడు తెలుగున కవిత్వము చెప్పు ముస్లిములు కలరు. ఆంధ్రసంస్కృతములందు దొక్కశుద్ధి కలిగిన పండితులున్నారు. కాని ఆకాలమున భగవద్గీత నన్వయ మొనర్చుకొని సూఫీ వేదాంత విషయములతో సమన్వయించి తెలుంగున కవిత్వము రచించి పాఠకుల మంత్రముగ్ధులం గావించి రసజ్ఞ శేఖరుల తలలూపించిన వారు ఉమర్ అలీషాః గారె"2 అని షేక్‌దావూద్ గారనడం అత్యుక్తి కాదు.

## ఉమర్ అలీషాగారి వంశ ప్రశస్తి

ఉమర్ అలీషాగారి పూర్వీకులు పారశీకదేశం నుండి ఢిల్లీ వచ్చారు. అక్కడినుండి హైదరాబాదు, అనంతరం పిఠాపురం చేరారు. ఈ విషయం ఉమర్ అలీషా ఇలా వివరించారు.

---

1. శ్రీనాథుడు, భీమేశ్వరపురాణము, పు. 55.
2. షేక్ దావూద్, మహాకవి ఉమర్ అలీషా : గారి జీవితసంగ్రహము, తెలుగు వైతాళికులు, సంపుటము- 3, పు. 195.

తే. గీ. "... ... మహాప్రభాత
గరిమగాంచిన మావంశమరయ పార
సీకమును బాసి ఢిల్లీకి జేరి హైద్ర
బాదునుండి పిఠాపురి వచ్చినిలిచె"3

మొట్టమొదట పిఠాపురంలో అడుగుపెట్టిన పూర్వుడు కబీర్‌షా. ఇతడు మహాతపస్సంపన్నుడు. మహిమాన్వితుడు. ఇతనికి పెక్కుమంది పౌరులు, పండితులు శిష్యులయ్యారు. ఇతని కుమారుడు మదార్‌షా. ఆధ్యాత్మిక విద్య రూపుదాల్చినవాడు. బ్రహ్మవిద్యాబోధకుడు. ఇతనికి హసన్ మియాషా తనయుడై పుట్టి పరతత్త్వమును గూర్చి బోధించాడు. ఇతనికుమారుడు కహనేషావలి. పవిత్రచరిత్రుడు. 'మాయా తమసాప్తికి ద్యుమణి' యై వెలిగినవాడు. పెక్కు భవిష్యదర్థములు చెప్పినవాడు. కహనేషా తనయుడే మొహియుద్దీన్ బాద్‌షా. ఈయన తత్త్వవిదుడు. సమస్త ధర్మవిజ్ఞాన కళాకలాపుడు- మహిమాన్వితస్వరూపుడు. ఎనిమిదివేలమంది శిష్యులు కలవాడు అలీషాగారి జనకుడు.4

" ... మొహియుద్దీన్ బాద్‌షాగారు ఒకగొప్పవేదాంతి. ఆధ్యాత్మిక విద్యావేత్త. సంస్కృతంతో పరిచయం ఉంది. ఫారసీ అరబ్బీ భాషలలో పండితుడని చెప్పేవారు. సంస్కృతం కూడా వచ్చును కనుక హిందూమతంలో ఉన్న గొప్పగొప్ప విషయాలు తెలుసుకొని అన్నిమతాల్లోనూ ఉన్న సారాంశాలను ఆకళింపుచేసుకొని ఒకనూతనమైన మార్గాన్ని చక్కని తెలుగులో శిష్యులకు బోధించేవారు"5

"ఆ మొహియుద్దీన్ బాద్‌షా
నామమహాయోగి కగ్రనందనుడను నా
నామహితాగమ హిత వి
ద్యామతి "ఉమ్రాలిషా" మహాకవి నేనున్"6

అని అలీషాకవి చెప్పుకొన్నారు.

3. ఉమర్ అలీషాకవి, సూఫీవేదాంతదర్శనము, పు. 4.
4. ఉమర్ అలీషాకవి, సూఫీవేదాంత దర్శనము, పు. 4
5. కురుమెళ్ల వేంకటరావు, మాపిఠాపురం, పు. 129
6. ఉమర్ అలీషాకవి, మహమ్మద్‌రసూల్‌వారిచరిత్ర, పీ. పు. ii

ఉమర్ అలీషాగారే కాక వారి పూర్వీకులందరు ఆదినుండి ఆధ్యాత్మిక విద్యాసంపత్తికి భాషా పాండిత్యాలకు పేరుగన్నవారని పై పరిశీలనవల్ల స్పష్టమైంది.

## విద్యాభ్యాసం

శ్రీ ఉమర్ అలీషా పిఠాపురం హైస్కూలులో చదివారు. ఆరోజులలో దక్షిణాదిన ఉత్తమ ప్రధానోపాధ్యాయుడుగాను సుప్రసిద్ధ సాహితీ వేత్తగాను పేరునిలుపుకొన్న శ్రీ కూచి నరసింహం అలీషాగారి గురువులు.

సంస్కృతాంధ్రాల్లో అప్రతిహతమైన ప్రతిభకల బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రివద్దను, శ్రీదేవులపల్లి సుబ్బారాయశాస్త్రులు, శ్రీ తమ్మన్నశాస్త్రివద్దను. శ్రీ ఉమర్ అలీషా సంస్కృతాంధ్రాలు అధ్యయనం చేశారు 7

తండ్రిగారి సభ ఒకవేదాంతపీఠంగా విలసిల్లేది. అలీషాగారు తండ్రికి తగిన తనయులు. అరబ్బీ, పర్షియన్, ఉర్దూ భాషలు అలీషాగారికి కరతలామలకమయ్యాయి. సంస్కృతాంధ్రాలు తలస్పర్శిగా అధ్యయనంచేసి మంచి విద్వత్తు గడించారు. హిందీ భాషలో అభినివేశం ఉంది. "ఆంగ్లమున వ్రాయుట మాటాడుట యెరుగుదురు. కాని ఆంగ్ల పద్యకావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవేశములేదు."8

అనితరసాధ్యమైన వీరి కృషి, దీక్ష బహుభాషావేత్తగా వీరిని తీర్చిదిద్దింది. ఉన్నతవిద్యాభ్యాసం చేసి డిగ్రీలు మాత్రం వీరు సంపాదించలేదు.

## బాల్యంలోనే వ్యక్తమైన ప్రతిభ

పూవుపుట్టగనే పరిమళిస్తుంది. మరీ చిన్నవయసులోనే కవిత్వం చెప్పడం ప్రారంభించారట అలీషాగారు.

---

7. కురుమెళ్ల వేంకటరావు, మాపిఠాపురం, పు. 130
8. మొహమ్మద్ కబీర్‌షా, ఉమర్ అలీషా, విజ్ఞానసర్వస్వము, 4వ సంపుటము, 1961, పు. 727-728.

"శ్రీ బ్రహ్మర్షి ఉమర్ అలీషాకవిగారు 8 సం.ల ప్రాయములో ఉంతగా శృంగవృక్షమనే గ్రామమందు [పశ్చిమ గోదావరి జిల్లా] వారి తండ్రి గారితో నుండగా వారితాతగారైన శ్రీ కహనేషావలిగారి శిష్యుడయిన మాసాబత్తుల పద్మనాభముగారు గంగాదేవి శంతనమహారాజును విడిచి వెళ్ళుచున్నప్పుడు ఆయన తనభార్య గంగాదేవి కొంగును బట్టి బ్రతిమాలుచున్న చిత్రపటము చూపి శ్రీ కవిగారిని వర్ణింపుమన్నప్పుడావర్ణన ఆశువుగా తేటగీతకావ్యముగా మారినది."9

"తెలుగులో కవిత్వం వ్రాయడం చిన్నప్పుడే అలవర్చుకొన్నారు. హైస్కూలులో చదువుకొనేటప్పుడే, పద్నాలుగు ఏళ్ల వయసప్పుడే తెలుగులో పద్యాలు వ్రాయడం, ఉపన్యాసాలివ్వడం మొదలు పెట్టారు. అందుకే ఆయన్ని చిన్నప్పటినుంచీ కవిగారు అని పిలిచేవారు."10

పద్నాలుగవయేట ధారాళంగా కవిత్వం చెప్పినట్లు తెలుస్తూంది. పదారవయేట తమవంశగురువులయిన శ్రీ అఖైలలీషా: గారిపేర బ్రహ్మవిద్యా విలాసమనే గ్రంథం శతకంగా రచించి అసాధారణ ప్రజ్ఞ ప్రకటించారు. ఆసంద ర్భంగా వీరు చెప్పిన పద్యమిది—

> "బాల్యమునందు షోడదశవత్సర ప్రాయమునందు నన్నుసా
> శీల్యము నొప్ప పండితులు జీవుని కీశ్వర వృత్తిగల్గ సా
> కల్యముగాను దెల్పు శతకంబు రచింపుమటన్న బుద్ధిచా
> పల్యత చేత తక్షణము వ్రాసితి తప్పు గణింప కింతయున్"11

అలీషాగారు బాల్యంనుండి తత్త్వవేత్తయేగాక ఎంతటి వినయ సంపన్నుడో ఈ పద్యం వివరిస్తూంది.

నాటకాంతం హి సాహిత్యమ్ అని కదా! అయినా అష్టాదశ వర్షప్రాయం లోనే నాటక లక్షణాదులతో 'మణిమాల' అనే నాటకం రచించి ప్రచురించారు"

9. ఉమర్ అలీషాకవి, బర్హిష్మతీదేవి, పీ. పు. 1
10. కురుమెళ్ల వెంకటరావు, మా పిఠాపురం, పు. 129-130.
11. ఉమర్ అలీషాకవి, బ్రహ్మవిద్యా విలాసము, పు.8

అది షేక్స్పియర్ మహాకవి నాటకం వలె ఉన్నదని"12 అప్పటి పత్రికలు ప్రశంసించాయట.

ఈ విధంగా కవిగారు బాల్యంలోనే ధారాశుద్ధి కలిగిన కవిత్వంచెప్పి నాటకరచనచేసి సహజకవిగా పేరుగన్నారు.

## ఉ ద్యో గ తి ర స్కా ర ము

అలీషాగారు ఉత్తమశ్రేణికి చెందిన విద్యావేత్త. ప్రజల్లో పలుకుబడికల వారు. అంగీకరించే పక్షంలో ఉద్యోగం ఇస్తామని పలుచోట్ల నుండి ఆహ్వానాలు అందాయి. అందుకు వీరు అంగీకరించలేదు.13 ధనార్జనచేయడంగాని సుఖమైన జీవితం గడపడంగాని సుతరామూ వీరికి ఇష్టంలేని పని. ఎట్టి బలహీనతకు లొంగకుండా లోకసేవయే ధ్యేయంగా తలచారు. దృఢసంకల్పంతో సహజ ధర్మమైన ఆధ్యాత్మిక పీఠాచార్యత్వాన్ని చేపట్టి, భాషాసేవ ప్రధానంగా భావించి వంశాచారాన్ని నిలబెట్టారు.

## ర చ న లు

శ్రీ కవిగారి కవితాశైలి అనన్య సామాన్యమైందని గంగాసలిలంలాగా స్వచ్ఛమైందని నయాగరాలాగా ధారాపాతమైందని ప్రశంసలందింది. ఈ కవితా ధార తెలుగు సాహితీక్షేత్రంలో ప్రవహించింది. బంగారు పంటల్ని పండించింది.

అరవై ఏళ్లలో దాదాపు 50 కృతులు వీరు రచించారు. ఇవి సాహిత్యం లోని వివిధ ప్రక్రియలకు సంబంధించినవి. కావ్యాలు, అనువాదాలు, గేయాలు, నాటకాలు, నవలలు మొదలైనవి. 50 రచనలలోను 34 మాత్రమే లభిస్తున్నాయి. లభిస్తున్న ముప్పైనాలుగు రచనలలోను ఇరవైమూడు మాత్రమే ముద్రిత మయ్యాయి. ఉమర్ అలీషా గ్రంథప్రచురణసంఘం వారే సరస్వతీప్రెస్ రాజమండ్రిలో ఎక్కువభాగం ప్రచురించారు.

---

12. ఉమర్ అలీషాకవి. మహమ్మద్ రసూల్‌వారి చరిత్ర, పు.1
13. — పై గ్రంథమే — పు.1

వీరి రచనలన్నీ క్రింది విధంగా ఉన్నాయి.*

## నాటకాలు

1. అనసూయాదేవి
2. కళ
3. చంద్రగుప్త
4. ప్రహ్లాద లేక దానవవధ
5. మణిమాల
6. మహాభారత కౌరవ రంగము
7. విచిత్ర బిల్హణీయము
8. విషాద సౌందర్యము

## ఏకాంకికలు

9. నరకుని కాంతాపహరణము
10. బాగ్దాదు మధువీధి
11. విశ్వామిత్ర (అసంపూర్ణము)

## ప్రహసనము

12. వరాన్వేషణ

## పద్యగ్రంథాలు

1. ఖండకావ్యములు
2. తత్త్వసందేశము
3. బర్హిణీదేవి
4. బ్రహ్మవిద్యావిలాసము
5. మహమ్మద్ రసూల్ వారి చరిత్ర
6. సూఫీవేదాంత దర్శనము
7. స్వర్గమాత
8. హాలి

* ప్రచురించబడిన ప్రతి గ్రంథంలో ప్రచురణ సంవత్సరం సూచించబడక పోవడంవల్లను కొన్ని అముద్రితాలు కావడంవల్లను రచనల పేర్లు సూచించు టంలో ఆకారాదిక్రమం అనుసరించబడింది.

## గద్యములు

1. ఈశ్వరుడు
2. మహమ్మద్ వారి చరిత్ర
3. సాధన పథము

## నవలలు

1. తారామతి
2. పద్మావతి
3. శాంత

## కథల సంగ్రహము

1. ప్రభాత కథావళి

## అనువాదాలు

1. ఉమర్ ఖయ్యామ్
2. ఖురాన్-ఎ-షరీఫ్
3. గులిస్తాం

## వైద్యగ్రంథము

1. ఇలాజుల్ గుర్భా

వంద వ్యాసాలు గల వ్యాససంపుటి ఒకటి, హిందీ ఉపన్యాసాల సంగ్రహం, ఆంగ్ల ఉపన్యాసాల సంగ్రహం వేర్వేరుగా ఉన్నట్లు తెలిసింది.

ఇవికాక మదాలస, మసద్దాస్అలి, ఉరుపత్తూరు చక్రవర్తి, శ్రీమద్వాల్మీకి రామాయణము మున్నగునవి రచించినట్లు తెలుస్తూంది.14 ఇవి లభ్యం కాకపోవడం వల్ల ఏ విభాగానికి చెందినవో తెలియడంలేదు.

## రాజకీయ రంగం

శ్రీ అలీషాగారు ఉత్తమ రాజనీతిజ్ఞుడుగా కూడ కీర్తిగన్నారు. 1961లో రాజకీయ రంగాన ప్రవేశించి కాంగ్రెసు సభ్యులయ్యారు. శ్రీ బిపిన్ చంద్రపాల్,

14. మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి, ఆంధ్రరచయితలు, పు, 390

శ్రీ అరవిందఘోష్, శ్రీ సి. ఆర్. దాసువంటి ప్రముఖులు నిర్వహించిన బ్రిటిష్ వ్యతిరేకపోరాటంలోను, మహాత్మాగాంధీ నేతృత్వంలో సాగిన శాంతియుత స్వాతంత్ర్యోద్యమంలోను పాల్గొన్నారు. 1930 వరకు వీరు కాంగ్రెసు సభ్యులు. 1934లో అఖిల భారత శాసనసభ్యులయ్యారు. సంఘశ్రేయస్సేవీరి ధ్యేయం. శాసనసభలో వీరి ఉపన్యాసాలు విని పెక్కుమంది ప్రభావితుల య్యారు. ఆ ఉపన్యాసాలు దేశభక్తిని సమైక్యతను నింపుకొన్నాయి.

## అఖిలభారత శాసనసభా సభ్యత్వం

1934 డిసెంబర్‌లో వీరు అఖిల భారత శాసన సభాసభ్యులయ్యారు.15 దానినిగూర్చి కవిగారు ఇలా చెప్పుకొన్నారు.

"భారతదేశ శాసన సభాసభికత్వపదంబుజేరనేఁ
గోరగ జ్ఞాన సభ్యులు సకుంఠిత దీక్ష జగంబు మెచ్చగా
భూరి తపస్సమాధి తమబుద్ధిని నిల్పి జయంబు దెచ్చినా
రారయ జ్ఞానశక్తికి నజాండము కంపిలుచుండు జూచితే"16

ప్రజాసేవయే పరమావధిగా తలచిన ఉమర్ అలీషాగారిని ఈ పదవి వరించడం ఎంతయినా సమంజసం. ఢిల్లీదాకా వీరి కీర్తిలత ప్రాకింది. జీవితాం తం ఈ పదవి బాధ్యత వహించారు.

## బిరుదములు

ఉమర్ అలీషాగారి ప్రతిభను యోగ్యతను గుర్తించి 1936వ సంవత్సరం ఇంటర్ నేషనల్ అకాడమీ అమెరికా వారు 'డాక్టర్ ఆఫ్ లిటరేచర్' అనే గౌరవపట్టా ఇచ్చి సత్కరించారు. 17 ఏ విశ్వవిద్యాలయం డిగ్రీలేని ఒకవ్యక్తికి ఆరోజుల్లో ఇలాంటి సత్కారం లభించడమన్నది సామాన్యవిషయంకాదు. ఇది సమస్త దేశానికే గర్వకారణంగా భావించబడింది.

15. ఉమర్ అలీషాకవి, ఉమర్ ఖయ్యామ్, పు. 1
16. ఉమర్ అలీషాకవి, సూఫీవేదాంతదర్శనము. పు. 9
17. ఉమర్ అలీషాకవి, శ్రీమహమ్మద్ రసూల్ వారి చరిత్ర, పు. 1

వేదాంత సభల్లోను సాహితీ గోష్ఠుల్లోను పాల్గొనడమేకాదు, సూఫీవేదాంత దర్శనము, స్వర్గమాత, సాధనపథము వంటి గ్రంథాలు రచించి శిష్యులకు పర తత్త్వం గూర్చి బోధించారు. వీరి యౌగిక జ్ఞానాన్ని కొనియాడుతూ జ్ఞాన సభా సభ్యులు 1940లో "బ్రహ్మర్షి" బిరుదమిచ్చారు.18

తెలుగులో పద్య గద్య చంపూమర్యాదల పాటించి పెక్కు సాహితీ ప్రక్రియల్ని చేపట్టి అసంఖ్యాకంగా గ్రంథాలు రచించారు. ఆశు కవిత చెప్పారు. అవధాన ప్రక్రియ నిర్వహించారు. 'మహాకవి' బిరుదు పొందారు.19

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వీరికి సభ్యత్వ గౌరవం లభించింది. వీరి అనర్గళమైన ఉర్దూ ఉపన్యాసం విని మౌలవీలు "మౌలవీ" బిరుదమిచ్చి గౌరవించారు.20

## పరతత్త్వబోధ

అలీషాగారు సూఫీవేదాంత దార్శనికులు. పరంపరగావస్తున్న ఆధ్యాత్మిక విద్యను అభ్యసించినవారు. తత్త్వగ్రంథాలెన్నో రచించి పరమార్థం బోధించారు.

జీవితరహస్యం తెలియని మానవుడు భవబంధసాగరంలో దరికానక అలమటిస్తాడు. పరమార్థం గ్రహించి పరమాత్మునిలో లీనం కావడం మానవ జన్మకు సాఫల్యమనిపిస్తుంది. ఇందుకు అరిషడ్వర్గాన్ని జయించాలి. దీక్షపూని సాధన చేయాలి.

"ఆ నిరవద్యమై చెదరనట్టి మహామహనీయ తత్త్వవి
జ్ఞానము సూక్ష్మమార్గములఁగాంచగవచ్చును దానికిన్నినా
ళ్లౌనని లెక్కలేదు హృదయంబు పవిత్రత జెందెనేని సో
పానము లెక్కినట్లు భవబంధము వాయుదు రొక్క పెట్టునన్"21

తనను తాను తెలుసుకోవడమే ఈశ్వరసాక్షాత్కారం. "అహంబ్రహ్మాస్మి" "అనల్ హఖ్" లలోని అర్థం ఇదే.

---

18. షేక్ దావూద్, మహాకవి ఉమర్ అలీషాగారి జీవిత సంగ్రహము, తెలుగు వైతాళికులు, సంపుటము-3, పు. 200
19. —పై గ్రంథమే— పు. 201
20. —పై గ్రంథమే— పు. 202
21. ఉమర్ అలీషా, సూఫీవేదాంత దర్శనము పు. 17

## జ్ఞానసభ - అలీషాగారి పీఠాధిపత్యం

ఉమర్ అలీషాగారు 'జ్ఞాన సభ' పీఠాధ్యక్షులు. వేదాంతవిద్య ఉపదేశించే పవిత్రపీఠమది. వందలాది సంవత్సరాలనుండి పిఠాపురంలో విలసిల్లుతూంది. ఈసభను గూర్చి పరిశీలించడం అవసరం.

"మాకున్ జ్ఞాన సభాంగణ ప్రథిత సామ్రాజ్యంబు విద్యావశే
షైకాకారలసత్ సముజ్జ్వల మహాసర్వస్వమున్ ప్రాక్సమా
లోకంబైన పథంబునున్నదది దృగ్లోకంబు పూతంబుగా
జేకూర్చున్ సముపాసితంబగు మహాశీలంబు విజ్ఞానమున్"22

అని ఉమర్ అలీషాగారు జ్ఞాన సభ ప్రాశస్త్యాన్ని ఉగ్గడించారు. అలీషా గారి పూర్వీకులు పిఠాపురం చేరిన అనంతరం దీనిని స్థాపించారు. మొదట శ్రీమదీన్ కబీర్‌షా దీనికి అధ్యక్షులు. వంశపారంపర్యంగా జ్యేష్ఠ పుత్రులు మాత్రం ఈ జ్ఞాన సభకు పీఠాధిపతులుగా వ్యవహరించాలనే నియమం ఉంది. ఉమర్ అలీషాగారి తండ్రి మొహియుద్దీన్ బాద్‌షా 10-2-1928వ తేది స్వర్గస్థులయ్యారు. అనంతరం ఉమర్ అలీషా గురుపీఠానికి అధిపతులయ్యారు. తత్త్వోపన్యాసాలిస్తూ అలీషా దేశాటన మొనర్చేవారు. వేలకొద్దిమంది శిష్యులై వీరి బోధననుగురించి సాధన చేసేవారు.

ఈ జ్ఞాన సభలో కులమత జాతి భేదాలులేవు. ఏ వర్గానికి చెందినవారయినా ఇక్కడ సమానమే. జ్ఞానమే ప్రధానం. గురుసేవయే ముఖ్యం. పవిత్ర హృదయంతో ఎవ్వరైనా వచ్చి ఆధ్యాత్మిక జ్ఞానం పొందవచ్చు.

"ఈ సభామందిర ద్వారమెపుడు తెఱచి
యుండు పూత చరిత్రులై యుండు వారు
వచ్చి జ్ఞానంబు నేర్చుకోవచ్చు సతము
మంచినీళ్లను కలశాల ముంచినట్లు"23

ఇక్కడ బ్రహ్మవిద్య బోధించబడుతుంది. ఎంతటి కఠినులనైనా మోక్షపథగాములుగా ఈ సభ తీర్చిదిద్దుతుందట.

---

22. ఉమర్ అలీషా, సూఫీవేదాంత దర్శనము, పు. 13.
23. — పై గ్రంథమే — పు. 14

"ఈ సభ బ్రహ్మవిద్యనెఱిగించెడు తాత్త్వికపాఠశాల, నా
నాసముపాసితంబులు ననంత కళాలసితంబులౌ నుప
న్యాసము లిచ్చు సాధక జనంబు వసించెడు కాణయాచి రా
కాసులనైన మోక్షపథగాముల సేయునటన్న వింతయే"24

కనుక

"ఎట్టి యుగచాటులును లేని యట్టి పథము
ఎట్టి పొరపాటులును లేని యట్టి దారి
ఆత్మనీశ్వరు నీక్షించునట్టి త్రోవ
ఈ మహాజ్ఞాన సభ నభ్యసింపగలరు"25

అలీషా గారికి జ్ఞాన సభాసభ్యులే సర్వస్వం. క్రింది పద్యం ఈవాస్తవాన్ని వివరిస్తూంది.

"అతి పవిత్రతతో మహాప్రేమ గరిమతోఁ
గ్రాలెడు వీరె చుట్టాలు మాకు
ప్రాణార్థములనైన ప్రాభవంబులనైన
నిచ్చెడు వీరె స్నేహితులు మాకు
జ్ఞానసాధనచేత ధ్యాన నిష్ఠలచేత
దనరెడు వీరె సోదరులు మాకు
పూజ్యభావమునందు పుణ్యశీలమునందు
వర్ణింప వీరె దేవతలు మాకు

వీరె చేదోడు వాదోడు వీరె మాకు
వీరె ముఖ్యులు తల్లులు వీరె మాకు
వీరె భక్తులు బిడ్డలు వీరె మాకు
మామహాజ్ఞానసభ జగన్మండితముగ"26

24. ఉమర్ అలీషా, సూఫీవేదాంత దర్శనము, పు. 13
25. — పై గ్రంథమే — . పు. 14
26. ఉమర్ అలీషాకవి, సూఫీవేదాంత దర్శనము, పు. 15
ప్రస్తుతం ఉమర్ అలీషాగారి జ్యేష్ఠ పుత్రుడు హుస్సేన్‌షా జ్ఞాన సభకు పీఠాధిపతిగా ఉన్నారు. పిఠాపురంలో ప్రతిసంవత్సరం ఫిబ్రవరి నెలలో జ్ఞాన సభలు నిర్వహించ బడుతూంటాయి.

పరతత్త్వాన్ని గూర్చి బోధించడమేగాక సర్వమానవ సమానత్వం, శాంతి కాముకత ముఖ్యోద్దేశాలుగా జ్ఞానస వెలిసిందని పై పరిశీలనవల్ల స్పష్టమైంది. ఉమర్ అలీషాగారి అధ్యక్షతన ఈ సభలక్ష్యసాధనకు ఎంతో కృషిచేసింది.

## అలీషాగారి ఉపన్యాసధోరణి

"వీరి ఉపన్యాసము ధారాపాతము. మంజులకవితా నిర్భరము. అనర్గళ సుధాప్రవాహము. జలజల మంజులాప్పటులతో ప్రవహించుచు శ్రోతలకు మేనఃబులకలుప్పొంగ జేయును. ఏవిషయమైన గానిండు. అది రాజకీయమే గాని సందర్భము ననుసరించి సరస సాహిత్య గోష్ఠిగా మార్చి మధుర సరస కవితా తరంగములలో ముంచి రసజ్ఞకోటికి పరనిర్వృతిని కలిగించును.."27

శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రివంటి పెద్దలు సైతం అలీషాగారి వాగ్ధోరణిని ప్రశంసించారు. వేదాంతోపన్యాసం రసవంతమై సూఫీదర్శన సమన్వయంతో భగవద్గీతతో మేళవించబడి శరవేగంగా సాగుతుందట.

అలీషాగారి వాక్కు ఆకర్షకమైంది. ఏటాజరిగె 'మహమ్మదు ప్రవక్త జయంతి' సందర్భంగా వీరి ఉపన్యాసం వినడానికి అసంఖ్యాకంగా ప్రజలు వచ్చేవారు.

"శ్రీ ఉమర్ అలీషా కేవలము కవియే కాదు. సర్వమతముల సామరస్యమును సమకూర్చి తాత్త్వికబోధన చేసిన ప్రవక్తలు. సంఘమందలి దురాచారములను మోమోటము లేకుండగ నెత్తిచూపి వానిని నిర్మూలింప నడుము గట్టిన ధీరులు."28 అని విద్యాభాషాప్రవీణ వాడపల్లి జనార్దనాచార్యులు పేర్కొన్నారు.

## శిష్యసంపద

బ్రహ్మర్షి, మహాకవి, డా. ఆఫ్ లిటరేచర్, మౌలవీ బిరుదములుకల ఉమర్ అలీషాగారి శిష్యకోటిలో గొప్పధనికులు, జమీందారులు సైతం ఉండేవారు. కులమతాల పాటింపులేదు. వీరిశిష్యుల సంఖ్య మహిళలు, పురుషులు కలసి పదారువేలు 29

27. షేక్ దావూద్, మహాకవి ఉమర్ అలీషాగారి జీవిత సంగ్రహము, పు.202
28. ఉమర్ అలీషాకవి, బర్హిణీదేవి, పు. 3
29. ఉమర్ అలీషాకవి, అనసూయాదేవి, పు. 1

ఇంతమంది మనస్సుల్ని చూరగొన్న అలీషా అనన్య సామాన్యమైన వ్యక్తిత్వం కలవారు. వారిమనస్సు నవ్యనవనీతం. వాక్కు అతిమృదులం. ప్రభావోపేతం.

## సాధించిన విశేషాలు

శ్రీ ఉమర్ అలీషా తాము సాధించిన విశేషాల గూర్చి ఇలా అన్నారు.

"సాధించితిని యోగసాధనంబులు హిమా
గమమెక్కి మతిని చక్కాడియాడి
బోధించితిని జ్ఞాన సాధన క్రమములు
చెవినిల్లుగాజేసి చెప్పి చెప్పి
సవరించితిని పెద్ద సారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివి చదివి
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగర మోపి మోపి"30

జీవితంలో పొందిన గౌరవాన్ని క్రింది పద్యంలో అపూర్వంగా చిత్రించారు.

"రాజుల జూచితిన్ సుకవి రాజుల నోర్చితిఁబేరుమ్రోయ రా
రాజులనోలగంబుల విరాజితపండిత సత్కవీంద్ర వి
భ్రాజితమౌలవీ బిరుదపట్టములందితి యూనివర్సిటిన్
దేజమూమీర సభ్యుడయితిన్ మతబోధకుడైతి గ్రమ్మఱన్"31

ఇంకా ఇలా అన్నారు:—

"ఏనుహిమాలయంబు పయికెక్కి తపస్వుల జూచి వారి వి
న్నాణములన్ గ్రహించి విజనంబగు చోట రచించినాడ నా
నానవకావ్యమార్గములనంతముగా..."32

30 ఉమర్ అలీషాకవి, ఉమర్ ఖయ్యామ్, పు. iii
31. — పైదే— పు. ii
32. — పైదే— పు. iv

## భార్యావియోగం

అలీషాగారి అర్ధాంగి అక్బరు బీబీ. భర్తతో కూడ ఢిల్లీకి పోయి 5-4-1935వ తేదీని అక్కడే పరమపదించారు. ఆమె గౌరవార్థం ఆ దినం ఢిల్లీ శాసనసభ మూయబడిందట. అలీషా భార్యావియోగంలో బాధ అనుభవించారు. ఆబాధలో సైతం ఆయన కవితాధారకు లోటు లేదు. ఆయన కలంనుండి కరుణరసాత్మకంగా వెలువడిన పద్యాలు కొన్ని ...

"ఎన్నో బాధలఁబొందుచుండుమని నన్నీభూమి వర్జించి, ఆ
పున్నెంపుంగని అక్బరేగె దివికిం, బూర్ణేందు బింబంబు వా
ర్ధిన్నిద్రింపగబోవునట్లిక మహాంధీభూతమాలిన్య సం
ఛన్నాస్మద్వినిషిద్ధ జీవితమభావంబెన్ని నాళ్లుండినన్."

పల్లెన్ బుట్టిన ఢిల్లిలో బ్రిటిషు సామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్‌వచ్చిసమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
ఫుల్లాబ్జాననా! అగ్బరాంబికా! భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లున్ విచ్చిన కుందబోలె వెసనే జీరాడు చున్నాని టన్

హృదయము ముక్కలౌ నటుల నేడ్చుచు గన్నులనీరు కాల్వలై
చెదరగ నిన్నులోకముల జేరుటకంటె సమాధి తొంటి నీ
సదనము చేరుమార్గము విచారణ జేయుట లెస్స యైహికా
స్పదవిభవానుషంగ భవబంధము వాసిన నిన్నుచూడగన్"33

హృదయాల్ని కదల్చివేసే ఎలిజీ కవిత్వమిది.

## జీవిత పరిసమాప్తి

మహాకవి, ఆధ్యాత్మిక పీఠాచార్యుడు, కేంద్రశాసన సభ్యుడు, జాతీయాభిమాని, విశ్వవిద్యాలయ సభ్యుడు, మహావక్త అయిన మహానుభావునికి విశ్రాంతి ఉండదు. జీవితంలో చివరిక్షణం సైతం అలీషాగారు సేవకే అంకితం చేశారు.

తమశిష్యకోటికి దర్శనమిచ్చేనిమిత్తం పశ్చిమగోదావరిజిల్లా నరసాపురం వెళ్లారు. అక్కడే 1945 జనవరి 23 సాయంత్రం 5గం. కు శాశ్వతంగా కన్ను

33. ఉమర్ అలీషాకవి. సూఫీవేదాంత దర్శనము, పు. 11-12.

మూశారు. వారి భౌతిక కాయాన్ని 24వతేదీ పిఠాపురం తీసుక వచ్చారు. రేల్వే స్టేషను దగ్గర ఉన్నవారి ఆరామంలో సమాధి కట్టించారు.

ఆయనకు ఐదుగురు కుమారులు, ఇరువురు కుమార్తెలు, పెక్కుమంది పౌత్ర పౌత్రికలు ఉన్నారు.

కవిగారి అముద్రిత గ్రంథాలు ప్రచురించవలసిన ఆవశ్యకతను అభిమానులు గమనించారు. ఫలితంగా 1946వ సంవత్సరం శ్రీఉమర్ అలీషా గ్రంథ ప్రచురణ సంఘం అనేపేరుతో ఒకసారస్వత సంస్థ అవతరించింది. కవిగారి ద్వితీయ పుత్రుడు శ్రీ కబీర్‌షా తండ్రికీర్తిని సుస్థిరం చేయుడానికి పూనుకొని పెక్కుగ్రంథాల ప్రచురణకు దోహదం కలగజేశారు.

బహుముఖ ప్రతిభావంతుడై నైతిక స్థైర్యంతో నిష్కల్మషంగా మానవ సేవచేసిన మహామనిషిగా ఉమర్ అలీషా చరిత్రలో నిలిచిపోగలరు.

## ఉమర్ ఖయ్యామ్ ఉమర్ అలీషాల జీవితరేఖల పోలిక

ఉమర్ ఖయ్యామ్ ఉమర్ అలీషాల జీవితాల్ని ర్చి ఇంతవరకు అనుశీలన జరిగింది. ఇరువురి జీవితరేఖల్లో స్పష్టమైన వైవిధ్యం ఉన్నా పెక్కు అంశాలలో సమరూపత గోచరిస్తుంది. ఈ సామ్యం మొదట వారి పేర్లలోనే ఉంది.

ఖయ్యామ్ పారశీక దేశస్థుడు. అలీషాగారి పూర్వీకులును ఆదేశస్థులే. అలీషా ఫారసీభాషను అధ్యయనం చేయడమే కాక పర్షియా దేశంలో ఆవిర్భవించి విస్తరిల్లిన సూఫీమతాన్ని అనుసరించారు.

ఉమర్ ఖయ్యామ్ నివాసం ఖొరాసాన్ ప్రాంతంలో నిషాపూర్. ఉమర్ అలీషా జన్మస్థలం ఆంధ్రప్రాంతంలోని పిఠాపురం ఈ రెండు పట్టణాలు వేర్వేరు దేశాల్లో ఉన్నా కళలకు నిలయాలుగా మహాపురుషులుద్భవించిన పవిత్ర స్థలాలుగా ప్రాచీనకాలంనుండి ప్రశస్తి పొందాయి.

ఖయ్యామ్, అలీషాల ప్రతిభలు వారి బాల్యావస్థల్లోనే వ్యక్తమయ్యాయి. 18 ఏళ్ల నాటికే ఖయ్యామ్ సకల శాస్త్రాలు అధ్యయనం చేశాడని, అలీషా 18వ ఏట 'మణిమాల' అనే నాటకం వ్రాసి ప్రజల పత్రికల ప్రశంసలు పొందారని ఇంతకు ముందే వివరించాను.

ఉమర్ ఖయ్యామ్ అధ్యయనం చేసిన నైజామియా విశ్వవిద్యాలయ ప్రధానాచార్యుడు 'ఇమామె గజ్జాలి,' ఉమర్ అలీషా చదివిన పిఠాపురం ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ కూచి నరసింహం-విద్యార్థుల్ని తీర్చిదిద్దడంలో అసమాన ప్రతిభ ప్రదర్శించేవారు.

ఉమర్ ఖయ్యామ్ ఉమర్ అలీషాలకు గల విద్యాతృష్ణ అసాధారణమైంది. ఇరువురు ఉద్దండపండితుల నాశ్రయించి విద్యాభ్యాసం చేశారు. ఖయ్యామ్ గురువు ఇమామ్ మౌఫిక్, అలీషాగారి గురువులు శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రి, శ్రీ దేవులపల్లి సుబ్బారాయశాస్త్రులు వంటి వారు అఖండమైన విద్వత్తు కలవారు.

నిజాముల్ముల్క్ సహాయంతో లభించనున్న రాజోద్యోగాన్ని ఖయ్యామ్ కాలదన్నాడు. ఉమర్ అలీషా ఉద్యోగాల్ని తిరస్కరించారు. ఇరువురు తత్త్వవేత్తలు ఐహికమైన ఆస్తిపాస్తుల్ని ఆశించలేదు. శిష్యులు అభిమానులే వీరికి తరగని సంపద.

విశ్వవిద్యాలయాల్లో గౌరవ ప్రతిష్ఠలు ఇరువురు పొందగలిగారు. ప్రభువులమన్నన, రాజకీయమయిన గౌరవం లభించింది. ఖయ్యామ్‌కు లభించిన 'ఇమామెఖురాసాన్' బిరుదు, ఇంటర్నేషనల్ అకాడమీ ఆఫ్ అమెరికావారు అలీషాగారికిచ్చిన డా. ఆఫ్ లిటరేచర్ పట్టా అసాధారణమైనవి.

బహుగ్రంథకర్తలుగా ఇరువురికి ఖ్యాతి ఉంది. ఖయ్యామ్ రచనల్ని అతనిశిష్యులు, కొంతమంది సమకాలికులు భద్రపరచి వెలుగులోనికి తెచ్చారు. ఉమర్ అలీషాగారి రచనల ప్రచురణకు 'శ్రీ ఉమర్ అలీషా కవి గ్రంథ ప్రచురణ సంఘం' ఏర్పడింది.

ఈవిధంగా ఉమర్ ఖయ్యామ్, ఉమర్ అలీషాల జీవితరేఖలకు సామ్యం కన్పిస్తోంది. ఇరువురు సాధించిన జ్ఞానాన్ని, సంపాదించిన అనుభవాన్ని ప్రజలకు పంచిపెట్టి చరితార్థులయ్యారు.

ఇది మొదటి ప్రకరణం.

పర్షియాపై దాడిచేసిన బాగ్దాదు ఖలీఫాలు సుమారు రెండు కాలం పాలించారు. వీరి కాలంలో పహెల్వీభాషకు ఆదరణ శూన్యప్రాం: అది మారుమూల పల్లెల్ని ఆశ్రయించింది. నగరాల్లో కవి పండిత సభల్లో వ్యవహరించబడింది. అది అధికారభాషయైంది.

అరబ్బీ కవిత్వం, శాస్త్రగ్రంథాలు సరికొత్తవి కావడం వల్ల అవి ప హృదయాల్ని ఆకర్షించాయి. అరబ్బీలో అ ఖ ం డ పాండిత్యం పారశీక కులీనులు రాజాస్థానంలో ఉన్నతోద్యోగాలు నిర్వహించారు. ఈ పారశీకులే అరబ్బీలో ఉత్తమ కవిత్వంవ్రాశారు. ప్రథమ ప్రకరణంలో నట్లు క్రమంగా అరబ్బీపదాలు పారశీకంలోనికి యథేచ్ఛగా ప్రవేశి అరబ్బీ సమ్మేళనం వల్ల ఫారసీభాష వింత సోయగం సంతరించు పారశీక సరస్వతి అపురూప సౌందర్యరాశియై సాహిత్యాభిమానుల్ని ఆకర్షి

ఫారసీలో 'రూదీక్' ఆదికవిగా పరిగణించబడ్డాడు.2 ఇతని కవిత్వంపై గట్టినమ్మకం ఉండేది. సామానీవంశ ప్రభువులు ఇతనిని పోషి అనంతరం దఖీఖీ అనే కవికి మంచిపేరు దక్కింది.

సామానీవంశ ప్రభువుల అనంతరం గజనీవంశం అధికారంలోకి వ గజనీమహమూద్ కాలంలో లలితకళలు, శాస్త్రాలు సర్వతో ముఖంగా చాయి. ఇతని ఆస్థానంలోని కవుల్లో ఉన్సురీ, ఫర్రుఖీ, మనూచెహరీ, మొదలైనవారు ప్రముఖులు.

---

* one of the most highly deVeloped idioms, r inflections, in the Verbs as well as in the n and in the former almost Completely agreeing Vedic Sans krit...

Persian Language and Literature, The illus Chambers's Encyclopedia, Volume VIII, W. R. bers LImited, London 1930, P. 38.

2. రషీద్ గులామ్ దస్తగీర్, ఫారసీభాషా సారస్వత చరిత్ర, సర్వస్వము, ఆరవ సపుంటము, పు. 421

అరవైవేల దీనారాల కాశపడి గజనీ మహమూద్ చక్రవర్తి కీర్తిని సుస్థిరం చేయాలని శుద్ధఫారసీభాషలో అనితర సాధ్యంగా 'షాహనామా' రచించి అనాదరభావంతో వాగ్దానం ప్రకారం చక్రవర్తి కవితాఋణం తీర్చకపోగా వికలమయిన మనసుతో అసువులబాసిన ఫిరదౌసి ఈ కాలంవాడే.

గజనీవంశం పతనానంతరం సల్జూఖీవంశం రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకొంది. ఈ వంశం ప్రభువులు అన్యులైకూడ పారశీకులలో కలిసిపోయారు. వీరి కాలంలో ఫారసీభాషా సాహిత్యాలకు అసాధారణమైన ఆదరణ సమకూరింది. అంతవరకు అధికారభాష గా ఉన్న అరబ్బీ తనస్థానం కోల్పోయింది. ఫారసీ తిరిగి అధికారం చేజిక్కించుకొంది. అల్ప్ అర్సలాన్ సల్జూఖీ, ఇతని తర్వాత మలిక్‌షా, మలిక్‌షా తర్వాత సంజర్ సల్జూఖీ ఫారసీ కవిపండితుల్ని గౌరవించారు.

సల్జూఖీల కాలంలోనే గజనీ మహమూద్ మనుమడు బహరామ్ షా సాహిత్యపోషణచేశాడు. సర్వప్రథముడైన సూఫీకవి 'హకీమ్ సినాయీ' ఇతని ఆస్థానంలో ఉండేవాడు.

ఈ సల్జూఖీ వంశప్రభువుల కాలంనాటి వాడే ఉమర్ ఖయ్యామ్. హకీమ్ సినాయీ, అమీర్ మొయిజీ, మసూద్‌సాద్, రషీద్ వత్వాత్, జహీర్ ఫార్యాబ్, అన్వరీ, ఖాఖానీ, నిజామీ గంజవీ వంటి సుప్రసిద్ధకవులు ఉమర్ ఖయ్యామ్‌కు సమకాలికులు. [3]

## పారశీక సాహిత్యచరిత్రలో ఖయ్యామ్‌కుగల స్థానం

ఉమర్ ఖయ్యామ్ ఇతర కవుల విధంగా గొప్పకావ్యమేదీ వ్రాయలేదని ఇంతకుముందే స్పష్టపరిచాను. అరబ్బీ కవిత్వం కొంత వ్రాశాడు. ఇది కాల గర్భంలో కలిసిపోయింది. అయితే అప్పుడప్పుడు వ్రాసిన ఫారసీ రుబాయీలు అనుపమాన గుణవిశిష్టత కలిగి అనిర్వచనీయమయిన ఆనందం, సందేశం లోకానికి అందజేశాయి. అందువల్లనే ఆ పద్యాలకు ప్రజాహృదయాల్లో స్థానం దక్కింది. అయితే పారశీక పండితులు, కవులు ఖయ్యామ్‌ను గొప్పకవిగా

---

3. ఎస్. సదాశివ, ఫారసీకవుల ప్రసక్తి, పు. 26

భావించలేదు. సారస్వత చరిత్రలో ఇతనికున్నచోటు అతిసాధారణమైంది. ఈ.జీ.బ్రౌను వ్రాసిన పారశీక వాఙ్మయచరిత్రలో సైతం ఖయ్యామ్‌కు మూడో తరగతి కవుల్లో స్థానం కల్పించబడింది.

పారశీక పండితులు ఖయ్యామ్‌ను కవిగా గుర్తించనట్లే ఆంధ్రపండితులు వేమన్నను కవిగా లెక్కించలేదని ఈ సందర్భంగా దువ్వూరి రామిరెడ్డి గారన్న మాటలు పేర్కొదగ్గవి.

"రసహీనమైన శబ్దాలంకార భూయిష్ఠమై బంధ గర్భకవిత్వములతో బచ్చెన బొమ్మలవలె కనుపట్టు నిర్జీవకావ్యము రచించిన వానిని సైతము గొప్ప కవియని పండితులు సన్మానింతురు. కాని నిరాడంబరమయి సహజ సౌందర్యము కలిగి సూటిగా ప్రజల హృదయములోనికి ప్రవేశింపగల ముచ్చటయైన పద్యములు చెప్పినకవి వారి దృష్టికి తాళడు."4

ఫారసీ సాహిత్య చరిత్రలో ఖయ్యామ్‌కు సముచితమైన స్థానమిచ్చి గౌరవించకపోతేనేమి, ప్రపంచసాహిత్య చరిత్రలోనే శాశ్వతమైన చోటు అతనికి దక్కింది. రచనల రాశిని బట్టికాదు, వ్రాసినిబట్టిపేరు ప్రఖ్యాతులు లభిస్తాయి.

ఇంతగా ప్రపంచమంతటా ఖయ్యామ్ కీర్తిని నిలిపిన రుబాయీ ప్రక్రియకుగల విశిష్టతయేమిటో ముఖ్యమైన ఫారసీ ఛందోరీతులతోపాటు పరిశీలించడం సమంజసం.

## ఫారసీ ఛందోరీతులు - రుబాయీల విశిష్టత

ఫారసీఛందస్సు మాత్రాగణబద్ధమై ఉంటుంది. ఖసీదా, మస్నవీ, గజల్, రుబాయీ-ఈనాలుగు ప్రసిద్ధమైన ఫారసీ ఛందోరీతులు.

పారశీకులు ఇతివృత్తాన్ననుసరించి ఛందస్సు నెన్నుకొంటారు. ఇది వారి ప్రత్యేకత.

4. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉ పో. పు. XXVII-XX VIII.

## ఖ సీ దా

విషయాన్నిబట్టి ప్రశంసలకు, స్తోత్ర పాఠాలకు ఇది ఉపయోగపడు తుంది. పాదుషాలు, ప్రవక్తలు మున్నగువారిని ఈ ఛందస్సులోనే స్తుతిస్తారు. అర్థాపేక్ష కలిగిన కవులు తమ ప్రభువుల్ని పొగడుతూ గ్రంథాలు వ్రాస్తారు. ఇలాంటి రచనలుచేసి పేరుగన్న వారిలో అన్వరీ, ఖాఖాని, జహీర్ ఫార్యాబి ముఖ్యులు

## మ స్న వీ

గాథలు చెప్పడానికి ఈ ఛందస్సును ఉపయోగిస్తారు. పాదాంతాక్షర నియమం కలిగిన 'మస్నవీ' లో వీరరస ప్రధానమైన కథలు రచించబడాలని మొదట నియమం. అనంతరం ఈనియమం కొంత సడలించబడింది. ఫిరదౌసి 'షాహనామా' ఈ ఛందస్సులోనే వ్రాశాడు.

## గ జ ల్

ఇది ప్రణయకలాపాలకు సంబంధించిన రచనకు ఉద్దిష్టమైంది. ప్రియా విరహం, వసంతం, ద్రాక్షాసవం, ఉద్యానవనం, ప్రియురాలి సౌందర్యవర్ణనం, ప్రియుని త్యాగం మొదలైన శృంగార విషయాలు ఈఛందస్సులో వర్ణించ బడతాయి.

షంస్ తబ్రీజ్, సాదీ, హఫీజ్ వంటి కవులు గజల్ రచనలో సిద్ధహస్తులు.

నవయుగ వైతాళికుడు గురజాడ అప్పారావు పారశీక గజల్ నడకను అనుసరించినట్లు స్వయంగా ఇలా అన్నారు.

"ఒకజాతి ఫార్సీగజలు యొక్క నడక ముత్యాల సరములలో తెచ్చు టకు నే యత్నించి ఉంటిని"5

గజల్ పోకడ, అందచందాలు చూచి మురిసిపోయిన ఆధునిక తెలుగు కవులు ఇంకా ఎందరో ఉన్నారు.6

---

5. గురజాడ అప్పారావు, ముత్యాల సరాలు, యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, 1972, పు. 22
6. ఆరుద్ర, కొనరాజు, శ్రీశ్రీ, దాశరథి, నారాయణరెడ్డి వంటి కవిప్రముఖుల గేయాల్లో గజల్ స్వరూపం కనిపిస్తుంది.

## రు బా యీ

ముక్తకాలు వ్రాయను ఉపయోగపడే ఛందస్సు ఇది. తత్త్వాలు, నీతులు, సంక్షేపించి చెప్పడానికి బాగా అనువైంది.

ఈ రుబాయీ పుట్టుకను ర్చి దౌలత్ షాహ సమర్ఖండి అనే పారశీక రచయిత వ్రాసినట్లు శ్రీ దువ్వూరి రామిరెడ్డి గారు అన్నమాటలివి—

"పారశీకమున యాకుబ్ బిన్‌లైస్ సఫారను పాదుషా యుండెను. అతని కొక చిన్నకుమారుడుండెను. వానిని చాల గారాబముతో పెంచుకొనుచుండెను. ఈద్ పండుగనాడు ఆబాలుడు తోడి బాలురతో కలసి గింజలాట ఆడుచుండెను. వినోదము చూచుటకొఱకు తండ్రియు అచ్చటకు వచ్చి నిలబడెను. ఇతర బాలురవలనే రాజకుమారుడును గింజలను దొరలించెను. ఏడు గింజలు చెండును ముట్టినవి. ఒకటి తప్పిపోయినది. అందుకాబాలుడు హతాశుడయి మఱియొక తూరి గింజను దొరలింపగా అది చెండుదగ్గరకుదొరలిపోయెను. సంతోషము పట్ట లేక ఆరాజకుమారుడిట్లనియెను : 'ఘల్తాన్ ఘల్తాన్‌హమిర్‌వద్ తాలబెగో' అనగా దొరలుచుదొరలుచు (ఆగింజ) చెండు అంచునకు పోవుచున్నదని అర్థము. పాదుషాకీమాటలు వినసొంపుగా నుండెను. అంతట ఆయన ఆస్థాన సచివులను రావించి ఆవాక్యమును వినిపించెను. అది కవిత్వమని వారుచెప్పిరి. అట్టి పాదమే మఱియొకటి వ్రాయబడినది. అది కొన్నాళ్లవఱకు ద్విపదగనే వాడుకలో నుండి నది. కాని భావము లిముడ్చుటకు రెండుపాదములు చాలవని రెండు ద్విపదల నొకటిగా చేర్చిరి. అదియే రుబాయీ యైనది"7

రుబాయీయాత్ అనే ఫారసీపదం రుబాయీకి బహువచనరూపం. రుబాయియాత్-ఎ- ఉమర్ ఖయ్యామ్ అంటే ఉమర్ ఖయ్యామ్ రుబాయీలని అర్థం.

రుబాయీ నాలుగుపాదాలు కలది. ప్రతిపాదం ఎంత ఉండాలో నియమం ఉంది. ఒకటి, రెండు, నాలుగుపాదాలు అంత్యప్రాసకలిగి ఉంటాయి. 3వపాదం మాత్రం భిన్నంగా ఉంటుంది.

---

7. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉ పో. పు. VIII.

మొదటి పాదంలో ఒకవిషయం ప్రతిపాదించబడుతుంది. రెండోపాదంలో కవి భావనాలోకంలో విహరిస్తాడు. అంత్యప్రాసరహితమైన మూడోపాదంలో భావం పరాకాష్ఠ చేరుకొంటుంది. అంటే మొదటి పాదంలో ప్రతిపాదించబడిన విషయం రెండుమూడు పాదాల్లో క్రమంగా విస్తరించబడుతుంది. 4వ పాదంలో పరిష్కారం ప్రకటించబడుతుంది. కొందరు నాల్గుపాదాలు అంత్యప్రాసతో వ్రాస్తారు. సమస్యలతో సతమతమైపోతున్న మానవునికి ఆహ్లాదంతోపాటు హృదయవికాసం కలగజేస్తుంది యీ రుబాయీ.

ప్రముఖమైన నాలుగు ఫారసీ ఛందోరీతుల్లోను రుబాయీకే ప్రపంచ మంతటా ప్రశస్తిఉంది. ఇందుకు కారణం ఉమర్ ఖయ్యామ్ రుబాయీని చేపట్టడమే కావచ్చు.

డా. దాశరథిగారు రుబాయీ అందచందాల్ని దర్శించి ముగ్ధులయ్యారు. దానిస్వరూపం తెలుగులో ప్రవేశపెట్టాలన్న సంకల్పం ఆయనకు కలిగింది. భావక్లిష్టత, అన్వయకాఠిన్యం, శబ్దాడంబరం లేకుండ ప్రజాశైలిలో నడిచిన రుబాయీకవితద్వారా వాస్తవాన్ని ప్రజలఎదుట ఉంచుతున్నారు.

"కళ్ళెం ఉన్నది మన చేతిలో
గుఱ్ఱం మాత్రం పడె గోతిలో
దప్పి తీరదని నే నంటాను
నీళ్లే లేని మన నూతిలో

పడవ నడప లేని వాడు నావికుడు
పాట పాడ లేని వాడు గాయకుడు
అందుకనే వేదనతో నే నంటాను
ప్రజల నడపలేని వాడు నాయకుడు

పైపై తళుకులు కల్ల సుమా
లోపలి దంతా డొల్ల సుమా
నిజం తెలియుమని నే నంటాను
లేదా కొంపే గుల్ల సుమా"8

8. 1973 ఆగష్టు 15వతేదీని హైదరాబాదు రవీంద్రభారతిలో జరిగిన కవి సమ్మేళనంలో డా. దాశరథి వినిపించిన స్వీయకవితలో కొంతభాగం.

ఉమర్ ఖయ్యామ్ ఫారసీరుబాయీలను, ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్లరుబాయీలను ముమ్ముందు సందర్భానుసరించి ఉదహరిస్తాను.

ఉమర్ అలీషాగారి 'ఉమర్ ఖయ్యామ్' లో రుబాయీ నడక కలిగిన పద్యాలు అత్యల్ప సంఖ్యలో కన్పించాయి. ఈ నడకను అనుసరించాలని ఉమర్ అలీషా భావించి ఉండరు. అప్రయత్నంగా కుదిరిన పద్యాలివి.

"మనుజ కోటిలో దెలివిగా మసల వలయు
నెల్ల పను లందు శాంతిమై నెసగ వలయు
శ్రవణ నయన జిహ్వేంద్రియ శక్తు లెంత
గలిగి యున్నను లేనట్లె మెలగ వలయు

... ... ....
... ... ...

జనులు నిను దారిగని పూజ సలుప రాదు
లేవగా రాదు నిను మ్రొక్క బోవ రాదు
ఈవు 'మస్జిదు' కేగిన నెన్న డేని
గురువుగా నుండ నినువారు కోర రాదు."9

ఈనియమం తెలుగులో పాటించడం కష్టం. ఆధునిక కవుల్లో శ్రీ ఎస్. సదాశివ గారు అమ్జద్10 రుబాయీలను తెలుగులోనికి అనువదించారు. రుబాయీ నడక అనుసరించాలనే భావం వీరికి సైతంలేదు. అక్కడక్కడ మాత్రమేరుబాయీ గమకం కనిపిస్తుంది. ఇందుకు ఒక్క ఉదాహరణ—

"ఎట్లు రూపొంది నాడనొ యెఱుగ లేను.
నే ననగ నేమి? యెవ్వడ నెఱుగ లేను
ఏదియో చూచు చున్నాడ నిది నిజమ్ము
ఏమి చూచుచు నుంటినో యెఱుగ లేను"11

9. ఉమర్ అలీషా. ఉమర్ ఖయ్యామ్, పు. 37.

10. అమ్జద్ సూఫీవేదాంతపారంగతుడు. ప్రముఖ ఉర్దూసాహిత్యవేత్త. ఈయన రుబాయీలు పలువురి ప్రశంసలు పొందాయి. 1961లో స్వర్గస్థుడయ్యాడు.

11. సదాశివ, అమ్జద్ రుబాయీలు, పు. 2.

## రుబాయీలు రచించిన ఉర్దూకవులు

ఉర్దూ ఛందోలంకారాలన్నీ ఫారసీకి సంబంధించినవే. ఉర్దూలో రుబాయీలు రచించిన ఉర్దూకవులెందరో ఉన్నారు. ప్రాచీనుల్లో 'దరద్' రుబాయీలు ప్రసిద్ధికెక్కాయి. అనీస్, దబీరులు నీతి బోధకములయిన రుబాయీలు వ్రాశారు ఖ్వాజా అల్తాఫ్ హుసేన్ హాలీ రుబాయీలు తెలుగులోనికి సైతం అనువదించబడ్డాయి. జోష్‌మలీహాబాదీ విప్లవకవిగా పేరుగన్నాడు. ఇతని రుబాయీలకు మంచి ప్రశస్తి ఉంది. ఆధునికుల్లో ప్రొ. ఫిరాజ్ గోరఖ్‌పూరీ రుబాయీరచనలో సిద్ధహస్తుడు.

## రుబాయీ స్వరూపం గూర్చి తెలుగుకవుల అభిప్రాయాలు

ఈ రుబాయీ స్వరూపం గూర్చి తెలుగుకవులు విభిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు.

"రుబాయీలన శార్దూలాది వృత్తముల వంటి ఫారసీవృత్తములలో నొకదానికి పేరు"12 — డా. ఉమర్ అలీషా.

"రుబాయీ ఇది మనతేటగీతికి సరిపోలును. తేటగీతివలె ఇదియు దేశ్యచ్ఛందస్సని చెప్పుదురు."13 — దువ్వూరి రామిరెడ్డి

"రుబాయి ఆటవెలది వంటి పద్యము"14— డా. కె. గోపాలకృష్ణరావు.

"... (రుబాయి) నడకను బట్టి యైనచో భుజంగ ప్రయాతముతో పోల్చుటకు కొంత వీలు కలదు"15— శ్రీశ్రీ

అంత్యప్రాసలతో పద్యం ఉండాలనే నియమం తెలుగులోలేదు. అందువల్ల తెలుగు పద్యాలతో రుబాయీని పోల్చిచెప్పడంలో కొంత చిక్కు ఏర్పడక తప్పదు.

ఉమర్ ఖయ్యామ్ రుబాయీలకు అనువాదాలు పందొమ్మిదో శతాబ్దంలో ప్రారంభమయ్యాయి. అంతకుముందు ఈ రుబాయీలకు ప్రశస్తిలేదు. ఖయ్యామ్ రుబాయీలను ఆంగ్లంలోనికి అనువదించి, ఖయ్యామ్ తత్త్వామృతాన్ని ప్రప్రథమంగా లోకానికి పంచిపెట్టిన ఖ్యాతి ఫిట్జ్‌రాల్డ్‌కు దక్కింది.

---

12. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పీ. పు, X.
13. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో. పు. VIII
14. డా. కే.గోపాలకృష్ణరావు, తెలుగుపై ఉర్దూ పారశీకముల ప్రభావము, పు. 112
15. శ్రీశ్రీ, సాహితీ వాల్లభ్యము, ద్వితీయభాగము, పు. 470

# ఫిట్జ్ రాల్డ్

ఇతని పూర్తి పేరు ఎడ్వర్డ్ ఫిట్జ్‌రాల్డ్. పాశ్చాత్య విద్వాంసుడు. 1856లో ప్రొఫెసర్ కోవెల్ అనునతడు ఆక్స్‌ఫర్డ్‌లోని బోడ్లీయన్ గ్రంథాలయంలో ఫారసీలో ఉన్న ఉమర్ ఖయ్యామ్ రుబాయీల లిఖిత ప్రతి చూచాడు. రుబాయీలోని భావగంభీరతను పరిశీలించి ముగ్ధుడయ్యాడు. ఈ ప్రతిని తన మిత్రుడైన ఫిట్జ్‌రాల్డ్‌కు పంపించాడు. ఇందులో ఉన్న రుబాయీల సంఖ్య 158 ఫారసీ అధ్యయనం చేయవలసిందని కూడ ఇతడు ఫిట్జ్‌రాల్డ్‌ను ప్రోత్సహించాడు. ఏషియాటిక్ సొసైటీనుండి 516 రుబాయీలు ఉన్న మరొక లిఖిత ప్రతి ఇతడే ఫిట్జ్‌రాల్డ్‌కు పంపించాడు.

1859 ప్రాంతంలో డెబ్బైఐదు రుబాయీలను ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్లంలోకి అనువదించాడు. ఈ అనువాదం మొదట వ్యాప్తిలోకి రాలేదు. వెల ఐదు షిల్లింగులు. ఎవరూ కొనలేదు. ధర బాగా తగ్గించబడింది. అయినా ఆసక్తిగా కొనే వారులేరు. నామమాత్రంగా కొన్ని పుస్తకాలు మాత్రమే అమ్ముడుపోయాయి. అయితే సర్ రిచర్డుబర్టన్,సూన్ బరన్, డాంటి, గాబ్రియల్, రూస్టువంటి పాశ్చాత్య విద్వాంసులు ఆపుస్తకంచదివి వ్యామోహితులైదాని ప్రాశస్త్యాన్ని కొనియాడారు. పుస్తకానికి మంచిపేరు వచ్చింది. 1868వ సంవత్సరం 101 పద్యాలు గల ద్వితీయ సంస్కరణం ప్రకటించబడింది. మూడో ముద్రణ 1872లోను నాలుగో ముద్రణ 1879లోను ప్రచురించబడ్డాయి. ఖయ్యామ్‌పేరు నల్దిశలవ్యాపించింది. ఇంగ్లాండులో ఖయ్యామ్‌పేరు విననివారులేరు. 36పుటల గ్రంథం 16 రూపాయలకు అమ్మబడింది. అమెరికాలో పవిత్ర గ్రంథమై ఇంటింటా వెలసింది. రుబాయతు అధ్యయనం చేయడం పవిత్ర కార్యమని, నాగరికతఅని భావించబడింది. ఉమర్‌ఖయ్యామ్ సంఘాలు స్థాపించబడ్డాయి. రుబాయీలు చదివిన చిత్రకారులు చిత్రాలు గీచారు. కొందరు ఉమర్‌ఖయ్యామ్ జీవితగాథను సినిమాతీశారు.

ఖయ్యామ్ పేరుతోపాటు ఫిట్జ్‌రాల్డ్ పేరు దేశదేశాల్లో వ్యాపించింది. ఇంతకుముందే ఫిట్జ్‌రాల్డ్ ఏస్కిలుస్, సోఫోక్లిస్ మున్నగు గ్రీకునాటక కర్తల గ్రంథాల్ని ఆంగ్లంలోకి అనువదించాడు. స్వతంత్రరచనలు చేశాడు. కాని సాహితీ జగత్తులో రుబాయీలవల్లనే ఖ్యాతిదక్కింది.

ఫిట్జ్‌రాల్డ్ రచనానంతరం 1872లో ఐ. హెచ్. ధన్ ఫీల్డు, 1898లో రిచెర్డులీగేలిన్, 1913లో జాన్‌సన్‌పాషా, 1915 జాన్‌పాలిన్, 1920లో షరబ్ మాల్ అనేవారు రుబాయీలు అనువదించారు.16 కాని వీరిపేర్లు ప్రసిద్ధి కెక్కలేదు.

ఖయ్యామ్ రుబాయీలు పాశ్చాత్యదేశాల్లో ఎనలేని ఆదరణ పొందగలిగాయి. ఇందుకు కారణం లేకపోలేదు. 18వ శతాబ్దంలో విజ్ఞాన ప్రబోధం పాశ్చాత్యదేశాల్లో ఆరంభమైంది. 19వ శతాబ్దంలో విద్యుచ్ఛక్తి యంత్రాలు నిర్మించబడ్డాయి. ప్రజల్లో హేతువాద దృక్పథం బయల్దేరింది. మూఢవిశ్వాసాలకు స్థానం సన్నగిల్లింది. పరలోకచింతకన్న ఇహలోకంపై వ్యామోహం ఎక్కువైంది. విద్యావంతుల్లో ప్రకృతిశాస్త్రాలపై ఆదరణ పెరిగింది. స్వర్గనరకాలు కల్పితాలని భావించబడింది. ఈదశలో ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు పాశ్చాత్యదేశాల్లో వ్యాపించాయి. ఆస్తికవాదాన్ని పటాపంచలు కావించి కర్తవ్యం బోధించాడు ఖయ్యామ్. పాశ్చాత్య నాగరికుల కిదిఎంతోనచ్చింది. ఐహికవాంఛాపరులైన పాశ్చాత్యులు కొందరు స్థూలదృష్టితో రుబాయీలను చదివి వ్యామోహితులయ్యారు. కొందరు తత్త్వదృష్టితో పరిశీలించి అంతరార్థాన్ని వెలికితీసి ఆనందించారు. ఏమైతేనేమి పాశ్చాత్యదేశాల్లో ఈగ్రంథం బహుళ ప్రచారం పొందింది. వేదంగా గౌరవించబడింది. ఈ గౌరవం దక్కడానికి ఫిట్జ్‌రాల్డ్ రచనావిధానం కూడ కొంత తోడ్పడింది.

## ఫిట్జ్‌రాల్డ్ రచనా నైపుణ్యం

ఖయ్యామ్ రుబాయీలలో కొన్నిటిని మాత్రమే ఫిట్జ్ రాల్డ్ ఎన్నుకొన్నాడు. అనువాదంలో కేవలం మక్కికిమక్కిగా మూలాన్నే అనుసరించలేదు. కొంత స్వతంత్ర పద్ధతి ననుసరించి ఆంగ్లంలో తన పద్యాలకు సరికొత్తరూపు కల్పించాడు. భావానుగుణంగా తీర్చిదిద్దాడు. గ్రంథమంతా సూర్యోదయం నుండి సూర్యాస్తమయం దాక దినచర్య వర్ణిస్తున్నట్లు ఉండడమేకాదు, క్రమాన్ని బట్టి ఒకకథగా రూపుదిద్దుకొన్నట్లుకూడా ఉంటుంది. ఇదె ప్రకృష్టమయిన బంధం కల గ్రంథం. సాటిలేని కవితాశక్తికలిగి మూలాన్ని మరపిస్తుంది. భాష సహజ సుందరమైంది. ఖయ్యామ్ తాత్త్వికచింతనకు దర్పణం పట్టింది. పద్యాలు రుబాయీనడకను పూర్తిగా అనుసరించాయి. అందువల్లనే ఈ గ్రంథం అన్ని దేశాల్లో అందలమెక్కింది. రసికుల హృదయపీఠమలంకరించింది.

---

16. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పీ. పు. XII

ఆ తలుపు తెరవడానికి తాళంచెవిలేదు. ఆ ఏతెర వెనుక ముందో కనిపించదు, నేనూ నీవని కాసేపే మాటలు. ఇంతలో నీవూ ఉండవు నేనూ ఉండను అనేభావానికి ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్లరుబాయీ ఇలా ఉంది.

"There was a Door to which I found no key:
There was Veil past which I could not see:
Some little Talk a while of Mee and Thee
There seem'd-and then no more of Thee and Me"17

అన్ని పద్యాలు ఈవిధంగానే చింతనడక కలిగి హృద్యంగా ఉన్నాయి.

ఇంతటి మాధుర్యంగల ఫిట్జ్‌రాల్డ్ అనువాద గ్రంథం చదివే, పెక్కు మంది తెలుగుకవులు ప్రభావితులై, ఆగ్రంథాన్నే మూలంగా గ్రహించి ఆంధ్రీకరించారు.

## ఉమర్ ఖయ్యామ్ రచించిన రుబాయీల సంఖ్య

ప్రస్తుతం లభిస్తున్న ఫిట్జ్‌రాల్డ్ అనువాద గ్రంథంలో 110 పద్యాలున్నాయి. అయితే ఖయ్యామ్ రుబాయీలెన్ని? అన్నీ ప్రస్తుతం లభిస్తున్నాయా అనే అంశం సైతం పరిశీలించదగింది.

"కాలము గడచిన కొలది వేమన పద్యములకు వలెనే ఉమర్ ఖయ్యామ్ ముద్రణములలో పద్యసంఖ్య పెరుగుచున్నది. అందులో కవికృతములు గాని పద్యములు గూడ కొన్ని ప్రక్షిప్తములుగ జేరియుండవచ్చును. మొత్తమిప్పటికి రమారమి 1400 పద్యములు లభించెనని తెలియుచున్నది. వానిలో 1096 పద్యములు ఉమర్ ఖయ్యామ్ కృతములుగా గ్రహించి శ్రీ స్వామి గోవిందతీర్థ అనువారు ఆంగ్లమునను మహారాష్ట్రమునను అనువదించి ప్రకటించినట్లును నిప్పటికి భారతదేశమున వెలువడిన అనువాదములలోనికెల్లనిదియే పెద్దదనియు తెలియుచున్నది."18

17. FITZERALD, The Rubaiyat of Omar Khayyam, P. 32
18. శ్రీ బండారు తమ్మయ్య, ఉమర్ ఖయ్యామ్—ఉమర్ అలీషాకవి, భారతి, నవంబరు, 1951

అక్స్ఫర్డులోని బోడ్లియన్ గ్రంథాలయంలో కనుగొనబడిన ఖయ్యామ్ రుబాయిల ప్రాచీనవ్రాతప్రతిలో 158 రుబాయిలు మాత్రమే ఉండగా 1528లో ప్యారిస్ నగరంలోని 'బిబ్లియోథికనేషనల్' గ్రంథాలయంలో లభించిన వ్రాత ప్రతిలో 349 రుబాయిలు ఉన్నాయి. బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో ఉన్న ప్రతిలో 540 రుబాయిలున్నాయి.

మనదేశంలో వ్యాప్తిలో ఉన్న ప్రతులలో 700 నుండి 900 వరకు రుబాయిలు ఉంటాయని శ్రీ దువ్వూరి రామిరెడ్డి అన్నారు.19

కాలం గడచేకొద్దీ రుబాయిల సంఖ్య పెరుగుతూనే ఉంది. వేమన పద్యాల్ని గుర్తుపట్టడంలో ఏర్పడేచిక్కు ఇక్కడా ఉత్పన్నంమైది. కాబట్టి ఇది తేల్చి చెప్పలేని జటిల సమస్య అయింది.

## ఉమర్ అలీషాగారి పద్యాలలో వ్యక్తమయ్యే ఖయ్యామ్ పాండితీ ప్రకర్ష

సత్యాన్వేషణలో తత్పరత, కావ్యరచనలో నిశితమైన ప్రతిభకల ఉమర్ అలీషా అధికసంఖ్యలో రుబాయిలను ఆంధ్రీకరించారు. కవితారంగంలోనే అపూర్వసృష్టిగా వెలసిన వీరి అనువాదంలో వెల్లివిరిసిన ఖయ్యామ్ పాండితీ ప్రకర్షను ఇక పరిశీలిద్దాం.

ఉమర్ ఖయ్యామ్ రచించిన 'రుబాయియాత్-ఎ- ఉమర్ ఖయ్యామ్' వస్త్వైక్యతలేని గ్రంథం. ఇది ముక్తకకావ్యమనిపిస్తుంది. ఆయా సమయాల్లో నాటి సాంఘిక పరిస్థితుల్ని బట్టి తనభావాల్ని అనుభవాల్ని ఆశుకవితా రూపంలో ఖయ్యామ్ వ్యక్తం చేశాడు. కనుక ఒకనిర్దిష్టమైన ప్రణాళికప్రకారం కూర్చిన గ్రంథం కాదిది.

"చూన్ లాలయి భనవ్ రోజ్ కదా గీర్ బదస్త్
బా మాహి రుఖీ అగర్ తురా ఫుర్‌సత్ హస్త్
మయ్ నోష్ బఖుర్రమీ కి ఈన్ చర్ఖి కుహన్
నాగాహ్ తురా చూ ఖాక్ గర్దాంద్ పస్త్"20

19. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో. పు.XXX
20. A. Narayana Das, Rubaiyat Omar Khaiyam, P. 74

"ఖైయామ్ అగర్ జి బాద మస్తీ ఖుష్ బాష్
బా లాలయి రుఖీ అగర్ నిహస్తీ ఖుష్ బాష్
చూన్ ఆఖిరి కార్ నీస్త్ ఖాహి బూదన్
అంగార్ కి నీస్తీ చూ హస్తీ ఖుష్ బాష్

రోజేకిజతూ గుజస్త అస్త్ యాద్ మకున్
ఫర్దాకి నేయామదస్త్ బీదాద్ మకున్
వజ్ ఆమద వ గుజస్త ఖుద్ యాద్ మకుమ్
హాలీ మయ్ నోష్ వ ఉమర్ బర్బాద్ మకున్"21

మున్నగు ఖయ్యామ్ రుబాయీలలో

'మద్యమును మానిని వీడి మసల జనదు'22
'సొగసు మిటారులన్ గలసి సోమ రసంబును
ద్రావుటే హితంబగు'23

అనే అర్థం ప్రస్ఫుటంగా గోచరిస్తుంది.

మధుపాన గోష్ఠులు, ప్రమదామణుల సాన్నిధ్యం. కామసుఖాలు— ఇవే జీవిత లక్ష్యమని ఖయ్యామ్ గ్రంథమంతటా కనిపిస్తుంది.

ఖయ్యామ్ కేవలం పైని చెప్పిన విషయాలనే ప్రధానంగా వక్కాణించి ఉంటే ఉదాత్తవ్యక్తిత్వం కల అలీషావంటి తత్త్వవేత్తలు అతని కవితను ఆదరించరు.

కొందరు ఖయ్యామ్ కేవలం శృంగారాన్నే వర్ణించాడని భావించారు. తన కావ్యం అనుపమాన శృంగారరస ప్రాధాన్యం కలదిగా ఉండవలెనని ఖయ్యామ్ తలచి ఉంటే తత్సంబంధమైన కథావస్తువు స్వీకరించేవాడు. శృంగార రసవర్ణనకు అనుకూలమైన 'గజల్' ఛందస్సును ఎన్నుకొనేవాడు.

21. A. Narayana Das, Rubaiyat Omar Khaiyam, P. 78
22. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 63
23. —పై గ్రంథమే— పు. 132

తాత్త్విక విషయాలు, నీతులు వివరించడానికి ఉద్దిష్టమైన రుబాయీని స్వీకరించడు. కామసుఖమే ప్రధానమయితే ఈ కావ్యం ఇన్నాళ్లూ ప్రపంచ మంతటా సజీవంగా నిలిచేదికాదు. ఇంత ఖ్యాతి దక్కదు.

అఖండ శాస్త్రపరిజ్ఞానంకల ఖయ్యామ్ విజ్ఞానాభివృద్ధికై ఆయా రంగాల్లో గణనీయమైన కృషి చేశాడు. ఎన్నో గ్రంథాలు రచించాడు. ఆరాధ్యుడైన గురువై శిష్యులకు పాఠాలు బోధించాడు. మహామనీషి అనిపించుకొన్నాడు. సంఘ శ్రేయస్సునుకోరి నీతిబోధ చేశాడు. ఇలాంటి మహోన్నత వ్యక్తిత్వం కలవాడు మధువును సేవిస్తూ మానినీ సుఖం అనుభవిస్తూ కాలం గడపండని కావ్యం వ్రాసి లోకానికి అందజేయడమన్నది నమ్మశక్యంకాని విషయం.

మానవుడు ఈ లోకానికి వస్తాడు. అనుభూతులు పొందుతాడు. అమం దానందం అనుభవిస్తాడు. నిజతృష్ణ తీరాలని తాపత్రయపడతాడు. సంఘర్షణకు లోనవుతాడు. అతనికి తృప్తి తీరదు. మరణం వేచి ఉంటుంది. రాజాధిరాజులు సైతం మృత్యుదేవత ఒడిలో పవ్వళించవలసిందే. ఈ లోకంలో ఏదీ శాశ్వతం కాదు. జీవితమంటే ఏమిటి? మరణానంతరం జరిగేదేమిటి? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పలేక మహాపండితులే కన్నుమూశారు. కనుక జీవితమంతా ఆనందం అనుభవించి వెళ్లిపోవడమే జీవితాదర్శంగా ఖయ్యామ్ తన రుబాయీ లలో చెప్పినట్లు కొందరు వ్యాఖ్యానించారు. కాగా, ఖయ్యామ్ అనుభవించ మన్న ఆనందంలో విశిష్టమైన ఆధ్యాత్మిక భావం ఉందని కొందరు తత్త్వ వేత్తలు స్పష్టం చేశారు. ఏమయితేనేమి ఉమర్ ఖయ్యామ్ గ్రంథం అమర కావ్యమై లోకంలో నిలిచింది.

ఉమర్ అలీషాగారు ఒక్కొక్క రుబాయీకి ఒక్కొక్క పద్యం వ్రాశారు. ప్రతి పద్యంలోను ఖయ్యామ్ పాండిత్యం, ప్రతిభ తొణికిసలాడుతున్నాయి.

ఖయ్యామ్ రచించిన ఒక ఫారసీ రుబాయీలో మొదటి పాదం —
'ఖుర్షీద్ కమందె సుబహె బర్‌బాం అఫ్గంద్'24

సూర్యుడు ఆకాశంపై ప్రభాతమనే జాలం విసిరాడని అర్థం.

---

24. A. Narayana Das, Rubaiyat of Omar Khaiyam, P. 2.

ఇందులో అనూహ్యమైన భావం ఉంది. సూర్యోదయంవల్ల అంతవరకున్న చీకట్లు తొలగి కాంతిరేఖలు వ్యాపిస్తాయి. అజ్ఞానం నశించి జ్ఞానోదయం కలగాలనే భావం ఉమర్ వ్యక్తం చేశాడు. 'తమసోమా జ్యోతిర్గమయ' అనే ఆర్యోక్తిలో ఉన్న అమృతభావం ఇదేకదా!

పారశీకులు అగ్ని ఆరాధకులు. సహజంగా వారు అంధకారాన్ని నిరసిస్తారని భావించవచ్చు. అందువల్లనే ఈ రుబాయీఎత్తుగడలోనే ఉన్న ఖుర్షీద్ (సూర్యుడు) శబ్దం పారశీక సంస్కృతిని వెల్లడించడమేకాక కావ్యోద్దేశాన్ని విశదపరచింది.

చెదరి ఉన్న ఖయ్యామ్ రుబాయీలను సేకరించి కూర్చిన ఫిట్జ్‌రాల్డ్ తనకావ్యాన్ని ఈ రుబాయీతోనే ప్రారంభించి తన కావ్యానికి తనకు అరని వెలుగు చేకూర్చుకొన్నాడు.

ఖయ్యామ్ కలంనుండి వెల్వడిన ఒక్కొక్క రుబాయీ ఒక్కొక్క సూర్య కిరణం.

తన కాలంలో మూఢ విశ్వాసాలు, మతనిర్బంధాలు, ఆచారాల కట్టుబాట్లు వంటి అపరిష్కృత సమస్యలతో సతమతమై అజ్ఞానాంధకారంలో అలమటించే ప్రజలకు ఈ రుబాయీలు జ్ఞానోదయ రేఖలు. వెలుగు విరజిమ్మిన దినకరుడు ఖయ్యామ్. అఖిల జగత్తు ఆకాశం. ప్రతి రుబాయీ ఉమరుభావాలకు ప్రతిరూపం.

మానవుని జీవయాత్రను గూర్చి ఆలోచిస్తే ఎన్నో ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి. సమాధానం ఎవ్వరూ చెప్పలేరని అలీషాగారి 'ఉమర్ ఖయ్యామ్' కావ్యం ప్రారంభమవుతుంది.

ఈశ్వర స్వరూపం అజ్ఞేయం. ఎవ్వరూ వివరించి తృప్తి కలిగించలేరు. మహాజ్ఞానులమనుకొనేవారందరూ తమకు తోచిన విధంగా ఊహకొద్దీ సృష్టి రహస్యం, ఈశ్వర రహస్యాల్ని గూర్చి చెప్పి జనుల్ని విశ్వసింపజేయ ప్రయత్నిస్తారు. వీరి మాటల్లో వాస్తవం శూన్యమని ఖయ్యామ్ వాదన. ఆవేదన. అంధ విశ్వాసాన్ని నిరసించడమేకాదు, లోకాన్ని మభ్యపెట్టే మహాజ్ఞానుల జ్ఞానం

ఎంతో బట్టబయలు చేశాడు. ఇది అతని వేదాంత పాండిత్యానికి ప్రతీక అయిన రుబాయీ.

తెలుగులో ఈ రుబాయీకి ఉమర్ అలీషా జీవంపోసి ఇలా రచించారు.

"లోకాలోకపరీత భూతలము నాలోకించి యా యీశ్వర
శ్రీ కళ్యాణ కళా కలాపముల నీక్షింపంగ జర్చించి భూ
మ్యాకాశంబుల మెట్టి కానకొగి నిర్మగ్నాపకాశాత్ములై
మూకీ భావము నొందిరేమనగ మోమున్ జెల్లకల్లాడుచున్"25

కాలం జీవుల ప్రాణం తీస్తుంది. ఎవ్వరినీ మన్నించదు. అందువల్ల సుఖాలనుభవించడానికి ఖయ్యామ్ నెచ్చెలిని ఆహ్వానిస్తాడు-

"కాలము నిన్ను నన్ను వెసగైకొని ప్రాణము లూడ్చివేయ వే
లీలలు వేచి యున్నది చెలీ! సురశాద్వల వీథులందు రా
వేలను? ద్రావబోవుదమదే మనదేహపు మట్టిపైని నీ
పూలును దీవలున్ మొలక పూర్వమె వేడుక చూతమంగనా!"26

మనం గతించకముందే అనడానికి 'మనదేహపు మట్టిపైని నీ పూలును దీవలున్ మొలక పూర్వమె' అన్నది ఎంతో చక్కని భావగర్భితమైన ప్రయోగం. మానవుడు గతించిన అనంతరం మట్టిలో కలిసిపోవడం, అనంతరం ఆ మట్టిలో నుండి మొక్కలు మొలవడం సాధారణంగా అందరికి తెలిసినా— ఇందులో అపూర్వమైన తాత్త్విక చింతన ఉంది.

* * * *

"త్రాగెడు పానపాత్ర యధరంబున ముట్టిన వాని కిట్లనెన్
ఓగుణి! నాకు మున్ పెదవులుండెను- నీవలె నాశరీరమున్
భోగ పరాయణత్వమున బోయెను- దైవము మేలు చేసినన్
నీగతి కూడ నిట్టులగు - నీవును నా వలె నుందు వా పయిన్"27

25. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 9
26. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 61
27. —పై గ్రంథమే— పు. 16

మధుపిపాసితో పానపాత్ర మాటాడినట్లు వర్ణించబడింది. ఓ గుణవంతుడా! నీవు పెదవులతో నన్ను స్పృశిస్తున్నావు. అలాంటి పెదవులు నాకు సైతం ఉండేవి. ఇహలోక భోగాల్ని అనుభవించ నభిలషించే నీ శరీరంలాంటి శరీరం నాకూ ఉండేది. లోకంలో ఎవ్వరికైనా భోగ లాలసతవల్ల పతనం తప్పదు. పతనం పొంది నేనెలా అయ్యానో, నీవు సైతం కొంతకాలానికి ఇలాగే అవుతావు— అని పాన పాత్ర బోధిస్తూంది. కాదు హెచ్చరిక చేస్తూంది.

ఇప్పటి భోగలాలసతను చూచి పూర్వపు భోగలాలసతను అది స్మృతికి తెచ్చుకొంటూ ఉంది. ఆ పాన పాత్ర యొక్క నిర్వేదం ఒక్క వాక్యంలో చెప్పబడింది.

పానపాత్ర త్రాగే వానికి ఒక్క సందేశమిస్తూంది.

ఓయీ! జాగ్రత్తపడు. నేనెలా అచేతనంగా మారిపోయానో నీవునూ ఇలాగే అచేతనంగా మారిపోగలవు.

అచేతనం చేతన పదార్థంతో మాట్లాడడమన్నది కవిచేతిలోని అపూర్వ సృష్టి. కర్తవ్యం గుర్తించి ప్రవర్తించమనే తాత్త్విక చింతన ఇందులో ఉంది.

అమోఘమయిన పాండితీ గరిమతో ఇలాంటి పద్యాలు సృజించడం ఖయ్యామ్ ప్రత్యేకత.

* * * *

ఈ లోకంలో ఏముంది. యద్దృశ్యమ్ తన్నశ్యమ్ అన్నట్లు కనిపించేదంతా కాలగర్భంలో కలిసిపోవలసిందే. అంతా మూన్నాళ్లముచ్చట. రాజాధిరాజయినా, నిరుపేద అయినా మన్నయిపోవలసిందే. అమట్టికి ఏ తారతమ్యమూలేదు. కుమ్మరివాని పాత్రల నిర్మాణానికది ఉపయోగపడుతుంది.

"చక్రమును దాసి కుమ్మరి చట్టి లెన్నొ
చేయుచున్నాడు, భూపతి శిరము భిక్షు
కరమె యైనను మన్నె - ఆహా పరమగుహ్య
మరసినాడ గులాల మందిరమునందు" 28

28. ఉమర్ అలిషా, ఉమర్ ఖయ్యామ్, పు.19

రాజులు రాజ్య విస్తరణాభిలాషకలవారు. సమస్త రాజ్యాల్ని కైవసం చేసుకోవడం ధ్యేయంగా భావిస్తారు. తలవంచని వీరులుగా ప్రవర్తిస్తారు. రాజ దర్పం ఉట్టిపడే శిరస్సువారిది. ఆ శిరస్సు రత్నమణిమండిత కిరీటం ధరిస్తుంది. సామాన్యుని శిరస్సుకు రాజుశిరస్సుకు ఎంతయినా వ్యత్యాసముంది.

సమాజంలో అతినిమ్నదశలో ఉండేవాడు భిక్షార్థి. భిక్షాపాత్ర చేతపట్టేవాడు. రాజుకు శిరము ఎంత ప్రధానమో ఇతనికి కరమూ అంతే. విలువైన భూపతి శిరమూ, ఏ విలువకు నోచుకోని భిక్షుకరమూ రెండు ఏ భేదం లేకుండా మట్టిలో కలసిపోతాయి. ఇది అందరికీ తెలిసిన పరమసత్యం. అయినా ఎందరో గ్రహించరు. గ్రహించి ప్రవర్తించరు.

పద్యంలోని భూపతి శిరము భిక్షుకరము రెండుపదాలు సార్థకంగా ప్రయోగించబడ్డాయి. పద్యం చిన్నది. గంభీరభావాన్ని తనలో ఇముడ్చుకొంది.

* * * *

'కృషితో నాస్తి దుర్భిక్షమ్' 'శ్రమయే పూజనీయం' వంటి లోకోక్తులలోని అర్థం నిరంతర కృషి మానవుని మహాత్మునిగా తీర్చిదిద్దుతుందని. ఈ భావం మనసునగల ఖయ్యామ్ చక్కని కల్పన, పరమాద్భుతమయిన పోకడల సమన్వయంతో అపూర్వమైన పద్యం అల్లాడు.

తనను భజించే భక్తునికి విగ్రహం పరమరహస్యం బోధిస్తూంది— నేను మొదట రాయిగా ఉండి ఎన్నోదెబ్బలు బాధలు సహించి ఈ దివ్యాకారం దాల్చాను. నీవు సైతం శ్రమపడు. బాధల్ని సహించు. మహాత్ముడవవుతావు. నాలాగా పూజలందుకొంటావు.

"ప్రతిమవచించె దన్ను నిజభక్తి భజించెడు వానితోడ నో
హితుడ! మదీయ పాదముల కేటికి మ్రొక్కెదవేను బాయినై
వెతపడి పెక్కు సమ్మెటలవేగి గడించితి దివ్యవ్యక్తి త
ద్గతి శ్రమపడ్డ నీ పదయుగంబులు మ్రొక్కెదరెల్ల వారలున్" 29

29. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 42

భావ సౌకుమార్యం, భావౌన్నత్యం చెదరని విధంగా పద్యరచనచేసి ఖయ్యామ్ మనసును మన ఎదుట ఉంచారు ఉమర్ అలీషా.

* * * *

ఖయ్యామ్ సృజనాత్మకశక్తికి, అపూర్వభావసంపత్తికి ప్రతీకలయిన పద్యాలెన్నో అలీషాగారి అనువాదంలో అనల్పకవితాశిల్ప కళాద్వారాల్ని తెరిచాయి—

ఆకాశాన్నంటే కోటలు నిర్మించి అరివీరభయంకరులయిన రాజులు సైతం మృత్యువాతపడి నశించవలసిందే. కాలమహిమ అనిర్వచనీయం. ఒక నాడు ఆరాజుల కోట శిఖరాగ్రాలపై పరరాజులు కన్నెత్తియైనా చూడరాదు. నేడవి కాకులకు నివాసాలు. ఆ కాకుల అరపుకు అర్థాన్ని ఖయ్యామ్ ఆపాదిస్తున్నాడు.

"కాకంబొక్కటి 'తూసికోట' శిఖరాగ్రంబందు గూర్చుండి యా
'కైకావూస' ను చక్రవర్తి తలముక్కల్ సూచి యిట్లాడె-నా
హా కాలంబ! మదేభకుంభములపై నక్రాంతమున్ మ్రోయు భే
రీకల్పారవ మెందుబోయె- ఇపుడీ జేడెట్టులయ్యెన్ గటా!"30

కాకి అరుపుకు అర్థం కల్పించి గత వైభవం కవిస్మరించాడు. ఉత్తమ కవితా శిల్పి, రసరామణీయకతపస్వి ఉమర్ ఖయ్యామ్ అని ఈపద్యంలోని విశిష్టగుణమే స్పష్టంచేస్తూంది.

కోడికూతకు మరో ఊహాతీతమయిన అర్థం కల్పించబడింది. మానవ జీవితం అస్థిరమని ఖయ్యామ్ మాటిమాటికి హెచ్చరిస్తాడు. తెల్లవారుజామున కోడికూసే కూతలో— 'ఓయీ మానవుడా' నీ అల్పమైన జీవితకాలంలో మరో రోజు గడిచిపోయింది. లేచి వెంటనే కర్తవ్యం గుర్తించి ప్రవర్తించు'— అనే అర్థం స్ఫురిస్తుందట. కమ్మని కల్పన. అద్భుతభావన. చక్కని రచన. ఉమర్ అలీషాగారి అనువాదం మూలానికి నిండుదనం సమకూర్చింది— ఆపద్యమిది.

30. ఉమర్ అలీషాకవి, ఉమర్ ఖయ్యామ్, పు. 17

"ఏటికుషస్సునందు నెలుగెత్తి పదేపదె కుక్కుటంబు ఆ
కోటలు మాఱు మ్రోయగను గొక్కొరొకోయని కూయుచుండె నా
నాటికి నాయువొక్కొక దినంబు క్షరించు నటంచు దాని కా
పూటను నర్థమున్ దెలుపబోలు ప్రమత్తత నేర వీ వదిన్"31

ఇలాగే పావురాల శబ్దానికి అర్థం కల్పించబడింది మరోచోట.

* * * *

కీడుచేసేవాడు శత్రువు. మేలుచేసేవాడు మిత్రుడు అనికదా లోకం. ఖయ్యామ్ ఒకరుబాయిలో ఇరువురి భేదం చక్కని పోలికతో వివరిస్తాడు—

"శత్రుడే తోడు పడినచో మిత్రు డగును
మిత్రుడే హాని చేసిన శత్రు డగును
విషము వికటింపకున్న నా విషమె యమృత
మమృత మైనను వికటింప నదియె విషము"32

విషాన్ని చూచి భయపడడం అనవసరం. విషం వికటించకుంటే అదే అమృతం. అదే మందయి జీవం పోస్తుంది. అమృతం తన గుణం కోల్పోతే విషమే అవుతుంది.

సహాయం చేసే శత్రువు, సమయానికి తప్పుకొనే మిత్రుడు లోకంలో లేకపోలేదు. ఇది ఖయ్యామ్ లోకజ్ఞతకు ఉత్తమ తార్కాణం. అలీషా ఈ రుబాయీకి భూతద్దం పట్టారు.

* * * *

"తనువు గుడారు వంటి దది తాల్చిన జీవుడు దాని లీల సం
దనువుగ నుండిపోవు దివికారయతేడు గుడారమందు తే
డని మృతియన్న కాల భటుడంతటవచ్చి గుడారమెత్తివే
యును నిక నొక్కచోట నిడ నూహను యత్నము సేయు గ్రమ్మఱన్"33

31. ఉమర్ ఆలీషాకవి, ఉమర్ ఖయ్యామ్, పు. 46
32. — పై గ్రంథమే — పు. 32
33. — పై గ్రంథమే — పు. 145

తనువు, జీవుడు, మృతి- వీటిని గూర్చి ఈపద్యంలో ఖయ్యామ్ వివరించిన తీరు అద్భుతమైంది.

* * * *

"జగమె దేహంబు ప్రాణమీశ్వరుడు సురలు
తచ్ఛరీరస్థ ప్రకృతి భూతములు నవయ
వంబు-లిదియె యేకేశ్వరత్వంబు గాన
తక్కగాథలన్నియును వ్యర్థములె సుమ్ము"34

ఖయ్యామ్ తాను దర్శించిన ఏకేశ్వరుని అనంతరూపాన్ని మన ఎదుట సాక్షాత్కరింపజేశాడీ పద్యంలో.

ఈ విధంగా అనన్యసాధ్యమయిన పాండిత్యం, అద్భుతమయిన కవితా కళా కౌశలం, తిరుగులేని జ్ఞానబలం ప్రతిరుబాయీలోను ప్రత్యక్షమవుతాయి. ఈ గుణాలు లేనిదే ప్రపంచాన్ని ఒప్పించడం మెప్పించడం సాధ్యంకాదు.

ఇది రెండో ప్రకరణం.

34. ఉమర్ అలీషాకవి, ఉమర్ ఖయ్యామ్, పు. 10

# మూడో ప్రకరణం

## ఉమర్ అలీషాగారి అనువాద సరళి

ఇస్లామ్ మతస్థుడైనా భావపుష్టితో తెలుగులో హృద్యమైన కావ్యరచన చేసి పండిత ప్రకాండుల ప్రశంసలందిన భాషామతల్లికి కులమతాల ప్రసక్తి లేదని నిరూపించిన అపూర్వ కవితా కళా తపస్వి డా. ఉమర్ అలీషా కవి.

వివిధ భాషల్లో విద్వత్తు గడించిన తత్త్వవేత్త అయిన అలీషా విశ్వ మానవ సౌభ్రాత్రం ఆశించి కలం పట్టారు. వివిధ సాహితీ ప్రక్రియా రచనల్లో పరిణత ప్రజ్ఞ కలవారన్న విషయం పూర్వోక్తం. అలాంటి వీరు తెలుగు ప్రజా లోకానికి ఖయ్యామ్ బోధామృతం పంచి పెట్టడంలో అద్భుతమైన సాఫల్యం పొందారు. వీరి అనువాద సరళి, ఔచిత్య శోభితమైన మధుర కవితా సృష్టి— ఈ సఫలత్వానికి గట్టి ఆధారాలు.

అలీషాగారి పద్యాలలో వ్యక్తమయ్యే ఖయ్యామ్ పాండితీ ప్రకర్ష ద్వితీయ ప్రకరణంలో వివరించబడింది. ఇక ఉమర్ అలీషాగారి అనువాద సరళి-కవితామాధుర్యం గూర్చి పరిశీలించడం ప్రధానం. ఈపరిశీలనకుముందు ఆంధ్రదేశంలో ఫారసీ నుండి అనువదించబడ్డ కావ్యానికి ఆదరణ ఉంటుందా అనే విషయం చర్చించవలసివుంది.

## అనువాదాలు-ఆంధ్రుల ఆదరణ

తెలుగు సారస్వతమే భాషాంతరీకరణంతో ప్రారంభమైంది. ఆదికవి నన్నయ ఇందుకు నాంది పలికాడు. శ్రీనాథుడు కావ్యానువాద పద్ధతికి శ్రీకారం చుట్టాడు. కవులు తమతమ ప్రతిభల్ని బట్టి సంస్కృతంలోని పురాణేతిహాసాల నుండి ఇతివృత్తం గ్రహించి ఆంధ్రీకరణ చేయడానికి ప్రయత్నించారు. ఈ పద్ధతి నేటి వరకు అనుసరించబడుతూనే ఉంది. కనుక ఆంధ్రీకరణ నేటిది కాదు. ఆది నుండి ఆంధ్రులు ఆదరిస్తున్నదే.

అయితే నన్నయభట్టు రచన అనబడే 'ఆంధ్రశబ్దచింతామణి'లో ఇలాఉంది.

"స్వస్థానవేషభాషాభిమతాస్సన్తు రస ప్రలుబ్ధ ధియః
లోకే బహుమన్యన్తే వైకృత కావ్యానిచాన్యదపహాయ"1

1. ఆంధ్రశబ్దచింతామణి, సంజ్ఞాపరిచ్ఛేదము, సూ. 5

తమదేశవేషభాషల్లో ప్రగాఢవాంఛ కల్గిన విద్వాంసులు రసలుబ్ధులైతే సంస్కృతభాషాకావ్యాల్ని ఆదరించినట్లు వికృతి భాషాకావ్యాల్ని [తెలుగుకావ్యాలు] ఎక్కువగా ఆదరిస్తారు. కాని ఇతర కావ్యాల్ని మాత్రంకాదు-అని అర్థం.

'అన్యదపహాయ' అనడంవల్ల పర్షియన్‌నుండి అనువాదం చేయబడ్డ గ్రంథానికి ప్రాచీన సంప్రదాయాన్ననుసరించి ఆదరణలభిస్తుందా? అనే ప్రశ్న ఉత్పన్నం కావచ్చు.

పర్షియన్‌భాష ఆర్యభాషఅని, ఇదీ మన సంస్కృతభాషకు సజాతీయమైందని భాషాశాస్త్రవేత్తల నిర్ణయం. కావ్యానువాదం చేసిన అలీషాగారు మతాన్నిబట్టి ముస్లిమ్ అయినా ఆంధ్రసాహితీ సంస్కృతుల్ని సంపూర్ణంగా జీర్ణించుకొన్న ఆంధ్రుడు. అగ్రశ్రేణి కవివరుడు. ఫారసీనుండి అనువాదమైనా తెలుగుజాతీయాలు, సూక్తులు, అలంకారాలు సందర్భానుసారంగా వీరి కావ్యమంతా చోటు చేసుకొన్నాయి. అందువల్ల ఈ గ్రంథం రసవంతమైన తెలుగుకావ్యమై విరాజిల్లింది.

## గ్రంథనామౌచిత్యం

అలీషాగారు తమ గ్రంథానికి 'ఉమర్ ఖయ్యామ్' అని పేరు పెట్టారని, గ్రంథంలో అనుస్యూతమయిన ఇతివృత్తం లేదని, ముక్తకకావ్యమని మొదట వివరించాను.

వేమన ఆటవెలదులలో అనుస్యూతమైన కథావస్తువులేదు.కనుక వేమన పద్యాలని ఆపద్యాలకు పేరు. అలాగే ఖయ్యామ్ రుబాయిూలకు ఉమర్ ఖయ్యామ్ రుబాయిూలని ప్రసిద్ధి కలిగింది.

ఉమర్ అలీషాగారి అనువాదంలోని అన్నిపద్యాలలోను ఉమర్ ఖయ్యామ్ తాత్త్వికచింతన, సందేశం చిత్రించబడి ఉన్నాయి. ఈ దృష్టితో గమనిస్తే, కావ్యంలోకథానాయకుడుగా ఖయ్యామ్ ప్రత్యక్షమవుతాడు. కాబట్టి ఉమర్ అలీషాగారు 'ఉమర్ ఖయ్యామ్' అని ఈ కావ్యానికి నామకరణం చేయడంలో సామంజస్యం కనిపిస్తుంది.

# ఉమర్ అలీషాగారి అనువాదసరళి-కవితామాధుర్యం

స్వతంత్రరచనకన్నా భాషాంతరీకరణం అత్యంత కష్టసమన్వితం. అనువాదకునికి సంపూర్ణస్వేచ్ఛ ఉండదు. మూలంలోని రసాన్ని, మూలకారుని ఆశయాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలి. రసభంగం కాకూడదు. మూలంలోని శాస్త్రవిషయాలకు ఏ లోపం వాటిల్లరాదు. రచన అసహజంగాగాని క్లిష్టాన్వయ భూయిష్టంగాగాని ఉండరాదు. అప్పుడే అనువాదకుడు ఉత్తమ ప్రతిభ కలవాడని అనిపించుకొంటాడు. అందుకే 'అనువాదం కత్తిమీద సాము'2 వంటి దంటారు పెద్దలు.

ఉమర్ ఖయ్యామ్ ఆశయానికి, తాత్త్వికదృష్టికి ఉమర్ అలీషా రచించిన 'ఉమర్ ఖయ్యామ్' నిలువుటద్దం అనడం స్వభావోక్తి. శ్రద్ధతో చింతనా దృష్టితో పరిశీలించవలసిన గ్రంథమిది. కావ్యమంతటా మధుర ప్రవాహంగా కవిత్వం జాలువారింది. అనువాదమైనా ఈ గ్రంథాన్ని తమ ప్రతిభాబలంతో స్వతంత్రకావ్యంగా కవిగారు తీర్చిదిద్దారు. ఇందుకు కారణాలు ఇలా ఉండవచ్చు.

ఉమర్ అలీషాగారి పూర్వీకులు పారశీకం నుండి తెలుగుదేశంవచ్చారు. పారశీక సాహితీ సంస్కృతుల్ని జీర్ణించుకొన్నవారు. పైగా ఆధ్యాత్మిక విద్య అనువంశిక సంపదగా కలవారు. ఆ వాతావరణంలో పుట్టి పెరిగిన ఉమర్ అలీషా స్వయంగా తత్త్వవేత్త కాగలిగారు.

'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అనికదా ఆర్యోక్తి. అలీషా ఖయ్యామ్ హృదయాన్ని అతని వేదాంతాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకొన్నారు. వీరికి తెలుగున కల అఖండపాండితీ ప్రకర్ష రుబాయీల అనువాదానికి

2 వలతి నుడికార మున్న భావంబు సున్న
భావ పరిపుష్టి యున్న నల్పంబు శయ్య
రెండునుం గూడ మూలానుస్మృతి దొలంగు
కత్తిపై సాము అనువాద కావ్య రచన

అవధానము చంద్రశేఖరశర్మ, ముద్రారాక్షసము నాటకము, సాహితీ సామ్రాజ్యము, పోరుమామిళ్ల, 1957, పు. 1

బాగా తోడ్పడింది. అందువల్ల ఈ అనువాదం ఫారసీకి రసవంతమైన తెలుగు రూపంగా భావించబడింది. ఇంతమధురంగా కావ్యాన్ని తీర్చిదిద్దడంలో అలీషా గార్లు అనుసరించిన అనువాద విధానం ఎలాంటిదో చర్చించడం ప్రకృత పరిశీలనలో ఒక భాగం.

అనువాదకులందరూ ఒకే పద్ధతి అవలబించరు. కొంతమంది కావ్యకళా దృష్టితోమూలాన్ని తారుమారు చేస్తారు. ఇది స్వతంత్ర పద్ధతి. కవిత్రయంవారి భారతాంధ్రీకరణం ఈ విధానంలోనే నడచింది.

మూలానుసరణ తప్పకుండా ముక్కకు ముక్క తెనిగించకుండా మూల విధేయత, స్వతంత్రత-రెండు గుణాలు కలిగి అనువాదం చేసేవారు మరికొందరు. ఇందుకు శ్రీనాథుని శృంగార నైషధం చక్కని ఉదాహరణ. ఈ కావ్యంతోనే ఈ పద్ధతి ప్రారంభమైంది.

కేవలం మూలానికి దాసులై ప్రవర్తించే భాషాంతరీకర్తలూ ఉన్నారు. సంస్కృత నాటకాలు తెనిగించడానికి, వీరనుసరించే విధానమే శరణ్యం.

ఉమర్ అలీషాగారు స్వేచ్ఛానువాదం చేయలేదు. కేవలం మూలానికి దాసుడూ కాలేదు. మూలాన్ని అనుసరిస్తూ ఔచితీదృష్టితో అవసరమని భావించిన చోట్ల మాత్రం కొంత స్వతంత్ర పద్ధతి అనుసరించారు. మూలంలోని అంద చందాలన్నీ చెక్కుచెదరక పాఠకులకు అందించాలన్నది వీరి అభిలాష. అందువల్ల అనువాద కళలో వీరెంతో ఓర్పు నేర్పు ప్రదర్శించారు. అనువాదం మూలానికి అతి సన్నిహితంగా ఉంది.

"ఎకనానీ బదో రోజ గరషవద్ హాసిలె మర్ద
బరకూజ షికిస్తాదమె అబె సర్ద
మామూరకనే దిగర్ చరాబాయెద్ బూద్
తా ఖిద్మతె చూఖుదీ చరా బాయెద్ కర్ద"3

అలీషాగారీ రుబాయీని ఇలా అనువదించారు.

3. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. VIII.

"రెండు దినాల కైన నొకరేయొక రొట్టె లభించెనేని నో
రెండిన వేళ నింత జల మిచ్చెడు పెంకు లభించె నేని, నే
నొండొరు వేడి వాని కొలువుండను - నా గతి మానవుండె, భూ
వుండును - వాని గొల్చుచును బొట్టను నింపు కొనంగ బోదునే"4

మూలాన్ని అనుసరిస్తూ పరుగులు తీసిన పద్యమిది. ఎకనానీ-ఒకరొట్టె; బదోరోజ - రెండురోజులకైనా; కూజషికిస్త - పగిలిన కూజ; దిగర్ - వేరు వాడు, ఒండొరుడు; ఖిద్మత్ - సేవ (కొలువు).

'కూజషికిస్త' అనే పదానికి 'జలమిచ్చెడు పెంకు' చక్కని ప్రయోగం.

సర్ద్ - చల్లని; ఆబ్ - నీరు; ఆబెసర్ద - చల్లని నీరు; త్రాగేనీరని అర్థం. మనం మంచినీళ్లని అంటాము. ఫారసీ ప్రభావంవల్ల ఉర్దూ హిందీలలో 'ఠండాపానీ' అని అంటారు. తెలుగులో మంచినీళ్లకు 'చల్లని నీరు' ప్రయోగం అలీషాగారికి నచ్చలేదు. అందువల్ల కేవలం 'జలం' అన్నారు. పద్యం మధురంగా కుదిరింది.

భావస్పష్టతకై చివరి పాదం పెంచారు. ఖయ్యామ్ వ్యక్తిత్వాన్ని ఈ పద్యం వివరిస్తూంది.

దువ్వూరి రామిరెడ్డిగారు ఒక్క తేటగీతలో ఈ రుబాయిని ఇలా అనువదించారు.

"రెండు దినముల కొకతూరి యెండురొట్టె
బోసి ముంతెడు చలినీళ్లు పుట్టునేని
ఏల నినుబోలు వానికి కేలు మోడ్చ
నొకనికి గులామవై ఎందుకూడిగింప?"5

మూలాన్ని అనుసరిస్తూ వన్నె చేకూర్చడంలో అలీషాగారు అసమాన నైపుణ్యం ప్రదర్శించారు.

---

4. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 35
5. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, పు. 28

آں قصر کہ بہرام درو جام گرفت
روبہ بچہ کرد و شیر آرام گرفت
بہرام کہ گور میگرفتی دایم
امروز نگر کہ گور بہرام گرفت 6

ఆన్ కస్రకి బహరామ్ దరోజామ్ గిరిఫ్త్
రూబా బచ్చా కర్ద్ వ షేర్ అరామ్ గిరిఫ్త్
బహరామ్ కి గోర్ మీ గిరిఫ్తీ దా ఇమ్
ఇమ్ రోజ్ నిగర్‌కి గోర్ బహరామ్ గిరిఫ్త్.
(మూలం)

"ఏసౌధాళిని విశ్రమించి బెహరామెంతే సురన్ద్రావెనో
యాసౌధాన గురంగసంతతియు, సింహవ్రాతమున్ నిండి యెం
తేసుప్తింగను నాతడే మృగములన్ హింసించెనో నేడవే
గాసిన్ ద్రొక్కగ గోరికష్టు బలియై కైసాచె కాలాహతిన్"7
(అనువాదం)

పద్యంలో కవితామాధుర్యం ఉట్టి పడుతూంది.

ఆన్ - అసమయాన; బహరామ్ చక్రవర్తి
కస్ర్ - హర్మ్యం; దరో - దానియందు; జామ్ - పానపాత్ర;
గిరిఫ్త్ - పట్టుకొన్నాడు; ఇప్పుడక్కడ
రూబా - నక్క; బచ్చాకర్ద్ - పిల్లల కంటున్నది;
షేర్ - సింహాలు; గోర్ - అడవి గాడిదలు;
ఆరామ్ గిరిఫ్త్ - విశ్రాంతి తీసుకొంటున్నాయి.

6. A. Narayanadas, RUBAIYAT OF OMAR KHAYYAM, P. 34

7. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 15

బహరామ్ చక్రవర్తి ఏ మృగాలనయితే గిరిఫ్త్—పట్టుకొన్నాడో; ఇమ్రోజ్— ఈ రోజు; అవే విచ్చలవిడిగా అక్కడ తిరుగుతున్నాయని భావం.

'జామ్ గిరిఫ్త్'—పానపాత్ర పట్టుకోవడం అని సాధారణ అర్థం. ఇందుకు 'సురన్ ద్రావుట' అన్నది మంచి ప్రయోగం.

'బహరామ్ ఏ మృగాల నైతే పట్టుకొన్నాడో' అనడానికి మారుగా అతడే మృగములన్ హింసించెనో (అనగా వేటాడెనో) అన్నది అనువాదకళా నైపుణ్యాన్ని స్పష్టం చేస్తూంది.

రూబ అనే శబ్దానికి పారశీకంలో నక్క అని అర్థం. ఉమర్ అలీషాగారికి లభించిన రుబాయీల్లో 'జింక' అర్థమిచ్చే శబ్దం ఉండిందేమో 'కురంగసంతతి' అనివ్రాశారు. శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు జంబుకమనే ప్రయోగించారు—

"అలబహరాము గోరి మధువానిన సుందర భోగ మందిరం
బుల మృగరాజు నేడు భయమున్విడి క్రుమ్మరు—జంబుకంబు పి
ల్లలగను—వన్యరాసభములన్ మృగయారతి బట్టినట్టి భూ
తలపతి గోరి పట్టువడె దానొక గోరి నెఱుంగుదే చెలీ!"8

శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు సైతం ఈ రుబాయీకి వృత్తమే స్వీకరించారు. వారి పద్యంలో 'హరిణము' అని ఉంది.

"హరిణము బిడ్డలన్ బెనిచె నక్కట! సింహము విశ్రమించెడిన్
ధరణి విభుండు 'బహ్రము' సుధామధువానిన సౌధమందు, నా
నరపతి వేటలాడెను వనంబులలో మను బిళ్ళనవ్వియే
యరమరలేక యిత్తరిని నాతనుజేరి సమాధి త్రవ్వుచున్"9



8. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, పు. 4
9. డా. బూర్గుల రామకృష్ణారావు, సారస్వత వ్యాసముక్తావళి, పు. 36

మూలానికి వన్నె చేకూరుస్తూ, ఔచిత్యాన్ని పోషిస్తూ అలీషాగారు చేసిన అనువాదానికి మరో ఉదాహరణ—

آنان که محیط فضل وآداب شدند
ازجمع کمال شمع اصحاب شدند
ره زین شب تاریک نبردند برون
گفتند فسانه ودرخواب شدند 10

ఆనాన్‌కి ముహితి ఫజ్‌ల్ వ ఆదాబ్ షుదంద్
అజ్ జమయి కమాల్ షమా అయ్ అస్‌హాబ్ షుదంద్
రాహ్ జిన్ షబి తారీక్ న బుర్ దంద్ బిరూన్
గుఫ్‌తాంద్ ఫసానయీ వ దర్ ఖ్వాబ్ షుదంద్

(మూలం)

"శరధిని బోలు విద్యయును జ్వాలను బోలిన జ్ఞాన దీప్తియున్
బరగిన వారలీ నిశిత భాసుర గాఢ మహాంధకార బం
ధురతర మార్గమున్ గడచు త్రోవ నెఱుంగక కల్పనాకథా
భరిత వివాద వీచికల పాలయి ప్రాణము వాసి రార్తులై"11

(అనువాదం)

ఫజ్‌ల్ - చదువు; ముహీతి - సముద్రం; 'ముహితి ఫజ్‌ల్' అనే మూలానికి 'శరధిని బోలు విద్య' మెరుగులు దిద్దుతూంది. 'కమాల్ షమా' 'జ్ఞానదీప్తి' యై వెలుగుతూంది. 'రాహ్ జిన్ షబి తారీక్' రాహ్ - దారి; తారీక్ - చీకటి; షబ్ - రాత్రి; ఇందుకు అలీషాగారు వ్రాసిన 'మహాంధకార బంధురతర మార్గము' అర్థస్ఫూర్తి కలిగి రమణీయంగా ఉంది.

---

10. RUBAIYAT OF OMAR KHAYYAM, P. 118
11. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 2

ఫసానయి - ముచ్చటగా చెప్పుకొనే కథలు;
"కల్పనా కథా..." అని చక్కని రూపం దాల్చింది.

దర్ ఖ్వాబ్ షుదంద్ - శాశ్వత నిద్రలో మునిగారని అర్థం. ఇక్కడ మాత్రం "ప్రాణమువాసిరి" అనికుదించబడింది. అనువాదంలో కొంత అందం తగ్గింది.

* * * *

ఉమర్ అలీషాగారు కొన్ని రుబాయీలను అందమైన కందాల్లో చిత్రించి, అనవసరమని భావించిన మూల భాగాన్ని పరిహరించారు.

دی کوزه گری بدیدم اندر بازار
بر تازه گلی لگد همی زد بسیار
و آن گل بزبان حال با او می گفت
من هم چو تو بوده ام مرا نیکو دار 12

దీ కూజగరీ బదీదమ్ అందరి బాజార్
బర్ తాజ(ఝ)గిలీ లకద్ హమీ జద్ బిస్యార్
వాన్ గిల్ బజ బాని హాల్‌బా ఊమీ గుఫ్త్
మన్ హమ్ జూతూ బూద అమ్ మరా నే కూదార్
(మూలం)

దువ్వూరి రామిరెడ్డిగారీ రుబాయీని ఇలా అనువదించారు—

నిన్నటి రోజు కుమ్మరిని నేఁగనుగొంటి బజారు వీధిలో
మన్నిక ముద్దజేసి మడమం జెడ ద్రొక్కుచునుండ వానితో
దిన్నగ మందలించెనది దీనత 'మెల్లగనల్ల ద్రొక్కుమో
యన్న. యెఱుంగవేనను? నొకప్పుడు నీవలె నందగాఁడనే'13

12. Rubaiyat of OMAR KHAYYAM, P. 70
13. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, పు. 30

ఫిట్జ్‌రాల్డ్ అనువాదం ఇలా సాగింది—

For I remember Stopping by the way
To watch a potter thumping his wet clay:
And with its all-obliterated Tongue
It murmur'd-"Gently, Brother, gently, pray!"14

ఉమర్ అలీషాగారి పద్యమిది—

"కుమ్మరి మట్టిని గాలన్
గ్రుమ్మగ నది చూచి వాని గూర్చి వచించెన్
గుమ్మరి నీవలె మును నే
నిమ్మహి మానవుడ; గౌరవింపుము నన్నున్"15

మూలంలోని 'అందరి బాజార్' — బజారు వీధిలో; తొలగించబడింది. మట్టి మాటాడిన మాటల్లోని 'గౌరవింపుము నన్నున్' అన్నది పద్యానికి మకుటాయమానంగ ఉంది.

* * * *

రుబాయీల అనువాదంలో వృత్తాలు, కందాలు, ఆట వెలదులు, తేట గీతులేకాదు సీసపద్యాలు సైతం ఉమర్ అలీషా రచించారు. ఈ సీస పద్యాలలో మూలంలోని భావం సాగదీయబడింది. ఇంత పెద్ద పద్యాన్ని నింపడం కోసం స్వతంత్రంగా క్రొత్త అర్థాలు తెచ్చి పెట్టుకొన్నారు—

"ఆ యీశ్వరుని రహస్యంబు ప్రశ్నోత్తర
మ్ములచేత నెన్నడు దెలియబడదు
వెలలేని ధనమును వెచ్చించి సాధింప
సాధ్యంబుగాదు నిస్సంశయంబు
బహువత్సరంబులు ప్రాణంబులరికట్టి
నెత్తురు తపసున నీరు జేసి
కష్టముల్ పడకుండ గాంచనేరవు బ్రహ్మ
వస్తువు నాస్తి కౌభాసమందు

14. FITZERALD, RUBAIYAT OF OMAR KHAYYAM, P 126

15. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 16

ఈ యమూల్యమౌ రత్నమదేదొ గనిది
ఈ లసన్మౌక్తికపు విధమేదొ వేఱు
ఈ కళాభేదములు దోచు నీకు నాకె
ప్రియుల కథలతో మాటతే వేఱు కాదె"16

* * * *

మూలంలోని సారానికి ఏ లోపం కలగకుండా భావ సౌకుమార్యంతో ఆలంకారిక శైలిలో సరసరీతిని పద్యరచన చేయగల నైపుణ్యం మహాకవులసొమ్ము.

چو عهده نمی کند کسے فردارا
حال خوش کن تو ایں دل شیدارا
می نوش بنور ماه ای ماه که ماه
17 بسیار بجوید و نیابد مارا

చూన్ ఉహ్దద నమీ కునద్ కసీ ఫర్ దారా
హలే ఖుష్ కున్ తూ ఈన్ దిలీ షాయ్ దారా
మయ్‌నోష్ బనూరి మాహ్ అయ్ మాహ్‌కి మాహ్
బిస్యార్ బజూ యద్ వ నయా బద్ మారా
(మూలం)

ఈ రుబాయీకి ఉమర్ అలీషాగారి అనువాదం క్రింది విధంగా ఉంది.

"తెప్పున శేను బూటపడి రిక్తులు గారటు గాన నేడె సం
తాపములన్ ద్యజింపుము సుధాంశునిభాస్య! సుధాంశుడున్న యీ
మాపు విలాస మేర్పడగ మద్యము ద్రావుము—చంద్రుడెప్పుడున్
గాపురముండు మింటను బ్రకాశముతో మనముండ నేర్తుమే"18

---

16. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 9
17. A. Narayanadas, Rubaiyat of Omar Khaiyam, P182
18. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 9

ఇందలి అర్థాంతర న్యాసాలంకారం పద్యానికి వినూత్నశోభ సమకూర్చింది.

ఆదిభట్ల నారాయణదాసుగారు ఈ రుబాయీని అచ్చ తెలుగు లో ఇలా అనువదించారు.

"ఎవ్వడున్ జెప్పలేడే రేపు గూర్చి
యకట తమిన్నొకుక్కనాద నే దార్చు
విడిసీవిరిద్రాావు—వెన్నెలన్మనల
నెలక నదినికనిండు–నెలమూతిదాన!"19

'సుధాంశునిభాస్య' సంస్కృతసమాసానికి 'నె ల మూ తి దా న' అని నారాయణదాసు అన్నారు.

అత్యంత సరళశైలిలో భావపుష్టికి లోటు కలగని విధంగా అలీషాగారి పద్యాలెన్నో ఉన్నాయి. ఇంత మనోజ్ఞంగా అనువాదం చేయడం ఒక కళ.

ناکردہ گنہ درجہاں کیست بگو
آنکس کہ گنہ نہ کرد چوں زیست بگو
من بدکنم وتو بدمکافات دہی
پس فرق میان من وتو چیست بگو 20

నా కర్ద గునాహ్ దర్ జహాఁ కీస్త్ బెగో
ఆఁ కస్కే గునాహ్ న కర్దచూఁ జీస్త్ బెగో
మన్ బదుక్కనమొ తుబద్ ముకాఫాత్ దెహీ
పస్ ఫర్క్ మియానె మనొతు చీస్త్ బెగో

19. A. Narayanadas, Rubaiyat of Omar Khayyam, P183
20. రియాజ్ జునేదీ, జజ్‌బాత్—ఎ— ఉమర్ ఖయ్యామ్, రియాజ్ అకాడమీ, ఖల్‌దా, హైదరాబాదు, 1943. పు. 100

"చెప్పుము పాపముల్ నరులు చేయని వారెవరో జగంబునన్
చెప్పుము పాపముల్ నరులు చేయనిదే బ్రతుకెట్లు సాగునో
తప్పులు మేము చేసెదము దండన నీవొనరింతువేని నీ
గొప్పదనంబు మాకిడిన కొద్దితనంబననేది యీశ్వరా!"21

దర్ జహాఁ—లోకంలో; గునాహ్—పాపాలు; కీస్తనాకర్ద—చేయని వాడెవడు;

అని నిరాడంబరంగా సాగిన పద్యమిది. తెలుగు రూపం మూలంతో తాదాత్మ్యం పొందింది.

ఉమర్ అలీషాగారు మూలాన్ని అనుసరించారు. సందర్భాన్ననుసరించి భావాన్ని విస్తృతపరిచారు. కుదించారు. రసపోషణ చేశారు. అలంకారాలు ప్రయోగించారు. కవితామాధుర్యాన్ని చిందించారు. ఒక్క మాటలో చెప్పా లంటే మూలానికి సాటిలేని విధంగా వన్నె చేకూర్చారు.

ఈ విధంగా అనువాదం రాణించాలంటే అనువాదకుడు ఆ ఫారసీభాషా మధుర విన్యాసాల్ని, సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలి. తెలుగు భాషా మర్యాదలతో జాతీయాలతో పలుకుబడులతో గ్రంథాన్ని అపూర్వంగా తీర్చి దిద్దడం సామాన్యంకాదు. కనుక ఉభయభాషల్లోను ఎంతో సామర్థ్యం సంపా దించుకోవాలి. హృదయమెంతో పరిపక్వమై ఉండాలి. ఆలీషాగారీ విద్యలో నిష్ణాతులని నిరూపించుకొన్నారు.

* * * *

## భాష - శైలి

పాఠకుడు ఆకర్షించబడడానికి ముఖ్యమైంది భాష. ఈ భాష నాతి కఠినమై సరళంగా ఉండాలి. కృత్రిమమైందికాక స్వభావసిద్ధమైన పదజాలం ఎంతయినా అవసరం. లేకపోతే పాఠకుడు కవిభావాన్ని అందుకోలేడు.

ఖయ్యామ్ తత్త్వామృతం జగత్తుకు పంచిపెట్టడం పరమలక్ష్యంగా అలీషా గారు భావించి 'ఉమర్ ఖయ్యామ్' కావ్యాన్ని మహత్తరమయిన తత్త్వ

21. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు.78

గ్రంథంగా తీర్చిదిద్దారు. ఖయ్యామ్ హృదయాన్ని, భావాన్ని అర్థం చేసుకొనేందుకు తగిన స్వచ్ఛమయిన భాష ఉపయోగించబడింది.

కావ్యవస్తువునుబట్టి భాష ఉండాలి. ఉమర్ ఖయ్యాంలోని ఇతివృత్తం తాత్త్వికబోధకు సంబంధించింది. తాత్వికచింతన పరమావధిగా కలిగిన కావ్యంలో శబ్దకాఠిన్యం అధికమైతే కావ్యం నిరూపయోగం కావచ్చు. అలీషాగారి భాష సరసమూ, హృదయంగమమూ కావున కావ్యానికి ఎనలేని ప్రయోజనకత్వం చేకూరింది. ప్రతిపద్యం మనోజ్ఞమై ఒప్పింది.

కవి చిత్తవృత్తినిబట్టి కావ్యశైలి ఉంటుందంటారు. సరస హృదయులైన అలీషాగారి ఉమర్ ఖయ్యామ్ కావ్యం ప్రసాద మాధుర్యగుణాలతో నిండింది. ఓజోగుణం కనిపించదు. దీర్ఘసమాసభూయిష్ఠం, అర్థకాఠిన్యం, దూరాన్వయం లేవు. సందర్భాన్ననుసరించి అనివార్యమని భావించిన కొన్నిచోట్ల మాత్రమే స్వల్పసంఖ్యలో పద్యాలు సంస్కృత సమాస భూయిష్ఠంగా భావ గంభీరంగా ఉన్నాయి.

'సద్యఃపరనిర్వృతయే'22 అనే ఆలంకారిక సూత్రాన్ని బట్టి రచన సద్యోరస సంజనకం కావాలి. అప్పుడే కావ్యోద్దేశం నెరవేరుతుంది. ఇందుకు సరళశైలి ఎంతయినా అవసరం.

పాఠకుడు రసాభిముఖంగా పయనం చేయడానికి ఉపయోగపడేది శైలియే. శైలి క్లిష్టమైతే పాఠకుని ప్రయాణానికి అవరోధం ఏర్పడుతుంది. అందువలన శైలీ నిర్వహణలో కవి జాగ్రత్త వహించక తప్పదు.

ఉమర్ అలీషాగారి శైలి సుగమం. ఆకర్షకం. వీరి కవితలో అనవసరమయిన శబ్దాడంబరాలూ, సమాసాడంబరాలూ లేవు. మారుమూల పదాలకు తావులేదు. కావ్యానికి మరింత శోభ చేకూర్చే సహజాలంకారాలు ఉన్నాయి.

---

22. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తా సమ్మితయోపదేశముజే

మమ్మటుడు, కావ్యప్రకాశము.

వీరి ఆలంకారిక శైలికి కొన్ని ఉదాహరణలు:—

## 1. ఉపమాలంకారం

"ఈవు ధరిత్రి నస్థిరుడవేని గృహంబులు కట్టి గర్వివై
పోవుదువేల?........

ఝంఝానిల జృంభణమ్మున నిజంబుగ దీపము బెట్టినట్టు,
లాశైవలినీ ప్రగర్భమున సౌధముగట్టినయట్లు......"23

## 2. రూపకాలంకారం

"లెమ్మిక తెల్లవారినది లీలనిశాంగన కొంగుముక్కలై
యిమ్మెయి నేలరాలినది"24

## 3. అర్థాంతరన్యాసాలంకారం

"చంద్రుడెప్పుడున్, గాపురముండు మింటను బ్రకాశముతో
మనముండ నేర్తుమే."25

## 4. దృష్టాంతాలంకారం

"ఆరమణీ మనోహర ముఖాబ్జము ముంగురులుంగరాల సిం
గారముబెట్టి దిద్దితి—వికాసము గుల్కెడు ముద్దరాలి గ
న్నారగ జూడరాదనెదవక్కట! నిండిన నీటి పాత్రమున్
భోరలవేసి నేలబడబోవదు నీరనునట్టులుండదే"26

## ఛందస్సు

రచనలో వైవిధ్యం అవసరం. లేకపోతే రచన నిస్సారం కావచ్చు. ఈ రచనా వైవిధ్యానికి ఛందస్సు ఎంతో తోడ్పడుతుంది. సందర్భాన్ననుసరించి

23. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 43
24. — పై గ్రంథమే — పు. 58
25. ,, పు. 47
26. ,, పు. 22

ఛందస్సును మార్పుచేసుకోవడమే ఇందుకు పాటించబడింది. ఉమర్‌ఖయ్యామ్ కావ్యంలో 720 పద్యాలున్నాయి. ఈ పద్యాలన్నీ ఒకే ఛందస్సులో ఉంటే పాఠకునికి విసుగుకలుగుతుంది. కావ్యం ఆస్వాదయోగ్యంకాదు. ఈ సత్యాన్ని గమనించిన అలీషాగారు వృత్తాలు, జాతులు, ఉపజాతులవంటి వివిధ ఛందో రీతుల్ని చేపట్టారు.

ముద్దులొలికే భావం చెప్పదలచినపుడు అర్థవంతమయిన శబ్ద ప్రయోగంతో కందాలు వ్రాశారు.

ఉదాహరణకు—

"ఎంతెంత యహము వడలునొ
యంతంత ప్రవర్ధమాన మబ్బును— నాకెం
తెంతగ వినయం బేర్పడు
నంతంతగ మైకమబ్బు నానందసుధన్"27

మరోసారి నాటకీయఫక్కీలో పాడిపాడి మాటలతో దండ కూర్చినట్లు ఉత్పలమాలలు, చంపకమాలలు అల్లారు.

"లలన! దయావిలోకనములన్ నను చూడుము—చూచినంతనే
కలుషములాఱు—సంతసము గల్గు—సదుక్తుల మామనంబులన్
వెలుపకయే గ్రహింపగల తేజమునున్నది లోననీకు—నీ
చెలువగు మానసంబు 'జమషీదు నిరుక్కలశంబు' నెచ్చెలీ"28

అతినిగూఢమైన ఆధ్యాత్మిక భావం వ్యక్తం చేయడానికి తేటగీతులు రచించారు. ఇవి చక్కని నడక కలిగి పఠనాసక్తిని పెంచుతున్నాయి.

"గాలినై వాని చికురముల్ కదపలేను
వాని చింతాశ్వశృంఖలఁ ఇట్టలేను
వాని వీక్షింప నీ కనుల్ పనికిరావు
పనికి వచ్చిన జూడగా ననువు పడవు"29

27. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 177
28. — పై గ్రంథమే — పు. 174
29. ,, పు. 9

సందర్భ శుద్ధి ననుసరించి భావాన్ని విస్తృతపరచవలెనను కొన్నప్పుడు సీస పద్యాలు రచించారు.

కొన్ని చోట్ల తేటగీతి 5 పాదాల్లోను 7 పాదాల్లోను నడచింది. ఆటవెలది గాని తేటగీతిగాని లేకుండా కొన్ని చోట్ల సీస పద్యాలున్నాయి. ఈ విధంగా ఉమర్ ఖయ్యామ్ కావ్యం ఛందో వైవిధ్యం కలిగి నూతనత్వం ఆపాదించు కొన్నది.

## విశిష్ట ప్రయోగాలు

అలీషాగారు తమ కావ్యంలో ఎన్నో విశిష్ట ప్రయోగాలు చేశారు. అవి లోకోక్తులుగా, సూక్తులుగా సహృదయుల్ని ఆకర్షించగలవు.

ఉదాహరణకు కొన్ని—

"... ఆ
హా! కాలంబొక పూటయైన గడుపీయంబోవ దర్థించినన్"30

"... చచ్చిపై
కోడక పోయినట్టి నరుడొక్కడు వచ్చిన జాడ యున్నదే"31

"... త్రావు మీ సురనుబోసిన భాండములెత్తియెత్తి నీ
కాయపు భాండమే పగిలి ఖండములై పడిపోక పూర్వమే"32

"... లో
పలికిని బిల్చుగాలి విడువంబడునో తెగి యంతరించునో"33

"... సురచెమ్మ ద్రావవము జీవము లూరిన పేళ్ళులున్నవే"34

30. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 52
31. — పై గ్రంథమే — పు. 56
32. " పు. 57
33. " పు. 64
34. " పు. 62

"ముండ్ల పొదలనె గద గులాబులు జనించు"35

" . . . దు
ర్భర భేరీనినదంబు దూరమునకున్ శ్రావ్యంబుగా నుండదే"36

"చేదుగా దోచు హిత మెప్పు"37

" . . . వారముల కీవు
భక్తుడవు కాకు మీశ్వర భక్తుడగుము"38

" . . . సహచర్య మూరకయె పాయదుగా యెటువంటి వారికిన్"39

" . . . కర్మిష్ఠి బాహ్య ప్రార్థనము కంటె
కర్మ బాహ్యుని యొక యశ్రు కణము ఘనము"40

"వగచిన ప్రాప్తమందు నొక పంక్తియు మారదు కోటి చెప్పినన్"41

## కొన్ని నుడికారాలు

'పూసను గ్రుచ్చినట్లు' పు. 43
'అతుకులమారి బొంతలు' పు. 138
'లోన లొటారము' పు. 139

ఈ విధంగా ఉమర్ ఖయ్యామ్ కావ్యం పారశీక మూలానికి అనువాద మైనా లోకోక్తులు, సూక్తులు కలిగి భావ స్పష్టీకరణ, రసపోషణ, శైలీనిర్వహణలలో విశిష్టమయిన వైఖరి నవలంబించి ప్రశంసార్హమైంది.

---

35. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 63
36. — పై గ్రంథమే — పు. 82
37. ,, పు. 96
38. ,, పు. 112
39. ,, పు. 124
40. ,, పు. 138
41. ,, పు. 168

## ప్రమాదో ధీమతామపి

కవితా రచన రసస్ఫోరకమైనా మహాకవుల రచనలలోని కొన్ని పద్యాలకు వలెనే ఈ కవి పద్యాలలో సైతం దోషగ్రస్తత తప్పలేదు.

" . . . నేటి సుం
దరభాండంబును రేపుదాకను త్రుటిన్ దన్నున్ రజంబైచనున్"42

ఇందులోని భావం ఈనాడు సుందరంగా కన్పడే భాండం సైతం రేపటికి ఒక్క త్రుటిలో తాను దుమ్మయి పోతుంది అని.

కనుక —

" . . . నేటి సుం
దర భాండంబును రేపుదాకను త్రుటిన్ దానున్ రజంబైచనున్"
అని ఉంటే దోషగ్రస్తత తప్పుతుంది.

" ... ... ... ... ...
... ... ... ... ...
కోవిదుం డిచ్చు విషమైన గ్రోలు మల్ల
దుర్జనుండిచ్చు పాలైన ద్రోసిపుచ్చు"43

అమృతానికి వ్యతిరిక్తమయిన పదం విషం. పాలు కాదని నా భావం. అమృతం—విషం, పాలు—నీరు అని లోక ప్రసిద్ధి. కనుక

కోవిదుండిడు విషమైన గ్రోలు మల్ల
దుర్జనుడిడు నమృతమైన ద్రోసి పుచ్చు

అని ఉంటే బాగుంటుంది.

మరో చోట విభక్తి ప్రయోగలోపం జరిగింది.

'కోవిద! వట్టిచేతులతో గుండుచు గాటికి బోవనేటికో'44

---

42. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 43
43. — పై గ్రంథమే — పు. 33
44. " పు. 26

చేతులతో అని ఉండాలి. చేత–తోడ తృతీయ అని బాల వ్యాకరణం. కాబట్టి 'చేతులలో' ప్రయోగం హృద్యమైంది.

కోవిద! వట్టి చేతులనే కుందుచు గాటికి బోవ నేటికో–

అని ఈపాదం నిర్దుష్టంగా వ్రాయడానికి అవకాశముంది.

ఇంకా ఒకటి రెండు చోట్ల ప్రాస తప్పడం ఛందోభంగం కలగడం జరిగింది.

అలీషాగారు జీవితమంతా లోకసేవకే అంకితం చేసినవారు. బహుకార్య నిమగ్నులు. కనుక రచనా విషయంలో పునర్విమర్శన లేనివారు. ఈ చిన్న దోషాలు ఉన్నంత మాత్రాన కావ్యత్వానికి భంగం వాటిల్లదు. ఉత్తమ గుణాలు కల అలీషాగారి కవితలో ఇవి లెక్కించ దగినవికావు.

## ఉమర్ ఖయ్యామ్ తాత్త్విక చింతన

ఉమర్ అలీషాగారు రుబాయీల అనువాదంలో అప్రతిహతమైన ప్రతిభ చూపించడమే కాదు, ఖయ్యామ్ తాత్త్విక దృష్టిని చిత్రించడంలోను మహోన్నతమయిన పాండిత్యం ప్రదర్శించారు. ఖయ్యామ్ తత్త్వమే విచిత్రమైంది. మధువు, మానినిపై ఆసక్తి కలిగి జీవితం గడపడమే లక్ష్యంగా కావ్యమంతా వర్ణించబడి హితబోధ చేయబడింది. సాహితీ జగత్తులో వింత ప్రయోగంగా భావించబడిన ఈ కావ్యంలోని తాత్త్విక చింతన పరిశీలించడానికి ముందు ఖయ్యామ్ కావ్యంలోని మధువు మానినులను గూర్చి వివరించడం అవసరం.

## మధువు - మానిని

మన కావ్యాల్లోని అష్టాదశవర్ణనల్లోను మధుపాన వర్ణన ఒకటి.

"వనజలకేళీ రవి శశి
తనయోదయ మంత్ర గతి రతక్షితి పరణాంబు
ధనశైల మధుపానసుతోత్స్వ
హనగవిరహ దూత్య వర్ణనాష్టాదశమున్"1

1. నన్నెచోడ కుమారసంభవము, ప్ర.ఆ.ప: 44

అంతేకాని, కేవలం మధుపాన వర్ణనే విచ్చల విడిగా ఏ కవికావ్యంలోనూ వర్ణించబడలేదు.

"మా సభయందు ద్రాగుడును, మంజులగానము, పాన పాత్రతే
భాసిలుచుండు - మేము మధుపాన మదోద్ధతి నుందు మెప్పు ----"2

అని ఖయ్యామ్ ఒకపద్యం ప్రారంభించి "మా ఆసవమున్ మృగాక్షియధ రాసవమున్ మముదేర్చు నెంతయున్" అని ముగిస్తాడు. మధువు, చంచలాక్షి అధరామృతము జీవితాన్ని తరింప జేస్తాయట. పెక్కుమందిని కలవరబెట్టిన ఈ విషయం వాస్తవమేనా! చర్చించవలసి ఉంది.

మదిరాలోలుడు స్త్రీలోలుడు అయిన మానవుడు విచక్షణా రహితంగా ప్రవర్తించి తన సర్వసం కోల్పోతాడు. పతనావస్థకు లోనవుతాడు. ఇది నిత్య సత్యమని లోకం భావించింది.

భారతంలోని కచదేవయాని కథలో శుక్రాచార్యుడు సురాపానం చేసి, అనంతరం జరిగిన అకృత్యానికి చింతించి, మధుపానం మహాపాతకంగా శపించాడు. ఆ పద్యాలివి.

"మొదల పెక్కు జన్మములఁ బుణ్య కర్మముల్
పరగ బెక్కు సేసి పడయ బడిన
యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన
చెఱుచు మద్యసేవ సేయ నగునె

భూసురు లాదిగ గల జను
లీ సుర సేవించి రేని యిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు
చేసితి మర్యాద దీని జేకొనుడు జనుల్"3

2. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 20
3. నన్నయ, శ్రీ మదాంధ్ర మహాభారతము, ఆది ప. తృ.ఆ. ప. 120-12

అయితే యీ మధువును మధుపుకన్నా మత్తు కలిగించే మగువను ఖయ్యామ్ వేనోళ్ళ కొనియాడాడు. ఈ లోకానికి మనం ఎక్కడి నుండి వచ్చామో తెలియదు. జీవితం అశాశ్వతం. కనుక ఉన్నన్నినాళ్లు సకలసౌఖ్యాలు అనుభవించడానికి మధువును త్రాగమన్నాడు. మగువ సరసన కాలం గడప మన్నాడు.

"ఉసురు విడిచి పై లోకాల ముసుగునందు
మాయమై పోయెదవుకాన మధువు ద్రావి
సకల దినము లానందాన గడుపు మెచట
నుండి వచ్చితొ యెట కేగ నుంటి వొక్కొ"4

"పువ్వులతోడ దూగు పువుబోడులతో జతగూడి, మద్యమున్
నవ్వుచు ద్రావు"5

"ఓ వెలదీ! సుగంధ రుచిరోజ్జ్వల శీధురసంబు దెమ్ము....
. . . . . . . . .
యీవును నేను గాలహతి నీల్గి ఘటంబులు కాక పూర్వమే
త్రావి పలాశపాన్పుల ముదంబున బుత్తుము శేషకాలమున్"6

అని జీవితం అంతం కాకముందే సురలోక భోగాలు అనుభవించడానికి తన అలివేణిని ఆహ్వానిస్తాడు. తన ప్రేయసే తనకు సర్వస్వం. ఆమె గొప్పదనం వర్ణనాతీతం. ఆమె పాదధూళి సోకిన చాలట. అందుకే ఇలా అంటాడు.

"చెలి! భవదాననంబు 'జమషీదు సుధాకలశంబు' మించె-నీ
తలపున జచ్చుటే సుధను ద్రావుటకంటెను మేలు-నీ పదం
బుల బడు ధూళి నాదు దినముల్ వెలుగొందగజేయు-దత్కళా
కలితరజంబులో లవము కాంతిలు-కోటి రవిప్రకాశమై"7

---

4. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 3
5. ---- పై గ్రంథమే ---- పు. 58
6. ,, పు. 62
7. ,, పు. 135

అంతటితో ఆగడు-

"ఓ చెలీ! నిన్నునే గలియ నుంతగి జేతులు చాచి కోరికన్
నీ చెలుగంటకుండ విడనేరను" 8

అని ఆమె పొందుకోరుతాడు. తన ప్రాణం కన్నా ఆమె అధికమట.

"లలనా! నాకీవు పూజ్యురాలవు, ధరిత్రి
నిన్ను శిరసావహింతునే మన్నగాని
యసువు కన్నను నధికమీయవనిలేదు
కాని, నీ కన్ననసువధికంబుగాదు"9

రేపటి జీవితం సందేహాస్పదం. నేడు నిజం. వ్యర్థంగా కాలం వెళ్లబుచ్చక ఈ రోజే ఆనందం అనుభవించు.

"---నే, దమల విలాస వైభవములందుము---రేపటి మాటవీడు-ని
న్నపురలిపోయె-మేలని మనంబున నెంచుము నిత్యతోషివై"10

అని బోధించి

ఈ శీధుపా

త్రలతో బోలెడు మానసంబుగల మిత్రపాత మెందుండునే"11

"సురయే బలమును, జవమును
సురయె రహస్యముల నెల్ల శోధించును నీ
సురనిడ నిహపరము తొదవు
సుర గ్రుక్కెడు కంటె స్వర్గమెటుల గలదే"12

8. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 40
9. ,, పు. 121
10. ,, పు. 84
11. ,, పు. 22
12. ,, పు. 91

అని మధువు మహిమను కొనియాడుతాడు.

మధువును మానినీ ప్రణయ మంజులగాన సుధా ప్రపూర్ణ స
తృథమును మైకమీ త్రయ మవశ్యము లేయెడ మర్త్యకోటికిన్" 13

వంటి పద్యాలవల్లను అశాశ్వతమైన ఇహలోక జీవితంలో తృప్తితీర మధు పాన మొనర్చి సుందరాంగులతోకూడి ఆనందం అనుభవించడమే జీవిత పరమావధి అని ఖయ్యామ్ బోధించినట్లు స్పష్టమైంది. శృంగార రసభావాలతో నిండిన అనేక పద్యాలతో పరలోకాన్ని మరపించి ఇహలోకంపై వ్యామోహం పెంచాడు ఖయ్యామ్, ఈ తత్త్వం కొందరికి అనంతమైన ఆనందం కలిగించింది. కొందరికి బాధ కలిగించింది. మరికొందరు ఖయ్యామ్ సృష్టించిన మధువు-మానినిగూర్చి సుదీర్ఘంగా ఆలోచించారు. మధువు ద్రాక్షాసవమేనా; వలచిన నెచ్చెలి మైమరపించి సుఖాలనోలలాడించే మదిరాక్షియేనా, అన్నది వారి సందేహం.

"కొందరు చరిత్రమును బట్టి చూడ ఉమర్ సంతోష ప్రియుడనియు, భోగ పరాయణుడనియు, తరుణీలంపటుడనియు దెలియుచున్నది. కావున నతని గీతములు పాంచభౌతిక శరీరధారిణియగు నొకానొకలతా తన్విని గూర్చిన పలవరింతలుగాని పారలౌకిక వాంఛలచే పీడింపబడిన భక్తుని ప్రణయనివేదనములు కావని అభిప్రాయపడినారు.''14

అందువల్లనే ఇతనిని వామ మార్గావలంబుడని కొందరు భావించారు. అయితే సూఫీ తత్త్వం గూర్చి పరిశీలిస్తే పై అభిప్రాయం వాస్తవంకాదేమో అనిపిస్తుంది.

"సత్య స్వరూప మజ్ఞేయమనియు, సర్వాంతర్యామియగు శక్తి నిర్గుణ మనియు, జీవుడు కర్మబద్ధుడనియు, జీవితము క్షణ భంగురమనియు కావున ప్రేమయే (భక్తియే) ముక్తి సాధనమనియు సూఫీల ఉపదేశము. వైరాగ్య మునుగూడ నొక సాధనముగా నంగీకరించినను జీవిత సామాగ్రి నుపయోగించు కొనవలయుననియే వారి అభిప్రాయము. ఐహికక్షేమ దైవభక్తికి మార్గ దర్శక మని వారి మతము''15

---

13. ఉమర్ అలీషా. ఉమర్ ఖయ్యామ్, పు. 95
14. డా. బూర్గుల రామకృష్ణారావు. సారస్వత వ్యాసముక్తావళి, పు. 28
15. ” పు. 29

కాబట్టి ఖయ్యామ్ మదిరను మానిని (జీవిత సామాగ్రి) ని ఉపయోగించి లౌకిక ప్రేమనుండి దైవభక్తికి ప్రేరేపిస్తున్నాడన్న భావం కలుగుతుంది.

"అసలీతడు (ఉమర్ ఖయ్యామ్) విషయాసక్తుడే కాడని, ఈతని వేదాంతములోని మధువు ధ్యానామృతమని, కాంత ముక్తికాంతయని, విషయోప భోగములు సమాధి నిష్ఠా విధానములని తూచలు·పొల్లు పోకుండ అర్థములు చెప్పువారును కలరు"16

మరో విధంగా మధువు దయారసమని, మానిని ఈశ్వరుడని సైతం అర్థం చెప్పబడింది.17

ఈ సందర్భంగా ప్రొ. హకీమ్ అన్నమాటలు పేర్కొనదగ్గవి.

"They [Sufis] Many Times used symbolical words in their writings and mostly they wrote Poems in which they expressed their symbols. For example when they wrote 'Wine' it meant the spiritual instruction and when they wrote 'Beloved' it meant the spiritual Teacher."18

"The fundemental theme of the Sufi Philosophy is beauty, love and God-realization. The Sufis think that God is beauty and that is why in Sufi Poetry, God has been addressed as a Beloved"19

కాబట్టి కొందరు "హకీం ఉమర్ ఖయ్యామ్ అతికాంక్షతో వలచిన భోగము కేవల భక్తిపారవశ్య జనితానందాతిరేక మనియు, త్రావిన మధువు భగవత్పాదారవింద ధ్యానామృత మనియు, కామించిన పరాశక్తి సచ్చిదానంద స్వరూపమగు బ్రహ్మమే యనియు నిరూపించెదరు"20

అందువలననే ఖయ్యామ్ సురను గూర్చి వ్రాసిన క్రింది పద్యాలలో ఎంతో అర్థం ఉంది.

---

16. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పీ. పు. X III
17. ,, ,, పీ. పు. X VI
18. Prof. H.E. Hakim, Islam and Sufism, పే. 40
19. — పైదే — పే. 45
20. డా. బూర్గుల రామకృష్ణారావు, సారస్వత వ్యాస ముక్తావళి, పు. 28

'తూను' కంటెను 'కైకుబాద్కోట' కంటె
'కావుసును' ప్రాజ్య రాజ్యము కంటె మధువె
ఘనము...21

"ఈ సురను నా 'ఖిజరు' గౌరవించె- సమ్మృత
మనెను దీనిని గడు 'నిలియాస్' ప్రవక్త
అసులకాహార మిది- హృదయ బలకారి..."22

"...సుర బ్రహ్మాండము కంటే మేటియని నే స్తోత్రంబు గావించెదన్"23 పరమార్థాన్ని ఆశించి ఖయ్యామ్ కావ్యరచన చేసినట్లు క్రింది పద్యంవల్ల స్పష్టమవుతూంది.

"...ఇహ మశాశ్వత మిట్టి యైహికము కొఱకు
బారమార్థిక పదవి గోల్పడగ వలదు"24

"ఔరంగజేబీతని గ్రంథమును హాఫీజు (ఇతడొక సుప్రసిద్ధుడైన పారశీక కవి) ప్రబంధమును దేశస్థులెవరును చదువరాదని నిషేధించినాడు. జేబున్నిసా (ఔరంగజేబు కుమార్తె) ఈ గ్రంథముల నిరంతరము పారాయణము సేయు చుండెడిది, ఈ విషయమును గూర్చి ప్రజలౌరంగజేబు నడుగ మీరవి అర్థము చేసికొన గలిగితిరేని చదువవచ్చుని చెప్పి పంపినాడు. దీనిని గూర్చి అక్బరు చక్రవర్తి తన అయినీ అక్బరి అను గ్రంథములో మిగుల ప్రశంసించి 'ఈ మహా గ్రంథములోని యద్విషయము లనన్య సామాన్యములు. ఎల్లవారు గ్రహించు టకు సాధ్యము కావు' అని వ్రాసినాడు."25

"మావి చిగుళ్లు కోకిలలకును వర్ష బిందువులు చక్రవాకములకు నేర్పడి నట్లు ఉమర్ ఖయ్యామ్ కావ్యము తత్త్వవేత్తలకై వ్రాయబడినది"26

---

21. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 138
22. ---- పైదే ---- పు. 102
23. ,, పు. 109
24. ,, పు. 141
25. ,, పీ. పు. X VI
26. ,, పీ. పు. X VII

ఈ ఆధారాల ననుసరించి ఖయ్యామ్ రుబాయీలలోని ప్రేమ సంభాష ణలకు మధువు మానినులకు ఒక విశిష్టమైన ఆధ్యాత్మిక అర్థం గోచరిస్తూంది. అందువల్లనే ఖయ్యామ్ ప్రేయసితో ఐక్యం కోరుతున్నాడు. ప్రజాహృదయాల్లో అసాధారణ తత్త్వవేత్తగా ఖయ్యామ్ నిలచాడంటే ఇదే కారణం కావచ్చు.

మానవ పతనానికి కారణభూతాలైన వస్తువుల్ని స్వీకరించి వాటిని ప్రశం సిస్తూ, వాటి ఆధారంతోనే ఉన్నత ప్రమాణాలతో లోకానికి హితబోధ చేస్తున్న ఖయ్యామ్ ప్రతిభ అద్వితీయమైంది.

ఖయ్యామ్ బుద్ధి వైభవం సాటిలేనిదని; బాల్యంనుండి అసాధారణ పాండిత్యం గడించడంలో కాలాన్ని వినియోగించాడని ప్రథమప్రకరణంలో స్పష్ట మైంది. అతడు అంతటితో తృప్తి పడలేదు. జన్మమరణ రహస్యాల్ని కనుగొన డానికి ప్రయత్నం చేశాడు. సృష్టి ప్రయోజన మేమిటని వితర్కించు కొన్నాడు. విద్వాంసుల్ని మత గురువుల్ని సేవించాడు. వారిబోధలు కల్లబొల్లి పలుకులని భావించాడు. అవి అతనికి ఎంత మాత్రమూ నచ్చలేదు. పారశీక దేశంలో పూర్వాచారంగా వస్తున్న సంప్రదాయాల కన్నిటికి తాను తల ఒగ్గలేదు. ఆ నాడు సమాజంలో సూఫీమతం బాగా వ్యాప్తిలో ఉండేది. ఖయ్యామ్ తాత్త్విక దృష్టిని పరిశీలించే ముందు సూఫీమతాన్ని కూడా పరిశీలించడం అవసరం.

## సూ ఫీ మ త ం

సూఫీమతం ఎప్పుడు ఆవిర్భవించిందన్న విషయం నిశ్చయించి చెప్పడం కష్టం. ఈ విషయాన్ని ప్ర స్తా వి స్తూ BANKEY BEHARI గా రు "...It is difficult to fix the date of Sufism. It is existed before Quran was given to the world and Prof. William James rightly states that the Sufis existed In Persia from earliest times..."27 అని అన్నారు.

సూఫీ పదాన్ని పెక్కుమంది పెక్కు విధాలుగా వివరించారు; 'జామి' వివరణ ఇలాగుంది– "Sufi is derived from Safa which means purity; and the persons who followed the path of purity were called the Sufis"28. కనుక సూఫీలంటే పరిశుద్ధాత్ములని చెప్పవచ్చు.

27. Bankey Behari, Sufis Mystics and Yogis of India P. 76

28. Prof. H.E. Hakim, Islam and Sufism, P41.

'తూసు' కంటెను 'కైకుబాద్కోట' కంటె
'కావుసును' ప్రాజ్య రాజ్యము కంటె మధువె
ఘనము...21

"ఈ సురను వా 'ఖిజరు' గౌరవించె- నమృత
మనెను దీనిని గడు 'నిలియాస్' ప్రవక్త
అసులకాహార మిది- హృదయ బలకారి..."22

"...సుర బ్రహ్మాండము కంటే మేటియని నే స్తోత్రంబు గావించెదన్"23

పరమార్థాన్ని ఆశించి ఖయ్యామ్ కావ్యరచన చేసినట్లు క్రింది పద్యంవల్ల స్పష్టమవుతూంది.

"...ఇహ మశాశ్వత మిట్టి యైహికము కొఱకు
బారమార్థిక పదవి గోల్పడగ వలదు"24

"ఔరంగజేబీతని గ్రంథమును హఫీజు (ఇతడొక సుప్రసిద్ధుడైన పారశీక కవి) ప్రబంధమును దేశస్థులెవరును చదువరాదని నిషేధించినాడు. జేబున్నిసా (ఔరంగజేబు కుమార్తె) ఈ గ్రంథముల నిరంతరము పారాయణము సేయు చుండెడిది, ఈ విషయమును గూర్చి ప్రజలౌరంగజేబు నడుగ మీరవి అర్థము చేసికొన గలిగితిరేని చదువవచ్చుని చెప్పి పంపినాడు. దీనిని గూర్చి అక్బరు చక్రవర్తి తన అయినీ అక్బరి అను గ్రంథములో మిగుల ప్రశంసించి 'ఈ మహా గ్రంథములోని యద్విషయము లనన్య సామాన్యములు. ఎల్లవారు గ్రహించు టకు సాధ్యము కావు' అని వ్రాసినాడు."25

"మావి చిగుళ్లు కోకిలలకును వర్ష బిందువులు చక్రవాకములకు నేర్పడి ట్లు ఉమర్ ఖయ్యామ్ కావ్యము తత్త్వవేత్తలకై వ్రాయబడినది"26

---

21. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 138
22. ---- పైదే ---- పు. 102
23. ,, పు. 109
24. ,, పు. 141
25. ,, పీ. పు. × VI
26. ,, పీ. పు. × VII

ఈ ఆధారాల ననుసరించి ఖయ్యామ్ రుబాయీలలోని ప్రేమ సంభాష ణలకు మధువు మానినులకు ఒక విశిష్టమైన అధ్యాత్మిక అర్థం గోచరిస్తూంది. అందువల్లనే ఖయ్యామ్ ప్రేయసితో ఐక్యం కోరుతున్నాడు. ప్రజాహృదయాల్లో అసాధారణ తత్త్వవేత్తగా ఖయ్యామ్ నిలచాడంటే ఇదే కారణం కావచ్చు.

మానవ పతనానికి కారణభూతాలైన వస్తువుల్ని స్వీకరించి వాటిని ప్రశం సిస్తూ, వాటి ఆధారంతోనే ఉన్నత ప్రమాణాలతో లోకానికి హితబోధ చేస్తున్న ఖయ్యామ్ ప్రతిభ అద్వితీయమైంది.

ఖయ్యామ్ బుద్ధి వైభవం సాటిలేనిదని; బాల్యంనుండి అసాధారణ పాండిత్యం గడించడంలో కాలాన్ని వినియోగించాడని ప్రథమప్రకరణంలో స్పష్ట మైంది. అతడు అంతటితో తృప్తి పడలేదు. జన్మమరణ రహస్యాల్ని కనుగొన డానికి ప్రయత్నం చేశాడు. సృష్టి ప్రయోజన మేమిటని వితర్కించు కొన్నాడు. విద్వాంసుల్ని మత గురువుల్ని సేవించాడు. వారిబోధలు కల్లబొల్లి పలుకులని భావించాడు. అవి అతనికీ ఎంత మాత్రమూ నచ్చలేదు. పారశీక దేశంలో పూర్వాచారంగా వస్తున్న సంప్రదాయాల కన్నిటికి తాను తల ఒగ్గలేదు. ఆ నాడు సమాజంలో సూఫీమతం బాగా వ్యాప్తిలో ఉండేది. ఖయ్యామ్ తాత్త్విక దృష్టిని పరిశీలించే ముందు సూఫీమతాన్ని కూడా పరిశీలించడం అవసరం.

## సూఫీ మతం

సూఫీమతం ఎప్పుడు ఆవిర్భవించిందన్న విషయం నిశ్చయించి చెప్పడం కష్టం. ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ BANKEY BEHARI గా "...It is difficult to fix the date of Sufism. It is existe before Quran was given to the world and Prof. Willian James rightly states that the Sufis existed In Persia from earliest times..."27 అని అన్నారు.

సూఫీ పదాన్ని పెక్కుమంది పెక్కు విధాలుగా వివరించారు; 'జామి' వివరణ ఇలాగుంది– "Sufi is derived from Safa which means purity; and the persons who followed the path of purity were called the Sufis"28. కనుక సూఫీలంటే పరిశుద్ధాత్ములని చెప్పవచ్చు.

27. Bankey Behari, Sufis Mystics and Yogis of India P. 76

28. Prof. H.E. Hakim, Islam and Sufism, P41.

'సఫ్' అంటే వరుస అని. భగవంతుని సమక్షాన ముందు వరుసలో కూర్చొనేవారు సూఫీలని కొందరన్నారు. మరికొందరు 'సూఫ్' అంటే ఉన్ని అని, ఉన్ని దుస్తులు ధరించే సాధువులు సూఫీలని వివరించారు.29

కాని "అందే ఒక్కటియు సామాన్యాంగీ కారమును పడయలేదు. ...3వ శతాబ్దము ప్రారంభముతో సూఫీమతము మునుపటి దారిని విడిచి ఒక నూతన పరిణామ పథమును ప్రవేశించినది..... ఇదివరకు ఇస్లాము మతములో వెనుకబడి ఉన్న ఈశ్వర సర్వగతత్వ భావము ప్రాముఖ్యమునకు వచ్చినది"30

ఈ పరిణామం అపూర్వమైంది. భగవంతునికి అతని సృష్టికి మధ్యకల అడ్డంకులు తొలగిపోయాయి.

సత్యమగు బ్రహ్మం (హఖ్) ను గుర్తించి, నశ్వరమైన ఇహలోకాన్ని నిరసించి, నేను నీవు అనే భేదభావాన్ని మరచి సర్వం ఈశ్వరమయం అని చెప్పేవారు సూఫీలు.

సర్వశక్తిమంతుడు ఈశ్వరుడే అని, అతని నిర్ణయాలు నిరుత్తరాలని స్పష్టపరచి, ఈశ్వర ఏకత్వాన్ని ఈశ్వర సర్వగతత్వ సిద్ధాంత దృష్టితో విశద పరచబడింది.

సూఫీ దర్శనావలంబకుడు తన వ్యక్తి చైతన్యాన్ని కోల్పోయి ఈశ్వరుని సాక్షాత్కరింపజేసు కొంటాడు. సూఫీ దీక్షను ఫల పర్యవసానం చేసుకొనడానికి ఉపాదేయాలైన సాధనాలు కొన్ని ఉన్నాయి. ఈ దీక్ష ఒక ఉత్కృష్టమయిన అవస్థ. ఇలాంటి మహత్తరానుభూతి అలవరచు కొనేందుకు గురూపదేశం అవసరం. ఈ ఉపదేశం ఆత్మ విస్మృతికి కారణభూత మవుతుంది. కనుక గురూపదేశం ఆసవంగా భావించబడుతుంది. గురువు ఆసవప్రదాత (సాఖీ) గాను, ఆసవవిక్రేతగాను ఆసవపానంవల్ల వయసుపండిన అగ్ని పూజకుడు గాను అభివర్ణించబడ్డాడు. ఇతడే మానిని. మరోవిధంగా పరమాత్మ. సూఫీ వేదాంతంలో గమ్యం అహంకార వినాశనం.

---

29. డా. శివకుమార్‌శర్మ, సూఫీమత్‌కా ఉద్భవ్ ఔర్ వికాస్, హిందీ సాహిత్య యుగ్ ఔర్ ప్రవృత్తియాం, పు. 142-143

30. డా. బి.వి. కిషన్, సూఫీమతము, విజ్ఞాన సరస్వము, ఏడవ సంపుటము పు. 750-751

హిందూ ముస్లిముల సఖ్యతాసాధనకి సూఫీమతం ఎంతయినా అవసర మని డా. బిసెంట్ అభిప్రాయ పడ్డారు."31

ఆనందమత్త స్థితిలో సూఫీ ఈశ్వరుని మహత్వాన్ని ప్రేమను ప్రత్యక్షం చేసుకొంటాడు. అద్వైతపరాకాష్ఠయయిన ఆత్మానుభవం పొందుతాడు. లౌకిక భోగాలు త్యజించి, ఐహిక సంపదకై విరక్తి కలిగి, ఆత్మపరమాత్మల ఐక్యం కోసం పాటుపడుతాడు. భగవంతుడు అంతటా నిండి ఉంటాడనే మహోన్నత భావం అతని మనస్సులో నిలిచి ఉంటుంది. ఆసవము అంటే భగవంతుని చింతనామృతం అని సూఫీమతం చెబుతుంది.

కనుక 'సర్వమున్నతని దివ్యకళామయము' 'ఇందుగలడందు లేడను సందేహము వలదు' 'అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేష మత్తచిత్తము' వంటి భాగవతంలోని పద్యాలు పై భావాల్ని స్పష్టం చేస్తున్నాయి. అందుకే సూఫీమతం, వేదాంతం రెండూ సన్నిహితమైనవి.

ఈ సూఫీమతం కొంతకాలానికి కరుడు కట్టింది. ఆచారబద్ధమై బరువైంది. సూఫీలుగా కనబడుతూ కపట స్వభావంతో ప్రవర్తించేవారు ఎక్కువయ్యారు.

"ఖయ్యామ్ కాలము నాటికి సూఫి సమాజమునందు వేషధారులు బయలుదేరిరి. వారి స్వయమారోపిత పావనత్వము, వైరాగ్యము వేషధారిత్వ ముగ మారినది"32

---

31. "Dr Besant says that Sufism and Vedanta are almost the same in their meaning and interpretation. If we want to bring about the unity of religious in India among the Hindus and Muslims, the only common ground on which they will agree is Sufism, and hence it is necessary that great importance should be given to the study of Sufism among our scholars to bring about this unity"

Prof. H. E. Hakim, Islam and Sufism, P. 53

32. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో. పు. XXX IV

"సూఫీ మతమునకు తాత్త్వికముగనే గాక సారస్వతముగ కూడ చాల ప్రాధాన్యము కలదు. ఏలయన పారసీక సారస్వత మంతయు ఏకత్త్వముచే నిండి నిబిడీకృతమైనట్టిదే. సూఫీ ఉద్యమము నందలి మొదటి కవి అబూసయీద్ అబుల్ ఖైర్"33

అబ్దుల్లా అన్సారీ సూఫీవేదాంతంలో సుప్రసిద్ధ విద్వాంసుడు. సూఫీ వేదాంత ప్రతి పాదకాలైన రుబాయీలు వ్రాసి ఖయ్యామ్‌కు మార్గదర్శకు డయ్యాడు. ఖయ్యామ్ అనంతరం సూఫీకవులుగా ప్రసిద్ధిగన్న వారిలో రూమీ, హాఫీజ్, నర్మద్ నర్మస్తు మున్నగువారు ముఖ్యులు.

సూఫీ కవులు తమ కృతుల్లో మధువు మానినిని వర్ణించడం సామాన్యమే. అయితే ఉమర్ ఖయ్యామ్‌కును మిగత కవులకును ఈ విషయంలో భేదం ఉంది. మధువు మానినిని అభివర్ణిస్తూనే అభ్యుదయ భావాలతో సంఘ సంస్కరణ కుపక్రమించాడు ఖయ్యామ్.

తన చుట్టూ వాతావరణాన్ని ఖయ్యామ్ బాగా ఆకళింపు చేసుకొన్నాడు. హేతువాద దృక్పథంతో కలం పట్టాడు. లోకప్రవర్తన లోపభూయిష్ఠమైనప్పుడు కఠినంగా విమర్శించాడు. తాను నిజమని గ్రహించిన తత్త్వాన్ని నిశ్చలబుద్ధితో గుండె ధైర్యంతో లోకం ఎదుట ఉంచాడు. ఇలాంటి గుణంవల్ల ఇతని కవిత్వం శక్తిమంతమైంది. ఆకర్షకమైంది.

"యూదులు, పారశీకులును యోసులు బౌద్ధ, మహమ్మదీయు లా
రాధన మందిరావళిని రౌరవభీతి విచంచలాత్ము లై
గాథల ద్రవ్వి స్వర్గమును గట్ట దపస్సులొనర్తు—రిమనో
వ్యాధుల డింశదరీశ్వర రహస్యమెఱింగిన తత్త్వవేత్తలున్"34

ఒక్క పారశీక జాతియేకాదు, అన్ని అగ్రమతాలవారు ఇతని విమర్శకు గురియయ్యారు. అందరిని ఈశ్వర రహస్యం తెలియని వారన్నాడు. ఈ పద్య మొక్కటి చాలు, అతని నిర్భీకత అనితర సాధ్యమైందని చెప్పడానికి.

---

33. రషీద్ గులామ్ దస్తగీర్. పారసీక భాషా సారస్వత చరిత్ర. విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పు. 421
34. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 154

ఇంకో అడుగు ముందుకు వేసి—

"ఓ ప్రభూ! మేము నీ కంటె నుత్తమోత్త
ములము, నీవు ప్రజా రక్తమును గ్రహింతు
వేము ద్రాక్షరసంబు గ్రహింతు— మిందు
నెవరు ఘోర పాపులో మన మెఱుగలేము"35

అని ఈశ్వరుని సైతం ఎదిరించి ప్రశ్నించ గలిగిన సాహసి. సూఫీ కవుల్లో సాధారణంగా ఉండవలసిన సరళత ఇతనిలో కనబడదు. అందువల్ల ఇతనిని చార్వాకీయుడని, ఎపిక్యూరియస్ మార్గానుయాయి అని అన్నవారూ ఉన్నారు. కనుక ఇతడు చార్వాకీయుడా, ఎపిక్యూరియస్ సిద్ధాంతాల్ని అంగీకరించినవాడా పరికించడం అవసరం.

## చార్వాకమతం - ఖయ్యామ్

"చార్వాకమతము లేదా భౌతికవాదము చాల పురాతనమైనది. బౌద్ధ కాలమునకు పూర్వమందే ఉండెను. ఋగ్వేద మంత్రములలో నీ మత సిద్ధాంతములకు బీజములు కలవు. ఆ కాలమున మతము మత గురువుల యొక్క లేదా పురోహితుల యొక్క అధికారమునకు లోబడి వ్యాప్తమగు చుండెను. ఆ మత గురువులు తమ అధికారమును నిరంకుశముగ సాగించు కొనుచుండిరి. మతమునకు తామే కర్తలమని తమ అధీనములేని వారందరు పాపాత్ములని ప్రచారము చేసెడివారు. అట్టివారికి విరుద్ధముగ భౌతిక వాదు చార్వాక మతమును స్థాపించి ఉందురు."36

## మత సిద్ధాంతాలు

దృశ్యమాన ప్రపంచం కంటె మరో ప్రపంచంలేదు. ప్రత్యక్షంగా కనిపించేదే ప్రమాణం. పృథ్వి, జలం, అగ్ని, వాయువు—ఈ నాలుగేభూతాలు.

35. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 142
36. కుమారి పి. చెంచుసుబ్బమ్మ, చార్వాకులు, విజ్ఞాన సర్వస్వము, ఏడవ సంపుటము, పు. 397.

సంపద, భోగం— ఇవి రెండే మానవ జీవిత లక్ష్యాలు. మరణమే అన్నిటికి అంతం. భగవంతుడు, పరలోకం కేవలం కల్పితాలు. భగవంతుడున్నాడని విశ్వసించడం బలహీనతకు చిహ్నం.

ఈ లోకం మాత్రమే కలది అనే సిద్ధాంతం కలిగింది కనుక ఈ చార్వాక మతం లోకాయత మతమని కూడా పిలువబడుతుంది. ఈ మతస్థులు లోకాయతికులు. చార్వాకుడు స్థాపకుడు కనుక చార్వాకులు.

ఈ చార్వాక మతం వేద సిద్ధాంతాన్ని నిందాపూర్వకంగా తిరస్కరించింది.37

ప్రబోధ చంద్రోదయ నాటకంలో హేతువాదంతో సాగిన చార్వాకవచనాలు గమనించ దగ్గవి.

"నిహతస్య పశోర్యజ్ఞే స్వర్గ ప్రాప్తిర్య దీష్యతే
స్వపితా యజమానేన కిమ్మ కస్మాన్న హన్యతే"38

యజ్ఞమందు చంపబడ్డ పశువుకు స్వర్గప్రాప్తి కలుగుతుందనే విశ్వాసం ఉంటే యజ్ఞంచేసేవాడు తన సొంత తండ్రిని ఎందుకు చంపించడు అని శ్లోక భావం.

"అగ్నిహోత్రం త్రయోవేదా స్త్రిదణ్డం భస్మగుణ్ఠనమ్
ప్రజ్ఞా పౌరుషహీనానాం జీవికేతి బృహస్పతిః"39

అగ్నిహోత్రం, వేదత్రయం, త్రిదండధారణం (సన్యాసం), భస్మ లేపనం అనేవి ప్రజ్ఞాపౌరుషాలు లేని మానవులకు బ్రతుకు తెరువులని బృహస్పతి వచించాడని భావం.

---

37. కుమారి పి. చెంచు సుబ్బమ్మ, చార్వాకులు, విజ్ఞాన సర్వస్వము, 7వసంపుటము, పు 397–398
38. కృష్ణమిశ్రుడు, ప్రబోధ చంద్రోదయము, ద్వితీయాంకము, శ్లో, 20 పు. 72
39. —పై గ్రంథమే— శ్లో. 26 పు. 76

ఇలాంటి హేతువాదంకల రుబాయీల రచన చేయడం వల్ల ఖయ్యామ్ చార్వాకీయు డనిపించుకున్నాడు. ఖయ్యామ్ మతానికి చార్వాకమతానికి స్థూల దృష్టికి భేదం కనిపించదు. అయితే చార్వాకుడు భగవంతుని అస్తిత్వాన్ని విశ్వసించడు. ఖయ్యామ్ విశ్వసిస్తాడు.

## ఎపిక్యూరియన్ సిద్ధాంతం - ఖయ్యామ్

"ప్రపంచ దౌష్ట్యమును హేళనపూర్వకముగా ప్రదర్శించి సంతోషమే జీవితపరమావధి అను ఎపిక్యూరియన్ సిద్ధాంతమును సూచించుటయే ఈతని (ఉమర్ ఖయ్యామ్) రుబాయీలందలి ఒక ప్రత్యేక లక్షణము...ప్రస్తుతము ఉన్నదాని నంతను తినియు త్రాగియు అనుభవించి సుఖింప వలెననియు, రేపటికి చచ్చినట్లే భావింపవలెననియు ఈతని ప్రధాన సిద్ధాంతము"40—అని శ్రీ ఎస్. ఎమ్. రఫత్.

మరణానంతరం జీవితం ఉండదు, ఆనందంగా కాలం గడపడమే జీవిత ప్రయోజనం. ఇంద్రియ గోచరమయ్యే ఈ లోకమే వాస్తవమైంది. విధిలేదు అని ఎపిక్యూరియన్ సిద్ధాంతం.

ఈ మతాన్ని కనిపెట్టిన వాడు ఎపిక్యూరియస్. అనుసరించిన వారు ఎపిక్యూరియన్‌లు. ఎపిక్యూరియస్ సామాస్ ద్వీపనివాసి. క్రీ. పూ. 3వ శతాబ్దానికి చెందినవాడు. "గుణవిచక్షణ లేకుండ సుఖమే ఉపాదేయమని ఈతడు చెప్పె నని ఈతని సిద్ధాంతమున కపార్థమును ఇతరులు కల్పించిరి. కాని దీనికివిరుద్ధ ముగ నీతడు బుద్ధిచోదితము, మర్యాదనతిక్రమించనిదియగు సుఖానుభవమే పరమలక్ష్యమని ప్రతిపాదించెను. క్రి. పూ. 306వ సంవత్సరమున ఏథెన్సు నగరమందొక దార్శనిక విద్యా శిక్షణ కేంద్రమును స్థాపించెను"41

---

40. ఎస్. ఎమ్. రఫత్, ఉమర్ ఖయ్యామ్, విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పు. 593–594
41. మేడేపల్లి వరాహనరసింహస్వామి, ఎపిక్యూరియస్ వాదము, విజ్ఞాన సర్వస్వము, ఏడవ సంపుటము, పు. 333

ఎపిక్యూరియస్ నిరీశ్వరవాది. ఖయ్యామ్ ఈశ్వరవాది. విధిలేదని ఎపిక్యూరియస్. మానవుని సుఖదుఃఖాలు విధినిర్ణీతాలని ఖయ్యామ్42" ఖగోళ శాస్త్రం కల్పితమని ఎపిక్యూరియస్ వాదన. జ్యోతిశాస్త్రంలో అఖండ ప్రజ్ఞాధురీణుడై గ్రహగతుల ననుసరించి అందుకు సంబంధించిన పెక్కు గ్రంథాలు రచించి ఆశాస్త్రాన్ని పూర్తిగా నమ్మినవాడు ఖయ్యామ్. కనుక ఎపిక్యూరియస్ సిద్ధాంతాలకు, ఖయ్యామ్ సిద్ధాంతాలకు స్పష్టమైన అంతరం గోచరిస్తుంది.

పూర్వోక్తమతాల సిద్ధాంతాలకు భిన్నమై లోకాన్నంతటిని ఆకర్షించ గలిగిన ఉమర్ ఖయ్యామ్ తత్త్వమెలాంటిదో ఇకపరిశీలిద్దాం.

# 1. ఖయ్యామ్ దృష్టిలో సృష్టి-జీవుడు

ఖయ్యామ్ మతంలో ఈశ్వరుడు లేడనే సిద్ధాంతం కనిపించదు. సృష్టి నిర్మాణం చేయడంలో ఈశ్వరుని ఉద్దేశమేమిటి? జీవుడు ఎక్కడనుండి ఇక్కడికి వచ్చాడు? తిరిగి గమ్యస్థానం ఏది? జీవునికి ఈశ్వరునికి కల సంబంధమేమిటి? ఈప్రశ్నలకు సమాధానం చెప్పడం దుస్సాధ్యమని,ఈశ్వర రహస్యాన్ని భేదించలేక ఏవో ఊహ కొద్దీ వ్యర్థపుమాటలు పలికి ఎందరో గతించారని ఖయ్యామ్ సమాధానం. ఉమర్ అలీషాగారి 'ఉమర్ ఖయ్యామ్' కావ్యం ఈ చర్చతోనే ప్రారంభమవుతుంది.

"ఎక్కడినుండి వచ్చితిమొ యెక్కడి కేగుటకౌనొ యెవ్వరి
నిక్కమెఱింగి చెప్పుటకు నేర్చిన వారలుగారు ధాత్రియం
దక్కట దేనికిన్ మొదలు నంతము నిట్టిదటంచు దోచదీ
ఫక్కి ని జీవయాత్రకయి వచ్చుచు బోవుచు నుంటి మెంతయున్"43

"శరధిని బోలు విద్యయును జ్వాలను బోలిన జ్ఞాన దీప్తియున్
బరగిన వారలీ నిశిత భాసుర గాఢ మహాంధకార బం
ధురతర మార్గమున్ గడచు త్రోవ నెఱుంగక కల్పనా కథా
భరిత వివాద వీచికల పాలయి ప్రాణము వాసిరార్తులై"44

42. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, ఉపో. పు XXXV
43. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 1
44. " పు. 2

"కొందరు బుద్ధిమంతులగు కోవిదు లర్థపు మంచి ముత్తెముల్
పొందుగ దండలల్లి యిడు పోలిక దేవుని గూర్చి చెప్పి మె
ప్పొందగలేక వాస్తవ సమున్నతి యేదొ యెఱుంగలేకయే
ద్రుంగిరి - వ్యర్థమైన పలు మాటలనాడి ప్రగల్భ చిత్తులై"45

ఈశ్వరుడు జీవుని ఏఉద్దేశంతో ఇక్కడికి తెచ్చాడు? తిరిగి ఆ జీవునికి మరణం విధించి తీసుకొని పోవడంలో గల రహస్యమేమి?—ఇలా చేసి అతడు సాధించ గలిగేదేమిటి?—అనే ప్రశ్నలకు సైతం ఎవ్వరూ సరియయిన సమాధానం చెప్పలేరని సకల శాస్త్రప్రవీణుడు ఖయ్యామ్ అంటాడు—

"అవిధినన్నుదెచ్చి జగమందున లాభము పొందలేదు-వా
పోవగ నన్ను జంపు కొని పోయి గడించిన గొప్పలేదు-తా
నీవిధి చావుపుట్టుకల నేటికి బెట్టెనొ తెచ్చి తీసికో
బోవుటలో రహస్యము ప్రబోధము సేయరు నేటికెవ్వరున్"46

## 2. ఈశ్వరతత్త్వము

కష్టపడి అందమయిన పాత్రల నిర్మించినవారు వాటిని తిరిగి నిర్దాక్షిణ్యంగా పగుల గొట్టడానికి ఇష్టపడరు. కాని దయామయుడని పేరుగన్న ఈశ్వరుడు జీవులను సృష్టించి చంపటంలో గల ఉద్దేశమేమిటో? ఆదినుండి ఈ ప్రశ్నకు సమాధానం లేదు. మహామహులకే దుర్భేద్యమయిన రహస్యమటయిది.

❋ "సొంపులు నింపు పాత్రల విశుద్ధమతిన్ రచించి వానినే
త్రెంపుట కెవ్వరిష్టపడి తెంపరులై చనుదేర రీశుడున్
సొంపులు నింపు జీవులను శుద్ధమతిన్ సృజియించి యార్తిమై
చంపుట కేమి హేతువొ నిజంబు వచింపగరాదె నేర్చినన్"47

❋ ప్ర. పు. చూ.

45. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు 8
46. ,, పు. 4
47. ,, పు. 8

## 3. ఈశ్వరుడు జీవుల్ని క్షమిస్తాడా?

జీవుడు తాను చేసే పనులకు తానే బాధ్యుడు కాడు. శరీరాన్ని మనసును దేవుడు సృష్టిస్తాడు. మానవుడు చేసే ప్రతికార్యానికి భగవంతునిచే సృజింపబడ్డ మనస్సు ప్రేరకం. కాబట్టి పాపకార్యాలు చేశారని దేవుడెందుకు భావించాలి? పాపాలు చేయనిది బ్రతుకెలానడుస్తుంది? ఆ తప్పులకు శిక్ష విధిస్తే అది భగవంతుని గొప్పతనమేనా? అని ఖయ్యామ్ సూటిగా ప్రశ్నిస్తాడు.

"చెప్పుము పాపముల్ నరులు చేయని వారెవరో జగంబునన్
చెప్పుము పాపముల్ నరులు చేయనిదే బ్రతుకెట్లు సాగునో
తప్పులు మేము చేసెదము దండన నీవొనరింతువేని నీ
గొప్పదనంబు మాకిడిన కొద్ది తనంబననేది ఈశ్వరా!"48

జీవులు పాపాలు చేస్తూన్నందువలననే భగవంతుడు వారిని కాపాడి కరుణాళుడనే బిరుదు వహించాడు. ఈ బిరుదు అతనికి దక్కాలని నేనతనిపై కరుణ వహించానని ఖయ్యామ్ అంటాడు.

"మావలనన్ సురాలయము మంజువిలాసములుల్లసిల్ల—మా
భావము పాపరూపమయి పర్వుచు నున్నది -మేము పాప మే
కేవలమాచరింపుచును గీడ్వడకుండిన దేవుడెవ్వనిన్
గావగవచ్చు? వానిగరుణన్ వెలిబుచ్చగనైతి నీగతిన్"49

---

* తన చేచేత నొనర్చినట్టి యొక పాత్రన్ భగ్నమున్ జేయ నే
మనుజుండైన దలంప, డంగములు నిర్మాణంబు గావించి మో
హనరూపంబులు, మోవిదేనె యెదలో నత్యంత రాగంబు గూ
ర్చిన దేవుండు మళీలయిట్ల నిజసృష్టిం గూల్చునున్మత్తు డై

—పానశాల, పు. 17

48. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 78
49. ,, పు. 72

"ఓకరుణాళు! నీవు కరుణోదధివై మము బోటి పాపులన్
గైకొని కాచుటే కరుణ కావున స్వర్గమునందు బాపులన్
జేకొనవేమి? నీ తపము చేతనె ముక్తి యొసంగెదేని న
య్యో! కరుణాళుడన్ బిరుదముండునె పాపులగావకుండినన్"50

పాపాలు అనుభవించడమన్నది జీవి చేసుకొన్న కర్మననుసరించి ఉంటు దనే కర్మతత్వం పైని ఖయ్యామ్‌కు విశ్వాసంలేదు.

## 4. జీవన్మిథ్యాత్వం

భౌతిక జీవితం క్షణభంగురం. ఎందరెందరో చక్రవర్తులు. వీరాధివీరులు, భోగులు, దాతలు, మతాచార్యులు, లావణ్యవతులు - అందరూ జీవయాత్ర చాలించి మట్టిలో కలిసిపోయారు. భూమిపై మొలిచే ప్రతియొక్క మొక్క, చెట్టు చేమ వారి అంశాలే. అందుకని భూమిపై ఒక్కొక్క అడుగు జాగ్రత్తగా వేయాలి.

"పాఱెడు నీటి యొడ్డు పాలుపాఱెడు పచ్చని పైరు చూచి సొం
పారెడు నే మనోహరి ప్రపంచ శరీరము వాసి వాసిమై
మాఱెనొ యంచు నెంచుము - ప్రమాదమతిన్ దెగి త్రుంపబోకుమా
చారు సువర్ణమండిత ప్రశస్తకళాకలితాంగ మయ్యెడన్"51

"వనముల నెఱ్ఱపువ్వులు నృపాల రణాంగణ వీరరక్త సం
జనితములేమొ- శోభితదశన్ ననలెత్తిన లేత కొమ్మ కొ
మ్మను జివురాకు లొప్పునవి మానిని చెక్కిళులేమొ- యింపు సొం
పానరెడు పుట్టుమచ్చలన నొప్పెడు నందలి చుక్కలారయన్"52

50. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 14
51. ,, పు. 13
52. ,, పు. 14

"...నే, లను గాలూదకు - నీ పదాహతిని లీలన్మిటు మన్నేలతాం
గినటు ద్వీక్షణ పంక్తిదో తెలియ శక్యంబౌనె యెవ్వారికిన్"53

అని ఖయ్యూమ్ ఆవేదనతో అంటాడు.

మరణానంతరం జీవి మట్టిలో కలిసిపోతాడు. ఈ జీవితం దాటిన వెనుక ఏ ఆశా కనిపించదు. అనంతరం ఏదయినా ఉందంటే అంతా ఊహాగానం మాత్రమే

## 5. ఆత్మ - పరమాత్మ

సూఫీలు ఆత్మ పరమాత్మల ఐక్యం కోసం పాటు పడతారన్న విషయం పూర్వోక్తం. వలచిన మానినికే తన సర్వస్వం సమర్పించదలచాడు ఖయ్యూమ్. ఆ మానినిని పరమాత్మగా భావించినట్లయితే ఖయ్యూమ్‌మతంలో ఆత్మ ఉన్నట్లు ఊహించవచ్చు. ఆమానిని పొందు అతడు కోరుతున్నాడు. కనుక భగవంతునితో ఐక్యం కోరుతున్నాడని విశదమవుతుంది.

"ఓ చెలి! నిన్ను నేఁ గలియ కుండగఁ జేతులు చాచి కోరికన్
నీచెఱగంటకుండ విడనేరను- నీవఱకేగుదారి యెం
తో చకితంబు- దూరమయి తోచిన నే జనిపోదుగాని-రా
నోచక వెన్కకున్ మరల నోప బథ్రశ్రమ మెంత కల్గినన్"54

మరో పద్యంలో ఆత్మశబ్దమే కనిపిస్తుంది.

"ఓగజయానా! నీదునధరోష్ఠము తెంపుల సొంపు నింపు-త
ద్రాగవిచారమాత్మకు బలంబును ప్రాణికి గ్రాసము..."55

"Omar is Strictly a monotheist. He believes the Soul is eternal"56 అని ఆదిభట్ల నారాయణదాసుగారు.

పైపరిశీలనవల్ల ఖయ్యూమ్ దృష్టిలో ఆత్మ కలదనే విశ్వాసం కలుగుతుంది.

---

53. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యూమ్, పు. 14
54. " పు. 40
55. " పు. 135
56. A. Narayana Das, Rubaiyat of Omar Khayam, P.ii

## 6. పునర్జన్మ

పునర్జన్మ తత్త్వంపై ఖయ్యామ్ విశ్వాసం ప్రకటించలేదు.

"...ఆయువున్న దొకసారిదె- పోయినవారు మళ్లిరా
జాలరు-మద్యపానవివశంబున బుచ్చుము జీవితాంకమున్"57

"ఈ జన్మ వెనుక ధరపై
రాజనదిక జన్మ-బంధురాజీగలియ నిం
దీ జన్మ మహాభాగ్యము
గా జూడుము తిరిగి దీని గానగ నగునే"58

## 7. విధి అనివార్యము

విధిసర్వశక్తిమంతమైందని, దానిని దాట ఎవరికి సాధ్యం కాదని ఖయ్యామ్ హెచ్చరిక చేస్తాడు. దుఃఖమూ, మరణమూ వంటివి విధినిబద్ధాలు. వీటికై చింతించవద్దు. ఈశ్వరతత్త్వం తెలిసినవారు ఇందుకై విచారిస్తూ కూర్చోరు.

"విధికన్న నెవరధికులయి
యధికారము సేయనేర్తు - రందఱగనిదీ
పృథివినిలేదు - స్వభావా
వధిమాఱును - మారవన్య పథమున నెవియున్"59

విధికన్న ఆధిక్యం కలది మరొకటి లేదని తెలుస్తూంది.

"మము సృజియించునాడె విధిమోగతి యేమగునన్నమాట ని
క్కముగ నెఱింగి యుండెను."60

అని ప్రతిజీవికి పుట్టుకతోనే విధి లిఖితం ఉంటుందని, ఎవరికి ఎంత ప్రాప్తమో అంతేకాని 'వగచెదవేల' అంటూ ప్రశ్నిస్తాడు ఖయ్యామ్.

---

58. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 59.
59. ,, పు. 166
60. ,, పు. 166

"ప్రాప్తఫలకంబు పైమున్నె వ్రాసెనన్ని-
యింక విధిలేఖినికిఁ బనియేమి కలదు?
నుదుట కలదేదొ యదెవచ్చు నెదుటి కెపుడు
కుమతి! వగచెదవేల యత్నముల శ్రమల"61

## 8. స్వర్గ నరకాలు

ఖయ్యామ్ స్వర్గనరకాలు లేవని వాదిస్తాడు. ముందుగనే నిర్ణయించబడ్డ విధివిధానముననుసరించి జీవి ప్రవర్తిస్తాడు. అతడు చేసుకొన్న పాపాలవల్ల నరకాగ్నిలో పడిపోతాడన్నమాట అర్థరహితం.

"మము సృజియించునాడె విధిమాగతి యే మగునన్న మాట ని
క్కముగ నెఱింగి యుండెను- నఘంబులు నాతని యాజ్ఞలేకయే
తమి నొనరింపనేర్తుము పదంపడి పట్టి లయాంతమందదే
మము నరకాగ్ని గూల్చుననుమాట కొకింతయు నర్థమున్నదే"62

జీవి ప్రవర్తనను గూర్చి ఈశ్వరుడుమొదటే నిర్ణయిస్తాడని యీనిర్ణయం మేరకే జీవి వ్యవహరిస్తాడే కాని విధివిధానము నెదిరించలేడని కదా వివరించబడింది. మరి మరణానంతరం జీవికి పరీక్ష ఏమిటి? పాపకార్యాలు చేసినందువల్ల నరకమని, పుణ్యకార్యాలు చేసినందువల్ల స్వర్గమని అనడంలో అర్థంలేదు.

"ప్రేమ దురంతదుఃఖముల బెట్టెడిదే విధి ప్రేరితంబునై
యీమహి సొంపునింపు నదిఁయేల నిషేధ మొనర్తు-రీశ్వరుం
డేమన పుణ్యపాపముల నిచ్చెడు వాడగునేని యంత్యమం
దేమి పరీక్ష సేయు - నిది యేమి రహస్యము తెల్పరెవ్వరున్"63

కాబట్టి స్వర్గనరకాలు కేవలం కల్పితాలని ఖయ్యామ్ క్రింది విధంగా నిర్ణయిస్తాడు.

---

61. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 166
62. ,, పు. 165
63. ,, పు. 166

"నరకము స్వర్గమెవ్వడు గనం జనె? నచ్చటినుండి యెవ్వడీ
ధరణికి వచ్చె? నీగతి వృధాపరికల్పితవస్తుపంక్తి! ముం
దరమన కెంతొ భీతియును నమ్మకమున్నది - వానిజాడయీ
వరకు నెఱుంగ రెవ్వరు! నెపంబున బెట్టిన పేళ్లు దక్కగన్"64

మానవుని కానందప్రదాలైన వస్తువులే స్వర్గాన ఉన్నట్లు లోకం ఊహిస్తుంది. ఆసుఖదాయకాలైన వస్తువుల్ని ఇక్కడే సమకూర్చుకొని స్వర్గ సౌఖ్యాలు అనుభవించవచ్చుగదా అని అలౌకిక తాత్త్విక చింతనతో ఖయ్యామ్ ఇలా అంటాడు—

"దివి యుండున్ దివిజాంగనాముఖులు నందేయుందు, రత్యంతమా
సవముండున్, మధువుండునందురుగదా స్వర్గాన- మేమిందు నా
సవమున్ మంజుల మానినీ రతము స్వేచ్ఛన్ జేయగావచ్చు-న
య్యవియే స్వర్గములోపలన్ జరుగుగాదా మాటలింకేటికిన్"65

## 9. ఐహిక భోగాల నిరసన

ఇహలోక భోగాలకు దూరంగా ఉండడం ఉత్తమం. ఇంద్రియ వాంఛ లకులోనై భోగాల నభిలషించి జీవితం గడిపేవారికి తృప్తి ఉండదు. ఈవిధంగా భోగలాలసతతో వ్యర్థంగా కాలం గడిపి ఎందరో వెళ్లిపోతుంటారు. ఉత్తమగతి చేరుకోలేరు. అందుకని ఖయ్యామ్ భోగాపేక్షను గట్టిగా నిరసిస్తాడు.

"రాగద్వేషము లాశ్రయించి విషయభ్రాంతిన్ బ్రవర్తింప ను
ద్యోగింపన్ దగునా జగాన విధిసంయోగంబుచే నెందరో
భోగాపేక్షను వచ్చిపోయి రిటులే ముందింక రానున్నవా
రేగన్ జూతురుగాని యొక్కడిలపై నిష్టార్థముల్ పొందెనే"66

## 10. నేడే నిజం

కడచిన 'నిన్న' ను గూర్చి ఆలోచిస్తూ కూర్చోడం అజ్ఞానం. రానున్న 'రేపు' స్వరూపం తెలియదు. అస్థిరమైన మానవ జీవితంలో రేపన్నది ఉంటుందో ఉండదో అంతా సందేహాస్పదం. కనుక చేతిలో ఉన్న నేడు నిజం. దీన్ని జార విడుచుకొని పుట్టని రేపుకోసం తాపత్రయ పడడం అమాయకత్వం.

64. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 87
65. ,, పు. 85
66. ,, పు. 35

"జేపనునది నీయదిగా
దీప్రాద్దేనిది - నిన్న నే చింతమదిన్
బాపుము - విలువగు జీవిత
మేపాటిది - వ్యర్థపుచ్చెదే వెంగలివై"67

అని కర్తవ్య పరాయణతను బోధిస్తాడు ఖయ్యామ్.

అజ్ఞానంలో గడిచింది 'నిన్న'. 'రేపు' అనే దురాశాపూరిత అహంకారాన్ని విడిచిపెట్టు. పరమాత్మను గూర్చి తెలుసుకోడానికి నేడే ఉత్తమదినం. అనే తాత్త్వికార్థమూ ఈపద్యంలో ఉంది.

మానవుడు విధిచేతిలో ఆటబొమ్మ. అయినా తాను నిర్వహించ దగ్గ పనిని మాత్రం విస్మరించరాదని ఖయ్యామ్ హెచ్చరిక.

ఈవిధంగా ఖయ్యామ్ తత్త్వం పరిశీలించిన అనంతరం ఖయ్యామ్ రుబాయీల్లోని మధువుమానినులకు అనూహ్యమయిన విశిష్టార్థముందని, ఈశ్వర తత్త్వం భేదింపరానిదని, కర్తవ్యం గుర్తించి ప్రవర్తించడం మానవ ధర్మమని ఇలాంటి ఎన్నో అపూర్వవిషయాలు వెల్లడియయి సంచలనం రేకెత్తిస్తున్నాయి. అసాధారణ ప్రజ్ఞాపాటవంతోపాటు మహోన్నత తాత్త్వికచింతన కలవాడు ఖయ్యామ్ అని నిరూపించబడింది. కనుక, అమేయశేముషీవైభవంతో లోకానికి తత్త్వామృతం పంచిన ఖయ్యామ్ వంటి తాత్త్వికకవి దుర్లభుడని చెప్పక తప్పదు.

ఇది మూడో ప్రకరణం.

---

67. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 65

# నాలుగో ప్రకరణం

## రుబాయీల తెలుగు అనువాదాల్లో ఉమర్ అలీషా అనువాదానికి కల స్థానం

ఖయ్యామ్ తాత్త్వికచింతనను గూర్చి ఇంతవరకు వివరించ బడింది. ఈ తాత్త్వికభావం, సాహిత్యం ప్రపంచంలోని అన్నిముఖ్యభాషల్లోని కవుల్ని ఆకర్షించినట్లే ఆంధ్రకవుల్ని సైతం ఆకర్షించడంవల్ల తెలుగులో అనేక అనువాద గ్రంథాలు బయల్దేరాయి. ఒక్క ఫారసీ గ్రంథానికి ఇన్ని అనువాదాలు తెలుగు నేలను వెలువడడం అపూర్వమైన విషయం. ఈ అనువాద గ్రంథాల్లో ఉమర్ అలీషాగారి అనువాద గ్రంథానికి గలస్థానం నిర్ణయించడం ఈ ప్రకరణోద్దేశం

కనుక తెలుగులో ఉర్దూపారశీక సాహిత్యాల అనువాదం ప్రారంభమైన తీరు, పారశీక మూలంనుండి ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను ఆంధ్రీకరించిన కొందరు కవులు వారి రచనలు మున్నగు అంశాలను గూర్చి మొదట పరిశీలించడం అవసరం.

## తెలుగులో ఉర్దూ పారశీక సాహిత్యాల అనువాదం

ముస్లిమ్ రాజ్యపాలనా కాలంలో భారతీయులు అరబ్బీ, ఫారసీ, ఉర్దూ భాషల్ని అభ్యసించారు. దక్షిణా పథంలో బహమనీ సుల్తానులు, గోల్కొండ నవాబులు ఈభాషల్ని విశేషంగా ఆదరించారు. రాజకీయావశ్యకత ననుసరించి ఆయాభాషల్ని మొదట ప్రజలు నేర్చుకొంటారు. అనంతరం వాటి సాహిత్యంపై సహజంగానే వారి దృష్టి మరలు తుందని పెద్దల అభిప్రాయం.

సాహిత్యం మనోవికాసం కలగ జేస్తుంది. మానవ విజ్ఞానాభివృద్ధికి విశేషంగా తోడ్పడుతుంది కనుక ఆధునిక కాలంలో వివిధ సారస్వతాల తీరు తెన్నుల్ని సొగసుల్ని తెలుసుకోవాలనే ఆసక్తి సాహితీ ప్రియులకు కలిగింది. ఈ దశలో వింత సోయగం, ఒయ్యారపు నడకలు కలిగిన పారశీక ఛందోరీతులు ఆంధ్రదేశంలో ఉర్దూ పారశీక సాహిత్యానువాదాలు పందొమ్మిదో శతాబ్దంలో ప్రారంభమయ్యాయి. ఈ రెండు సాహిత్యాల్లో ప్రశంసార్హమయిన పాండిత్యం గడించిన తెలుగుకవులు ఆభాషల్లోని కావ్యాల్ని రమ్యకవితాగుణంతో అనువదించడానికి పూనుకొన్నారు. ఇలాంటి స్థితిలో ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను సైతం ఆంధ్రీకరించారు. ఇంకా ఆంధ్రీకరించ నున్నారు. ఇప్పటిదాకా ఇరవై ఐదుకు పైగా ఆంధ్రానువాదాలు వెలువడ్డాయి.

పారశీకంలో పాండిత్యం సంపాదించి పారశీక మూలం నుండి ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను తెనిగించిన కవుల సంఖ్య అతి స్వల్పం. వీరిలో శ్రీబూర్గుల రామకృష్ణారావు, శ్రీదువ్వూరిరామిరెడ్డి, శ్రీఉమర్ అలీషా, శ్రీఆదిభట్ల నారాయణదాసు ప్రముఖులు. మిగతావారు ఎక్కువగా ఫిట్జ్ రాల్డ్ ఆంగ్లానువాదాన్నే మూలంగా గ్రహించారు.

పారశీకం నుండి ఆంధ్రీకరించిన కవులు వారి రచనలు మొదట పరికిద్దాం.

## శ్రీ బూర్గుల రామకృష్ణారావు

వీరు సంస్కృతాంధ్రాంగ్లభాషల్లో విద్వాంసులేగాక ఉర్దూ పారశీక భాషా పారంగతులు. "బోంబాయిలో ఎల్. ఎల్. బి.పట్టమును చదువుచు అంజుమన్ ఇస్లామియా హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేయుచున్న దినములలో రుబాయీల ననువదించినారు"1

ఉమర్ ఖయ్యామ్ జీవితం తాత్త్వికదృష్టిని గూర్చి వీరు జులై 1927, సెప్టంబరు 1927 'సుజాత' పత్రిక సంచికల్లో అమూల్యములయిన వ్యాసాలు ప్రకటించారు. అవి ఆంధ్రసారస్వత పరిషత్తు,హైదరాబాదు వారు ప్రచురించిన 'సారస్వతవ్యాసముక్తావళి'లో చేర్చబడ్డాయి. శ్రీబూర్గుల రామకృష్ణారావుగారు పారశీకమూలానికి సన్నిహితంగా అనువాదం చేసిన పద్యాలు పైవ్యాసాల్లో సందర్భాన్ని బట్టి పేర్కొనబడ్డాయి. ఈ పద్యాల సంఖ్య దాదాపు ముప్పై. వీటిని బట్టే శ్రీ బూర్గులవారి అనువాద పద్ధతి పరిశీలించడానికి వీలవుతూంది. అనువాదంలో మూలానికి భిన్నంగా కల్పనలు వర్ణనలు లేవు.

ఉమర్ అలీషాగారు, శ్రీ బూర్గుల వారు అటు పారశీకంలోను ఇటు ఆంధ్రంలోను మంచి విద్వత్తు కలవారు. ఇరువురు పర్షియన్ మూలం నుండి రుబాయీలను అనువదించినందువల్ల ఇద్దరి అనువాదంలోను కొంత సామ్యం కలిగి పాండిత్యపు లోతు, భాషా సౌభాగ్యం, కవితాశిల్పం ఉదాత్తంగా ఉట్టిపడుతూంటాయి. ఇందుకు క్రింది పద్యాలే ప్రబల తార్కాణాలు.

---

1. కర్ణరాజశేషగిరిరావు, ఉమర్ ఖయ్యామ్, భారతి, జూన్, 1969

I "కరమను రక్తి భావనలగాంచి పదార్థపు మేలి ముత్తెపున్
సరులను గూర్చి, తత్త్వముల సారమిదంచు వచించు పెద్దలున్
పరమరహస్య సూత్రముల భావమొకించు కెరుంగలేదు—తీ
వరముగ నెవ్వియో పలికి వార్తలు, నిద్రలు జెంది రక్కటా!"2

—డా. బూర్గుల రామకృష్ణారావు

"కొందఱు బుద్ధిమంతులగు కోవిదు లర్థపు మంచి ముత్తెముల్
పొందుగ దండలల్లి యిడు పోలిక దేవుని గూర్చి చెప్పి మె
ప్పొందగలేక వాస్తవసమున్నతి యేదొ యెఱుంగలేకయే
క్రమ్మందిరి వ్యర్థమైన పలుమాటల నాడి ప్రగల్భ చిత్తులై"3

—డా. ఉమర్ అలీషా

లోకోక్తులు ప్రయోగించడంలో ఇరువురు సిద్ధహస్తులు.

II "మాపని రేపటంచు మధుమానిని సేవ యొనర్ప వాయిదాల్
బాపురె! చెల్లునే? మధురభాషలచే నెరదప్ప యారునే?
పాపనెలన్ శశాంకముఖి! పానముసేయుము దివ్యసీధులే
లోపములేక, వెన్నెలలు లోకులు కోరిన యప్డుగాయునే?"4

—డా. బూర్గుల రామకృష్ణారావు.

"రేపున కేరు బూట పడి రిక్తులు గారటు గాన నేడే సం
తాపములన్ ద్యజింపుము సుధాంశునిభాస్య! సుధాంశుడున్న యి-
మాపు విలాసమేర్పడగ మద్యము ద్రావుము-చంద్రుడెప్పుడున్
గాపురముండు మింటను బ్రకాశముతో మనముండ నేర్తుమే"5

—డా. ఉమర్ అలీషా.

2. డా. బూర్గుల రామకృష్ణారావు, సారస్వత వ్యాసముక్తావళి, పు. 34
3. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 8
4. డా. బూర్గుల రామకృష్ణారావు, సారస్వతవ్యాసముక్తావళి, పు. 39
5. డా. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 47

ఒకరు 'శశాంకముఖి!' 'వెన్నెలలు లోకులు కోరిన యన్నపుగాయునే-అంటే మరొకరు 'సుధాంశునిభాస్య!' 'చంద్రుడెప్పుడున్ కాపురముండు మింటను ప్రకాశముతో మనముండ నేర్తుమే' - అని తమ పాండితీ వైభవం ప్రదర్శించారు. ఇరువురి కవిత్వంలోను ప్రౌఢభావాలు సైతం మృదుమధుర భాషలో పొదగబడి రాణిస్తున్నాయి. కాని డా. బూర్గుల రామకృష్ణారావుగారు పైన పేర్కొన్న విధంగా 30 పద్యాలే తప్ప, ఇంతకన్నా అధికంగా అనువదించినట్లు ఆధారాలు కనిపించడం లేదు. రుబాయిీల అనువాద గ్రంథమని వీరి పేర ఏ పుస్తకమూ ప్రచురించబడలేదు.

## శ్రీ దువ్వూరి రామిరెడ్డి

వీరు బహుముఖ ప్రజ్ఞావంతులు. సంస్కృతాంధ్ర భాషల్లోనేగాక పారశీకంలో సైతం పరిణత ప్రజ్ఞకలవారు.

1923వ సంవత్సరం 'పానశాల' పేర మొట్టమొదట వీరి ఉమర్ ఖయ్యామ్ రుబాయిీల అనువాదం 'భారతి' లో ప్రచురించబడింది. వీరి కవిత మాధురీగుణ భూయిష్ఠమైంది.

తమ అనువాదం గూర్చి రెడ్డిగారు స్వయంగా ఇలా చెప్పకొన్నారు.

"నా ఆంధ్రీకరణము మూలమునకు టీకవలె నుండదు. తిక్కన, శ్రీనాథుడు మున్నగు అనువక్తలు వహించిన స్వాతంత్ర్యమును నేనును వహించితిని. అట్లనుటవలన నా తర్జుమా మూలమున కంటె భిన్నముగ నుండునని చెప్పటకాదు. పారశీక జాతీయములలో ప్రకటింపబడిన భావము తెలుగులో అట్లే స్ఫురించుటకు ఆవశ్యకములైన మార్పులను రసపోషణమునకు వలయు మార్పులను కావించితిని"6

'పానశాల'లో 125 పద్యాలున్నాయి. ఎక్కువభాగం వృత్తాలే. అక్కడక్కడ తాత్త్విక విషయ వివరణకు చక్కని ధారగల తేటగీతులు రచించబడ్డాయి. మూలంలో పునరుక్తి కలదని భావించిన చోట భావం కుదించబడింది.

---

6. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, పు. XL

రెడ్డిగారు స్వతంత్ర పద్ధతి అవలంబించినా మూలానికి సన్నిహితంగా అమోఘంగా రచించిన పద్యాలెన్నో ప్రజల్ని ఆకర్షించాయి. అందుకు ఉదాహరణగా ఒకపద్యం—

"అంతములేని యీ భువనమంత పురాతన పాంథశాల, వి
శ్రాంతి గృహమ్ము. నందు నిరుసంజలు రంగుల వాకిళుల్, ధరా
క్రాంతులు పాదుషాలు బహరామ్ జమిషీడులు వేనవేలుగా
గొంత సుఖించి పోయి రెటకో పెఱవారికి జోటొసంగుచున్"7

కొన్ని సందర్భాలలో శ్రీ దువ్వూరి రామిరెడ్డి, శ్రీ ఉమర్ అలీషా భావసౌకుమార్యంతోను విశిష్టమైన శైలీ నిర్వహణతోను హృద్యమైన పద్యాలు రచించి ఎవరికివారే గొప్పవారనిపించుకొన్నారు. అందుకు నిదర్శనం క్రింది పద్యాలు—

"పొలమున నేత్రపర్వముగఁ బూచిన రాగవతీ సుమంబు శో
భలవిలసిల్లె బూర్వనరపాలుర రక్తకణాలనుండి యే
చెలియ నిగారవుందళుకు చెక్కుల నేలిన పుట్టుమచ్చపై
వెలసెనొ నీలకాంత కనువిందొనరించును బూలరెమ్మలన్"8

—దువ్వూరి రామిరెడ్డి

"వనముల నెఱ్ఱపువ్వులు నృపాల రణాంగణ వీరరక్త సం
జనితము లేమొ శోభితదశన్ ననలెత్తిన లేత కొమ్మ కొ
మ్మను జివురాకు లొప్పునవి మానిని చెక్కిళు లేమొ యింపు సొం
పొనరెడు పుట్టుమచ్చలన నొప్పెడు నందలి చుక్కలారయున్"9

—డా. ఉమర్ అలీషా

---

7. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, పు. 15
8. ,, పు. 5
9. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు 14

II "పరము గిరమ్మొ దాని తలపైనొకదో సెడు మన్ను చల్లి సుం
దరి మెఱుగుంగపోలములు దాచిన ముద్దులు దొంగిలించి సం
బరముగశీధుపానము-నమాజులు పూజలు జేయనేల?యె
వ్వరయిన వచ్చినారె మృతి వాటిక కేగిన పూర్వయాత్రికుల్"10

—డా. దువ్వూరి రామిరెడ్డి

"పాడు ప్రపంచదుఃఖములపై దెగబూడిద బోసివేసి పూ
బోడుల తోడ మద్యమును బూర్తిగ ద్రావుచు సంచరింపుమే
నాడు-నమాజదేల? వ్రతనైష్ఠిక కర్మమదేల? చచ్చిపై
కోడక పోయినట్టి నరుడొక్కడు వచ్చిన జాడ యున్నదే?"11

—డా. ఉమర్ అలీషా

III "ధారుణి నుండి యుచ్చశనిదాక గలట్టి కడింది. చిక్కులం
బూరిణిగా సడల్చితిని మోసపుటక్కుల బందెగాను దు
ర్వార నిరోధముల్ గడచి వచ్చితి - నయ్యును, సాయశక్తులం
బోరి వదల్పకే విసిగిపోయితి మృత్యురహస్య బంధమున్"12

—దువ్వూరి రామిరెడ్డి

మంటికి మింటి మధ్యగల మంజుల విద్యలనెల్ల నేర్చియే
యుంటిని మాయలన్ని యెఱి గుంటిని జిక్కుల నుండి తప్పుకో
గంటిని యడ్డులన్ని తొలగన్ నిలుచుంటిని గాని మిత్తి నే
వెంట జయింప లేనయితి విహ్వాల చిత్తము సంద డింపగన్"13

—ఉమర్ అలీషా

ఇరువురి రచనల్లోనూ ఈ విధంగా సాదృశ్యం కలిగిన పద్యాలు ఎన్నో ఉన్నాయి. అయితే సంఘసంస్కరణనిమిత్తం ఖయ్యామ్ ఉపదేశించిన నీతులు బోధలుకల రుబాయిల అనువాద పద్యాలు ఉమర్ అలీషాగారి గ్రంథంలో మాత్రమే ఉన్నాయి.

---

10. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, పు. 19
11. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 56
12. దువ్వూరి రామిరెడ్డి, పానశాల, పు. 18
13. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 6

## శ్రీ ఆదిభట్ల నారాయణదాసు

వీరు అప్రతిహతమయిన ప్రతిభకలవారు. బహుభాషావేత్తలు. ప్రత్యేకించి పారశీకంలో పండితులు.

"తెలు గుననును, వేల్పుమాటల
నలఁబారసి, రాచబాసయగు నాలుగు మో
ముల కైతల నలరించుచు
నలుగడ మెప్పొందు నీవు నలువవు కావే"14

అని నిడదవోలు వేంకటరావుగారు వీరి చతుర్భాషా పాండిత్యాన్ని కొని యాడారట.

శ్రీనారాయణదాసు గారు 110 ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను మూల పారశీకంనుండి సంస్కృతాంధ్రాల్లోకి అనువదించి 'RUBAIYAT OF OMAR KHAIYAM' అనే పేర తమ గ్రంథాన్ని 1932లో ప్రచురించారు. ఒక్కొక్క ఫారసీరుబాయీకి సంస్కృతగీతి, అచ్చతెలుగు భుజంగగీతి వ్రాశారు. ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్లానువాదంలోని ప్రతిపద్యానికి అచ్చతెలుగులో కందపద్యం సంస్కృతంలో అనుష్టుపు శ్లోకం వ్రాశారు. అంటేఒక్కొక్క రుబాయీకి నాలుగు అనువాదాలున్నాయి. ఇంతేకాదు- ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు ఫారసీలిపి లోను, పారసీలిపి తెలియనివారి సౌలభ్యం కోసం రోమనులిపి లోను తమ గ్రంథంలో దాసుగారు ప్రచురించారు.

అఖండ శేముషీ ధురంధరులు నారాయణదాసుగారు స్వచ్ఛమయిన సంస్కృతం వ్రాయగలిగినట్లే అచ్చతెనుగు వ్రాయగలనని నిరూపించు కొన్నారు. వీరి అచ్చ తెనుగు రచనకొక్క ఉదాహరణ-

"కడ్డాయు మెడ బాయకమును నీమిడుకు
నిప్పట్ల దెమ్మను మీకెంపు కోపు
పారిలో బూడ్చి వేపారి గోర్కొర
బైకి దీయుటకు మేల్పైడి కావీవు"15

14- డా. కే. గోపాలకృష్ణరావు, తెలుగుపై ఉర్దూపారశీకముల ప్రభావము, పు.11

15. A. Narayanadas, RUBAIYAT OF OMAR KHAIYAM P. 3

ఈ అచ్చుతెనుగు అనువాదం అందరికి అందుబాటులో లేదు. అనేక పద్యాల్లో మారుమూల పదాలే ఎక్కువగా ఉన్నాయి.

డా. కే. గోపాలకృష్ణరావుగారు ఈవిషయం ప్రస్తావిస్తూ 'కవితాలత స్వేచ్ఛగా నల్లుకొని పోవుటలో నందము కలదు. దానికి ఇనుపపందిళ్లువేసినచో వికృతమగును. ఆదిభట్లనారాయణదాసుగారు ఖయ్యామ్ రుబాయీలను అచ్చ తెనుగులో ననువదించుట సమంజసముగా గన్పట్టదు'16 అని అన్నారు.

రుబాయీలలోని పర్షియన్ పదాలకు ఇంగ్లీషు, సంస్కృతం, తెలుగు అర్థాలును, తెలుగు అనువాదంలోని మారుమూల మాటలకు అచ్చతెలుగు అర్థాలును నారాయణదాసుగారి గ్రంథంలో ఒక భాగంగా ఇవ్వబడ్డాయి. గ్రంథం అపూర్వమై వెలసిందే కాని సులభగ్రాహ్యం కాదు.

ఉమర్ఖయ్యామ్ వంటి తత్త్వవేత్తభావాలు గ్రహించ డానికి సుగ్రాహ్య మైన భాష ఎంతో తోడ్పడుతుంది. అప్పుడే తార్కికభావనాశక్తికి ఉత్తేజం కలుగుతుంది.



ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను ఇతరభాషలనుండి అనువదించినవారూ ఉన్నారు. అయితే ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్లానువాదం అనుసరించి ఆంధ్రీకరణ చేసిన వారే ఎక్కువ.

ఫిట్జ్‌రాల్డ్ యథామాతృక ననుసరించలేదు. అవసరమైనచోట మూలాతి క్రమణచేసి స్వతంత్రించాడన్న విషయం పూర్వోక్తం. కనుక ఆంగ్లం నుండి చేసిన అనువాదాలకు పారశీకం నుండి చేసిన అనువాదాలకు స్పష్టమయిన వ్యత్యాసం ఉంది. తెలుగులో మొట్టమొదటి అనువాదం ఆంగ్లానువాదం అను సరించే జరిగింది.

## శ్రీ రాయప్రోలు సుబ్బారావు

తెలుగులో ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను మొదట ఆంధ్రీకరించిన ఘనత వీరికి దక్కింది. ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్లాన్ననుసరించి జరిగిన వీరి అనువాదం

16. డా. కే. గోపాలకృష్ణరావు, తెలుగుపై ఉర్దూపారశీకముల ప్రభావము, పు.119

'మధుకలశము' పేరుతో 1924వ సంవత్సరం భారతిలో ప్రచురించబడింది. 1935లో పుస్తకరూపాన వెలువడింది. ఇందులో గల పద్యాల సంఖ్య 75. అన్నీ వృత్తాలే.

నవ్యాంధ్రకవులలో పూర్వశృంగార వ్యవస్థపై విముఖత చూపి సాహిత్యంలో అమలిన శృంగార సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన వారు రాయప్రోలు సుబ్బారావు గారు. ఖయ్యామ్ రచించిన వియోగ శృంగార గీతికలలోని స్వచ్ఛత వీరికి నచ్చింది. ఆంగ్లం నుండి రుబాయీలను అనువదించి తమ కవితామధువును తెలుగు వారికి పంచి పెట్టారు.

వీరు యథా మాతృకంగా కావ్యాను వాదం చేసినా ఔచితీ దృష్టితో. కొన్నిచోట్ల స్వతంత్రించారు. మరికొన్నిచోట్ల మూలానికి మెరుగులు దిద్దారు. ఇందుకు కొన్ని ఉదాహరణలు—

"Why, all the Saints and Sages who discuss'd
Of the Two Worlds so learnedly, are thrust
Like foolish prophets forth; their words to scorn
Are scatter'd, and their Mouths are stop with
dust"17

"ఇహపరలోక తర్కముల నెంతొ చలంపడి వేత్తలున్ గురూ
ద్వహులును పెక్కురేగిరి, పదంపడి వారి భవిష్యదర్థ సం
గ్రహమును త్రుప్పపట్టె— సుడిగాలికి బోయె తదీయ బోధనా
మహిమయు, దుమ్ముగొట్టికొని మాసెను వారి సమాధులున్ చెలీ"18

ఈపద్యంలోని త్రుప్పుపట్టు, సుడిగాలికిపోవు, దుమ్ముకొట్టి కొని మాయు- ప్రయోగాలు భావపటిష్ఠతకు తోడ్పడి తెలుగు అనువాదాన్ని మౌలికరచనగా తీర్చి దిద్దుతున్నాయి.

---

17. Fitzgerald, The Rubaiyat of Omar Khayyam, P. 121
18. రాయప్రోలు సుబ్బారావు, మధుకలశము, పు. 23

"Ah, fill the cup:- what boots it to repeat
How time is slipping underneath our feet:
Un born To-morrow and dead yesterday,
Why fret about them if To-day be sweet !19

"వృథ కథ చెప్పనేల కృశియించుచు నున్నది ఆయువంచు,నీ
మధుకలశమ్ము నింపుము సుమంగలి! పుట్టని 'రేపు' కోసమై
శిథిలత గన్న 'నిన్న' కయి చింతల వంతల మున్గనేటికో!
మధురము లేని 'నేడు' లనుమానము మాని సుఖింపు మర్థిమై"20

How time is slipping underneath our feet అనేమూలానికి కేవలం కృశియించుచున్నది ఆయువని మాత్రం చెప్పబడింది. శ్రీగుడిపాటి వెంకట చలం దీనినే

"సఖీ, గిన్నెని నింపు
మనకాళ్లకిందనించి కాలం ఎలా కొట్టుకు పోతోందో..."21

అని అనువదించారు.

ఆంగ్లమర్యాదననుసరించిన వాక్యమని రాయప్రోలువారు భావించారేమో, యీ వాక్యాన్ని యథాతథంగా ఆంధ్రీకరించలేదు.

అనువాదంలో సాటిలేని ప్రతిభ ప్రదర్శించారు రాయప్రోలు వారనడానికి ఎన్నో పద్యాలు ఉదాహరణంగా చెప్పుకోవచ్చు.

" 'T is all a chequer-board of Nights and Days
Where Destiny with Men for pieces plays:
Hither and thither moves, and mates, and slays,
And one by one back in the Closet lays"22

19. Fitzerald The Rubaiyat of Omar Khayyam, P. 61
20. రాయప్రోలు సుబ్బారావు, మధుకలశము, పు. 31
21. చలం, ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు, పు. 23
22. Fitzerald Rubaiyat of Omar Khayyam, P. 67

"ఒక చదరంగ పాళి యిది యుగ్మళి! రంగుల గళ్ళు రేల్బవల్;
సకల జగజ్జనంబులను సారెలుగాఁగొని కాలుడాడు; పా
చికలును కొంతసేపనుగు చెల్మినటించి, ఒకింతలోన మా
రకులయి ఈవలావల పరస్పరమున్ తెగి పేటికంబడున్"23

Chequer-Board 'చదరంగపాళి' అయింది. Night and days 'రంగుల గళ్ళు రేల్బవల్' గా మారి మూలానికి వ్యాఖ్యానప్రాయంగా ఉంది.

ఫిట్జ్‌రాల్డ్ అనువాదం కొంత స్వతంత్రపద్ధతి అనుసరించిందన్న విషయం పూర్వోక్తం. దీనికి రాయప్రోలు వారి 'మధుకలశము' ఆంధ్రీకరణ కనుక మూల పారశీకంలోని విషయం ఇందులో కొంత మార్పుకు లోనైంది.

"ఈన్ కుహ్నయి రిబాత్రా కి ఆలమ్ నామస్త్
ఆరామ్ గహి అబ్లఖి సుబహ్ వ షామ్ అస్త్
బజ్ మిస్త్ కి వమాన్ దయి సద్ జమ్ షీ దస్త్
కస్రీస్త్‌కి తక్ యాయి గహి సద్ బహ్‌రా మస్త్"24

ఈ రుబాయీకి ఫిట్జ్‌రాల్డ్ అనువాదం—

"Think, in this batter'd Caravanserai
Whose Door ways are alternate Night and Day,
How Sultan after Sultan with his Pomp
Abode his Hour or two, and went his way"25

ఇక రాయప్రోలు వారి అనువాదం ఇలా ఉంది—

"రేలు పగల్ కవాటముల రెక్కలుగా గల ఈ యెడారి స
త్రాలకు వచ్చుచుంద్రు సులతాను లొకం డెడలన్ మఱొక్క డాం
దోళికలెక్కి; ప్రాభవముతో వసియింతురు రెండు మూడు నా
ళ్ళోలగమాపి యంత నెటకో విరమింతురు, కంటె, నెచ్చెలీ!"26

23. రాయప్రోలు సుబ్బారావు, మధుకలశము, పు. 39
24. A. Narayanadas, Rubaiyat of Omar Khaiyam, P. 32
25. Fitzerald, Rubaiyat of Omar Khayyam, P. 50
26. రాయప్రోలు సుబ్బారావు, మధుకలశము, పు. 17

మూలంలోని 'సుబహ్ వ షామ్' ను ఉమర్ అలీషా సంధ్యలు, ఉష స్సులని,దువ్వూరి రామిరెడ్డి ఇరు సంజలని అపూర్వంగా అనువదించారు. ఇదే ఆంగ్లంలో night and day అని అనువదించబడడం వల్ల రాయప్రోలు వారి అనువాదంలో 'రేలు పగల్' అయి అందం తగ్గింది.

సద్ జమ్షీ దస్తె సద్ బహ్ రామస్తె అనేమూలానికి అర్థం వందలకొద్దీ జమ్షీదులు, బహ్రామ్‌లు అని. పెక్కు జమ్ షీదులు, పెక్కు బహ్రామ్‌లు అని ఉమర్ అలీషాగారు తెనుగుచేశారు.27 మూలానికి మరింత మెరుగు పెడుతూ రామిరెడ్డిగారు 'ధరాక్రాంతులు పాదుషాలు ఖహ్రామ్ జమిషీదులు వేనకువేలు' అన్నారు. ఫిట్జెరాల్డ్ ఆంగ్లంలో ఈ చక్రవర్తుల పేర్లు తొలగించి Sultan After Sultan అని వ్రాయడంవల్ల 'సులతాను లోకం డెడలన్ మతొక్కడు' అని రాయప్రోలు వారి అనువాదం.

శబ్దలాలిత్యం, అనితర సాధ్యమైన రచనా కౌశలం, భావ సౌకుమార్యంతో వెలసిన 'మధుకలశము' మూల పారశీకాన్ని అనుసరించి ఉంటే మరింత బాగుండేది.

## శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

సహజ కవితా ధార కలిగిన సుందరరామశాస్త్రిగారిని పలువురు ప్రశం సించారు. వారిలో శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారిలా అన్నారు—

"ఎందఱు లేరు నేడు సుకవీంద్రుల ఖండ కవిత్వరాజ్య సం
క్రందనులంధ్ర విశ్వజన గౌరవ భాజను లట్టి వారిలో
నెందఱికబ్బెనీకు లభియించిన కీరితి కూర్పునేర్పులో
సుందర రామశాస్త్రి నినుజూచుట పండువు తెల్గువారికిన్"28

ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్లానువాదం అనుసరించి వీరు రచించిన 'ఉమర్ ఖయాం' గ్రంథం 1944వ సంవత్సరం ప్రచురించబడింది. ఇది స్వేచ్ఛానువాదం.

---

27. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 15
28. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, ఉమర్ ఖయాం, పీ. 1

కావ్యారంభానికి ముందు అవతారికాభాగాన 'ఉమరు' శీర్షికలో నాలుగు పద్యాలు, 'అంతఃస్మృతి' శీర్షికలో ఆరు పద్యాలున్నాయి. అనంతరం "ఉదయరాగము" అనే శీర్షికతో కావ్యం ప్రారంభమైంది. ఉదయరాగము, మధువు, చెలీ, విధి, పూదోట మున్నగు ఉపశీర్షికలతో గ్రంథం 14 భాగాలుగా విభజించ బడింది.

వృత్తాలేకాక ఆటవెలదులు, తేటగీతులు, కందాలు రచించ బడ్డాయి. ఒకచోట ఒకసీసపద్యం మరోచోట మంజరీద్విపదకూడ ఉన్నాయి. అవతారికా భాగం కాక గ్రంథంలోని పద్యాలు 136.

సుందరరామశాస్త్రిగారి శైలిధారావాహికమై కొన్నిచోట్ల మూలానికి మెరుగులు దిద్దింది.

"And we, that now make merry in the Room
They left, and Summer dresses in new Bloom
Ourselves must we beneath the Couch of Earth
Descend, ourselves to make a Couch-for whom?"29

"ప్రియజన మే స్థలిన్ విడిచి పెట్టెనొ యా మనకాస్థలమ్మె యా
శ్రయమయి చూచితే యెటు వసంత నవోదయ రాగరంజితం
బయినదొ శయ్యగూర్చుము రయమ్మున గాలము తీఱిపోయి భూ
శయనము నొంది యింకెవరి శయ్యల మౌదుమొ యెల్లి నెచ్చెలీ"30

Summer dresses in new Bloom అనే ఆంగ్లానికి 'వసంత నవోదయ రాగరంజి తంబు' చక్కని తెలుగుసేత. రాయప్రోలు వారు దీన్నే 'కులికెడు క్రొత్త శోభనపు కోకలు తాలిచి గ్రీష్మదూతి' 31 అని అన్నారు.

మూలానుక్రమణ జరగకుండా రాయప్రోలువారు రచించిన ఒకపద్యం—

"బదులిడ దౌను కాదనుచు ప్రశ్నలు వేయదు, ఆటకాడెటుల్
చదిమెడునట్లయేగు నపసవ్యమొ సవ్యమొ కందుకంబు— ఈ
చదరము నందెవండు నిను జాగిల త్రోసెనొ యాత డొక్కడే
తదఖిల చాలనం బెఱుగు తన్వి! యెఱుంగును సర్వమాతడే"32

---

29, Fitzerald, Rubaiyat of Omar Khayyam, P. 53
30. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి. ఉమర్ ఖయాం, పు. 13
31. రాయప్రోలు సుబ్బారావు, మధుకలశము, పు. 21
32. రాయప్రోలు సుబ్బారావు, మధుకలశము, పు. 39

స్వేచ్ఛానువాదం చేసిన మాధవపెద్దివారు పైపద్యంలోని భావాన్ని సైతం కొంత మార్చి ఇలా వ్రాశారు.

"జడముల జేసి వైచినను సంగ్రమే యగుగాని వ్యక్తులన్
జడులనొనర్చుచున్ దనదుసంగతి సంగతిగాగ జూచుకో
నెడద సహింపనోప మతడీశ్వరుడే యగుగాక యాటకా
డిడ పెడగొట్టు బంతులమె యీవును నేనును వాని చేతకున్"33

అర్థస్ఫోరకత కల ఇలాంటి పద్యాలెన్నో వీరి 'ఉమర్ ఖయాం' లో ఉన్నాయి. ఆంగ్లానువాదాన్ని అనుసరించి స్వేచ్ఛానువాదం చేయడంవల్ల మూల పారశీకానికి వీరి తెనుగుసేతకు వ్యత్యాసం కనిపిస్తుంది.

## శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి

వీరు రుబాయీలు అనువదించినట్లు తెలిసిందేకాని, ఎంత ప్రయత్నించినా ఆ అనువాదం లభించలేదు. శ్రీ కర్ణరాజశేషగిరిరావుగారు వీరిని గూర్చి వ్రాసిన కొంతరచన మాత్రం ఆధారంగా దొరికింది.

బూర్గుల రామకృష్ణారావు, ఆదిభట్లనారాయణదాసు, రాయప్రోలు సుబ్బా రావు వంటి ప్రసిద్ధ తెలుగురచయితల అనువాదానికి వీరి అనువాదానికి తార తమ్యం స్పష్టంగా ఉంది,

" [కృష్ణశాస్త్రిగారు] పిఠాపురం సంస్థానముతో మొట్టమొదట సన్నిహిత సంబంధము కలవారు. జీవితమునందు భోగము నలవరచుకొనిన రోజులలో ఉమరు ఖయ్యాము కవితవైపు దృష్టి మరల్చినారు. శ్రీ వేంకట రత్నము నాయుడుగారి ప్రియశిష్యులు. వీరితో సంఘ సంస్కరణాభిలాష పెంపొందినది. కవి జీవితములో అతి తీవ్రవేదన, ఆవేశమును కలిగించు అనుభవములను పొందినారు. ఉమర్ ఖయ్యాము వ్యక్తిత్వ మిట్టిదే. గేయములుగా ఉమరు రుబాయీలను అనువదించినారు. ఉర్దూపదముల నిష్టము వచ్చినట్లు వాడినారు.

---

33. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి, ఉమర్ ఖయాం, పు. 19

రావెసాకీ సాకీ రాగవీధుల నడచి
కడచి చలివేళ పొలిమెర అమని పాడెచె

రాగ బుల్ బుల్ గొంతు మ్రోగించు బాకా
సోగ విరితీగ తెగ తూగించు జూకా
జాగా గులాబి పాదనూగును బులాకీ
ఆగకిక సాకీ...

తళుకు జల్తార్ బుటా లల్లిన
నీల వలయమ్మి గుడారం
చాలసుఖదమ్మి బిడారం
పరం అపరం తెలియజాలం

ప్రస్తుతమ్మిటనే బిచానా
ఇంతలో ఎటకో రవానా

మౌలసరీ, జాయీ గులాబీ
మేల్ జుహీ, చంపా, చమేలి
మనకు చుట్టాలీ హవేలీ"34

శబ్దాడంబరం కలవీరి అనువాదం ఒకప్రత్యేకతసంతరించుకొంది.

## స్ఫూర్తిశ్రీ

వీరు 'మధుపాలిక' అనే పేరుతో ఖయ్యామ్ రుబాయీలను అనువదించారు. 1963వ సంవత్సరం ఈ పుస్తకం ప్రచురించబడింది. ఇందులో 249 సమవృత్తాలు ఉన్నాయి. స్ఫూర్తిశ్రీ గారే స్వయంగా తమరచనను గూర్చి ఇలా అన్నారు.

"నేను నా రచనకు ఆధారముగా శ్రీ స్వామి గోవింద తీర్థరచించిన 'The Nectar of Grace' అను ఆంగ్లానువాదము తీసికొంటిని. వాటి

34. కర్ణరాజ శేషగిరిరావు, ఉమరు ఖయాము, భారతి, జూన్ 1969.

గ్రంథమున పద్యసంఖ్య సహస్రాధికముగా కలదు. అందుండి ఖయ్యాము తత్త్వములను వెల్లడించు పద్యములను వైవిధ్యముండునట్లుగా చూచి యెన్నిక చేసికొంటిని. ఉరుదూ అనువాదముల నుండియు పారశీక మూలము నుండియు కొన్నింటిని గ్రహించితిని."35

విషయానుకూలంగా గ్రంథమంతా 14 శీర్షికల్లోనికి విభజించ బడింది. శైలి లలిత మనోజ్ఞమైంది.. పద్యాలు చిన్నచిన్న వాక్యాలుగా వింత అల్లికతో హృద్యంగా ఉన్నాయి.

వీరి పద్యాలుకొన్ని ఉమర్ అలీషాగారి రచనను స్మృతికి తెస్తాయి. ఉదాహరణకు—

"మరణపు నిద్రలో మునిగి క్రుగ్గినవారి సమాధిచేరి యే
వరముల కోసమో మూడిగి ప్రార్థనముల్పొనరింతువే! అగో
చరులు తమంతతామె- తమసర్వము గూడి గతించినారు- నీ
కొఱకిటు వత్తురా మరల! కోరిక దీరిచి నిన్నుమెత్తురా!" 36

—స్ఫూర్తిశ్రీ

"మరణ సుషుప్తిలోపల నిమగ్నత బండిన వారలింక నీ
మొఱవినరారదేవయిన - మూర్ఖుని కైవడి జేరి గోరికన్
శిరమిడి యేవరాలకొయిసీ! మొరపెట్టెదు వారలే యగో
చరులయిపోయినారు నిను సాకగవత్తురె గోచరింపగన్"37

—డా. ఉమర్ అలీషా

* * * *

## శ్రీ గుడిపాటి వెంకటచలం

శ్రీ చలంగారు ఫిట్జ్ రాల్డ్ గ్రంథాన్ననుసరించి 'ఉమర్ ఖయామ్ రుబాయీలు' అనే పుస్తకం వ్రాశారు. మొట్టమొదట 1960 అగస్టులో ప్రచురించ బడింది. 105 గీతాలున్నాయి.

---

35. స్ఫూర్తిశ్రీ, తెలుగులో ఉమర్ ఖయ్యామ్, సాహితీవాల్లభ్యము, ద్వి. భా. పు. 477
36. స్ఫూర్తిశ్రీ, మధుపాలిక, పు. 67
37. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 5

ఇంగ్లీషు తెలీని మిత్రుడు మండువ జగ్గారావుగారి అభిలాష తీర్చడానికి తెనిగించానని చలంగారు పుస్తక ప్రారంభంలో అన్నారు. వ్యవహారిక వచనం లోనూ, వచనగేయాల్లోనూ రచన మృదు మధురంగా ధారావాహికంగా సాగింది.

వీరి రచనా నైపుణ్యానికి ఉదాహరణ—

"How sweet is mortal Sovranty!" - think some:
Others- "How blest the Paradise to come!"
Ah, take the Cash in hand and waive the Rest;
OH, the brave Music of a distant Drum.38

"వెర్రివాళ్లు!
మనషులపైన అధికారం చెలాయించే చక్రవర్తిత్వం కన్న
గొప్పదిలేదనుకుంటారు కొందరు...
ఈలోకం కాదు, ఆలోకంలో స్వర్గం సాధించడమే
పరమావధి అని మరి కొందరు...
చేతిలో వున్నది వొదులు కొని లేనిదేదో కావాలని
ఆశలు పడి పరిగెత్తు తారు... ...

ఎదుటనున్న ఆనందాన్నను భవించు
తక్కిందది ఎట్లాపోతే మనకేం?
దూరంనుంచి వినబడే భేరీ నినాదంలో
ఎంత ఆకర్షణ మూర్ఖులకి!"39

పై ఆంగ్లంలోని మొదటి పాదాన్ని 'రాజ్యపాలనమ్మే జీవితాశయమ్మన కొందరు'40 అని వచనగేయంలో రంగయ్యప్పారావుగారు వ్రాయగా, మరింత విపులంగా మూలానికి వ్యాఖ్యాన ప్రాయంగా 'మనుషులపైన అధికారం చెలాయించే చక్రవర్తిత్వం కన్న గొప్పది లేదనుకుంటారు కొందరు.' అని చలం అనువదించారు.

మరికొన్ని చోట్ల చలం భావాన్ని కుదించారు.

38. Fitzerald, Rubaiyat of Omar Khayyam, P. 48
39. చలం, ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు, పు.10.
40. రంగయ్యప్పారావు, ఉమర్ ఖయాం రుబాయ్యాత్, పు. 19

"Here with a Loaf of Bread beneath the Bough,
A Flask of Wine, a Book of Verse-and Thou
Beside me singing in the Wilderness-
And Wilderness is paradise enow" 1

"చెట్టు నీడలో కూచున్న మనకేంకావాలి?
ఓరొట్టె, ఓకావ్యం మధువు
నా పక్కన కూచుని నువ్వు పాడుతో
ఎడారి స్వర్గమవుతుంది."42

* * * *

## శ్రీ రంగయ్యప్పారావు

శ్రీ మేకా రాజా రంగయ్యప్పారావుగారు 'ఉమర్ ఖయాం రుబాయ్యాత్' అనేపేర ఫిట్జ్‌రాల్డ్ ఆంగ్ల గ్రంథాన్ని ఆంధ్రీకరించారు. అనువాదం 77గేయాలతో సరళంగా ఉంది.

ఖయ్యామ్ పారశీక దేశస్థుడు కనుక అతని రుబాయీలలో పారశీక దేశానికి సంబంధించిన రాజుల పేర్లు అక్కడిగాథలు సందర్భవశాత్తు ప్రస్తావనకు వస్తాయి. కాని ఈ విషయంలో రంగయ్యప్పారావుగారు స్వతంత్రించారు. భారత దేశపు పురాణగాథల్లోని వ్యక్తులపేర్లు, భారతీయ వాతావరణం తమగేయాల్లో చిత్రించారు. పారశీక పూర్వగాథలవైపు వీరి అనువాదం దృష్టి మారల్చనివ్వదు.

"But come with old Khayyam, and Leave the Lot
Of Kaikobad and Kaikhosru forgot :
Let Rustum lay about him as he will,
Or Hatim Tai cry Supper-heed them not"43

---

41. Fitzgerald, Rubaiyat of Omar Khayyam, P.48
42. చలం, ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు, పు. 10
43. Fitzgerald The Rubaiyat of Omar Khayyam, P. 47

"రండు రండు రారండు
మీ ఖయ్యామ్‌తో
విడువుడు మనకేల
కృష్ణార్జునుల దయతో
తన గదతో భీముని
చెండా నిండు శత్రుల మూకల
దానకర్ణుని కరుణ
బ్రోవ నిండు నిరుపేదల"44

మూలంలోని Kaikobad and kaikhosru కృష్ణార్జునులుగాను, పారశీకవీరుడు రుస్తుమ్ భీముడుగాను, విఖ్యాతి గన్న మహాదాత హాతిమ్ తాయి దాన కర్ణుడుగాను అనువాదంలో చిత్రించ బడడం గమనార్హం. ఇలాగే—

"...లోకంబు కెల్ల నేనె రారాజు నంచు
విర్రవీగు సుయోధనుని వింటివే
జాలి గొలుపు వాని వెర్రిచూపుల
దివాంధత్వమ్ము కంటివే"45

వంటి గేయాలు కన్పిస్తాయి.

రంగయ్యప్పారావుగారి కావ్యారంభంలో 'ఒక మనవి' అనే శీర్షికతో లత గారు సమీక్ష వ్రాశారు. అందులో 'Awake! for morning in the bowl of night' అని ప్రారంభమయ్యే ఫిట్జ్‌రాల్డ్ మొదటి పద్యాన్ని మాధవ పెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు, ఉమర్ అలీషాగారు అనువదించిన విధానమని ఇరువురి అసలు పద్యాలు వదిలి వేరే పద్యాల్ని పేర్కొడం జరిగింది.

* * * *

---

44. రంగయ్యప్పారావు, ఉమర్ ఖయాం రుబాయ్యాత్, పు.17
45. " పు. 43

## ఇతర ఆంధ్రానువాదకులు

ఇంకా ఎందరో ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను అనువదించారు. అందరి రచనలను గూర్చి ప్రస్తావించడం సాధ్యం కాదు కనుక వారి పేర్లు మాత్రం వివరించగలను.

శ్రీ రామచంద్ర అప్పారావుగారి అమరకావ్యము 1936 లోను, శ్రీ బీర్నీడి విజయదత్ గారి 'స్వర్గావతరణము' 1955లోను, శ్రీ మడిపడగ బలరామాచార్య గారి 'ఉమర్ ఖయ్యామ్ అమరగీతాలు' 1962లోను ప్రచురించ బడ్డాయి.

ఇంకా సర్వశ్రీ శ్రీరామశర్మ, కాటూరి గోపాలరావు, ముద్దుకృష్ణ, చిలుకూరి నారాయణరావు, స్వామిశివశంకరశాస్త్రి, కనక మేడలవెంకటేశ్వరరావు, నారపురెడ్డి రామిరెడ్డి, డా. పి. శ్రీదేవి, దొంతిరెడ్డి, లత, మల్లవరపు విశ్వేశ్వరరావు, అందలం కృష్ణమూర్తి మున్నగు వారెందరో ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను ఆంధ్రీకరించారు.

* * * *

## ఉమర్ అలీషా గారి అనువాద గ్రంథ విశిష్టత

ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను కొందరు తెలుగుకవులు మూలపార శీకం నుండి, మరికొందరు ఆంగ్లానువాదం నుండితెనుగు చేశారని ఇంతవరకు స్పష్టమయింది.

ఇక అలీషా గారి 'ఉమర్ ఖయ్యామ్' గ్రంథం ఏ విశిష్ట గుణాలు కలిగి ఉందో పరిశీలించడం ప్రధాన విషయం. ఇప్పటి వరకు వెలసిన తెలుగు అను వాద గ్రంథాల్లో ఇదేపెద్దది. ఇందులో ఉన్నన్ని పద్యాలు మరే గ్రంథంలోనూ లేవు. ఒక్కొక్క రుబాయీకి ఒక్కొక్క పద్యం వ్రాయబడింది. ఈ గ్రంథరచ నను గూర్చి కబీర్‌షా గారు తమ మాటల్లో ఇలా అన్నారు.

"శ్రీ ఉమర్ అలీషాకవిగారీ గ్రంథమును 1926-28 సంవత్సరముల మధ్య ఆంధ్రీకరించిరి. వీరి కప్పుడు లభించిన పారశీకమూల గ్రంథమునందు 720 రుబాయీలవఱకు కలవు. అందు శ్రీ కవిగారు 714 రుబాయీలు తెనిగించిరి.

ఈ గ్రంథము వీరి జీవితకాలమున నచ్చుపడు భాగ్యము లేకపోయినది. వీరి జీవితకాలమున నచ్చుపడని లోపము లేకపోలేదు. ఏలయన శ్రీ కవిగారు తమ గ్రంథము లచ్చగునపుడు సవరించు చుండిరి. వీరిగ్రంథ మాంధ్రీకరించు నప్పుడనేక పద్యము లనేక పత్రికలందు ప్రకటింప బడినవి1 అందుకొన్ని బొంబాయి వాస్తవ్యులు, పారశీకులు శ్రీ జంషేద్ జీ. ఇ. సక్లత్ వాలాగారు చూచి శ్రీ కవిగారితో ఉత్తర ప్రత్యుత్తరములు నడపి కవిగారి ప్రియమిత్రులైరి"2

ఉమర్ అలీషాగారి గ్రంథలో 714 రుబాయీలకు ఆంధ్రీకరణ ముండడమే కాదు. ఆరు పాఠాంతరాలున్నాయి. అందువల్ల గ్రంథంలోని మొత్తం పద్యాల సంఖ్య 720. కావ్యంలోని ఛందో వైవిధ్యాన్ని గూర్చి ఇదివరకే పరిశీలించడం జరిగింది.

అలీషాగారు తమ గ్రంథంలోని విషయాన్ని విభిన్న శీర్షికలుగా విభజించారు. అవి కర్మిష్ఠులతో ప్రసంగము, ఆప్తులులేరు, సౌందర్యము, విధినింద, లోకదుఃఖము- మధువు, నీతి, స్వేచ్ఛోపభోగము, రహస్యము, నిరాశ, ఈశ్వరుడు, మధుప్రబోధము, మధువు సుర- దారిద్ర్యము.

ఖయ్యామ్ తత్త్వాన్ని వ్యక్తిత్వాన్ని సమగ్రంగా అర్థం చేసుకోనేందుకు ఈ గ్రంథం ఒక్కటే ఎంతయినా తోడ్పడుతుంది. ఇందుకు కారణం మరే గ్రంథంలోనూ లేని అనేక అమూల్య విషయాలు ఇందులో వివరించ బడడమే. ఈ సిద్ధాంతవ్యాసంలోని మూడో ప్రకరణంలో ఉమర్ అలీషాగారి పద్యాలను ఆధారం చేసుకొనే ఖయ్యామ్ తత్త్వం విపులంగా చర్చించబడింది.

ఏ అనువాద గ్రంథంలోనూ కనిపించని సాంఘిక విమర్శ ఈ గ్రంథంలో కనిపిస్తుంది. దీన్నిబట్టి ఖయ్యామ్ కాలంనాటి సాంఘిక పరిస్థితు లెలాంటివో పరిశోధించడానికి వీలు కలుగుతూంది.

ఖయ్యామ్ పెక్కు శాస్త్రాల్లో నిష్ణాతుడుగా తత్త్వవేత్తగా లోకానికి పరిచితుడు. ఇది సాధారణ విషయం. నాటి దురాచారాల్ని నిర్భీకతతో ఖండించి సంఘో

1. ఆంధ్రపత్రిక విభవ సంవత్సరాది సంచిక 1928-29లో 'ఉమర్ ఖయ్యామ్- ఈశ్వరుడు' అనే శీర్షికతొ కొన్ని పద్యాలు ప్రచురించ బడ్డాయి.
2. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. XIX

ద్ధరణ ఆశించిన సంస్కర్తగా సైతం ఈ గ్రంథంలో కనిపిస్తాడు. కుటిల ఆచారాలు,వేషధారితనం, బాహ్యకర్మలు మున్నగు వాటినితూల నాడి ప్రగతినిరోధక శక్తుల్ని బట్ట బయలు చేయడంలో కబీరుదాసు, వేమనవంటి మనస్తత్వమే కల వాడు ఖయ్యామ్.

కనుక ఖయ్యామ్ కాలంనాటి రాజకీయ సాంఘిక పరిస్థితు లెలాంటివో మొదట పరిశీలించి, ఖయ్యామ్ కవితపై ఆపరిస్థితుల ప్రభావం ఎలాంటిదో, ఖయ్యామ్ ఖండించిన సాంఘిక దురాచారా లేమిటో, ఉపదేశించిన బోధలేవో వీటిని వివరించడంలో అలీషాగారు తమ రచనా వైభవమెలా ప్రదర్శించారో తెలుసు కొందాం.

## ఖయ్యామ్ కాలంనాటి రాజకీయ సాంఘిక పరిస్థితులు- ఖయ్యామ్ కవితపై వాటి ప్రభావం

సుల్తాన్ మహమ్మద్ గజ్నవీ క్రి.శ. 1030 లో కీర్తిశేషుడయ్యాడు. ఇతని పుత్రుడు మాసూదు తండ్రి అనంతరం సింహాసన మధిష్ఠించాడు. నాలుగేండ్లకే సల్జూకీ వంశీయులైన తొగ్రుల్ బేగ్, చకిర్ బేగ్ అనే ఇద్దరు నాయకులు ఇతనిని ఓడించి రాజ్యం హస్తగతం చేసుకొన్నారు. అంతేకాక వీరిద్దరు మెర్వ్, నిషాపూర్, హీరాత్, సేస్తాన్, బాగ్దాదు వంటి నగరాలపై దాడిచేసి వాటిని కూడ స్వాధీనం చేసుకొన్నారు. తరచు యుద్ధాలు జరుగుతూనే ఉండేవి. వీరి ఇరువురి అనంతరం అల్ప్ అర్సలాన్ పారశీక సామ్రాజ్యాధిపతి అయ్యాడు. తొమ్మిదేండ్ల తరువాత ఇతనిని విప్లవకారులు హత్యచేశారు. అనంతరం మలిక్‌షా సింహాసన మధిష్ఠించాడు. అల్ప్ అర్సలాన్ వద్ద మంత్రిగా ఉండిన ఖయ్యామ్ బాల్య స్నేహితుడు నిజాముల్ ముల్క్ మలిక్‌షా వద్దను మంత్రి అయ్యాడు. ఇతడు ఇస్మాయిలీల సంఘంచే హత్యకావించ బడిన అనంతరం దేశంలో శాంతి భద్రతలు లోపించాయి. సమాజంలో అజ్ఞానం, మూఢభక్తి, మతపాషండత్వం, కుటిలాచారాలు విజృంభించడమే కాదు, సూఫీలలో వేషధారులు బయల్దేరారు. సూఫీలు లౌకిక భోగాలు త్యజించి దైవధ్యానలగ్నమనస్కులై ఆత్మ పరమాత్మల ఐక్యం కోసం సాధన చేస్తారు. కాని ఈసాధన బరువై కపట వ్యాపారాలు తలెత్తాయి. సూఫీమత పావనత్వం, వైరాగ్యం కళంకిత మయ్యాయి. ఈ విధంగా ఆనాడు రాజకీయ సాంఘిక పరిస్థితులు తరచు అశాంతికి లోనవుతూండేవి.

అయితే ఖయ్యామ్ తన కాలంలో ఎనలేని రాజగౌరవం పొందగలిగాడు. సర్వశాస్త్రపారంగతుడు, వైద్యుడు, కవివరుడూ కనుక ఇతనికి ఈగౌరవం దక్కి ఉంటుంది. సంస్థానాధిపతులు, ప్రభువులు ఇతనిని అపూర్వంగా సత్కరించారు. మెర్వ్పాలకుడు సదరుద్దీన్ మహమ్మద్ తన సింహాసన మిచ్చి ఆసీనుని చేసేవాడు. మలిక్షా తన సింహాసనం ప్రక్కనే మరో సింహాసనం వేసి కూర్చుండబెట్టేవాడు. సంజర్ సల్జూఖీ అర్ధసింహాసనంపై ఆసీనుని చేసి గౌరవించేవాడు. ప్రతిభా వంతులయిన విద్వాంసులకు అక్కడక్కడ రాజాదరణ ఉండేది. ఖయ్యామ్ తానయి ఎవ్వరిని ఆశ్రయించేవాడుకాడు. ప్రభువులే ఇతని శాస్త్ర పాండిత్యాన్ని వినియోగించుకొనేవారు.

కాని కొందరు కవి, పండితులు సాధారణంగానే ఆరోజుల్లో రాజాశ్రయం కోసం ప్రాకులాడేవారు. కాని రాజులు వారిపట్ల సరియయిన ఆదరణ చూపే వారు కాదు.

పాదుషా సంజర్ సల్జూఖీ రషీద్వత్వాత్ అనే కవిని అవమానించి ఆనందిచేవాడు.అయితే పాదుషా పరిహాసానికి పాత్రుడనయ్యానని రషీద్ గర్వించేవాడేకానిఅవమానంగా భావించి కృంగి పోలేదు.

పాదుషాల ప్రవర్తన దుర్భరమని తెలిసినా ఆస్థాన ప్రవేశం కోసం కవులు మరింతగా ఆరాటపడేవారు. ధనవాంఛ కీర్తికాంక్షలపై వారి కుండేమమత అలాంటిది. ప్రభువుల్ని పరమేశ్వరునితో సమంగా స్తోత్రం చేసేవారు. కటాక్షం కోసం ఏండ్ల తరబడియైనా ఎదురు చూచేవారు. ఇంతచేసినా రాజాదరణ లభించక నికృష్టపు జీవితం గడపిన వారూ ఉన్నారు.

రాజుల నిర్లక్ష్యాన్ని ఖయ్యామ్ గమనించాడు. తాను చూచిన వాస్తవాన్ని స్థిరచిత్తంతో ప్రజల ఎదుట ఉంచగలిగే అసాధారణ ధైర్యగుణం అతని కుంది కనుక, రాజుల్ని సేవించి దాస్యం అనుభవించడాన్ని నిరసించాడు.

'నిరాశ్రయా న శోభన్తే పండితా వనితా లతా:' అనికదాసూక్తి. ఇందలి పరమ సత్యాన్ని గుర్తించలేని ప్రభువులు ప్రభువులు కారు. గార్దభాలట. విద్యను గమనించి విలువ కట్టలేని వారట. అలాంటి వారి దరిచేరి అలమటించడం ఎందుకు అంటాడు ఖయ్యామ్.

"గాడిద వంటి యీ నృపుల కైవస మేమి ఫలంబు గూర్చు నీ
తోడను నేల పాండితిని దోడ్కొని పోయెదు వీరు విద్యకున్
బోడిమికిన్ వెలన్ ఒసగ బోవరు వత్సర మేడిపించి యే
నాడును చేరె డంబువుల నర్మిలి బోయరు దాహమారగన్"3

అని రాజుల్ని నిందించడం ఖయ్యామ్ నిర్భీకతకు పరాకాష్ఠ.

ఖయ్యామ్ స్వాతంత్ర్య పిపాసి. రాజుకూడా ఒక మానవుడే. ప్రత్యేకించి అతనికి ఊడిగములుచేసి పొట్ట నింపుకోనంటాడు. నూటికి గుడ్డకు లేకపోయినా స్వతంత్రజీవనంలోనే ఆనందముందంటాడు.

"రెండు దినాల కైన నొక రేయొక రొట్టె లభించెనేని నే
రెండినవేళ నింత జలమిచ్చెడు పెంకు లభించెనేని నే
నొండొరు వేడి వాని కొలువుండను - నాగతి మానవుండె భూ
పుండును - వాని గొల్చుచును పొట్టను నింపు కొనంగ బోదునే"4

ఈ పద్యం సరళంగా మనోజ్ఞంగా ఉందే కాని రాజాస్థానంలో ఆశ్రయం కోసం ప్రాకులాడే వారికి సూటిగా బల్లెపు పోటులా ఉంది. అయినా లక్ష్యం హింసించడంకాదు. సంస్కరించడం. అందుకే ఉమర్ ఖయ్యామ్ రుబాయీ ఉత్తమ ప్రయోజనకారి.

ఇహలోక సంపదలే శాశ్వతాలని గర్వించి రాజ్యపాలనచేసే నాటి రాజాధి రాజులకు కనువిప్పుగా ఖయ్యామ్ ఇలా అంటాడు—

"తురగంబుల్, రణరంగ వస్తుచయముల్ తోరంపు రత్నంబు లం
బర పంక్తుల్ నటుమంత్రపుం గలుములున్ భావించి గర్వించి సం
బరమున్ బొందకు - కాల మెరినయునన్ మన్నించెనే?..."5

---

3. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 21
4. ,, పు. 35
5. ,, పు. 43

## ధనవాంఛ

నిజాముల్ ముల్క్ ఖయ్యామ్‌కు ఉద్యోగాపేక్షలేదని సంవత్సరానికి 1200 తోమానులు ఆదాయం వచ్చే జాగీరు నిషాపూరులో ఇచ్చి పంపించినపుడు జిజ్ఞాసు వొకడు నేనెంత దేవురించినా నాకొకపైసా ఎవరూ ఇవ్వరే ఇంత ధనం నీకెలా లభించింది? అని ప్రశ్నించాడట.

అందుకు సమాధానంగా ఖయ్యామ్ ఇలా అన్నాడు-

"ధనవాంఛన్ద్యజియించి యేగు ప్రతిపాదం బందు వేవేలుగా
ధనరాసుల్ లభియించు లేని యెడ నర్థంబర్థి రాబోవ దే
పనియైనన్ సమకూడలేదని మదిన్ భావింప కీదుఃఖముం
డిన ఊర్ధ్వంబు ననర్థ దాయకమై డిందించు నీజీవమున్"6

ధనం మీదివాంఛతో దురాశాపరులై జీవితాల్ని వినాశం చేసుకొనే జనుల కీపద్యం ఎంతో చక్కని సందేశం అందజేస్తూంది. పారశీక కవితకు అనువాద మైనా మనోజ్ఞంగా ప్రబోధాత్మకంగా నడచిన ఈపద్యం విన్నప్పుడు-

"వ్యాప్తిం బొందక వగవక
ప్రాప్తంబగు లేశమైన పదివేలనుచున్
తృప్తిం జెందని మనుజుడు
సప్తద్వీపముల నైన జక్కం బడునే"7

అనే బమ్మెర పోతనా మాత్యుని పద్యం హృదయంలో మెదలక పోదు.

## కలిమి విలువ

'ధనమూల మిదం జగత్' లోకంలో పలువురు చెప్పుకొనే మాటఇది. భర్తృహరి అర్థపద్ధతిలో ధనవంతుడే సకలగుణాలు కలవాడని వివరించిన సంస్కృత శ్లోకానికి ప్రసిద్ధమయిన ఆంధ్రానువాదపద్యం క్రిందివిధంగా ఉంది.

6. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 35
7. బమ్మెరపోతన, శ్రీమదాంధ్ర మహాభాగవతము, అష్టమస్కంధము, రామాఅండ్ కో ఏలూరు, 1952, పు. 651

"ఏ నరునకు విత్తముగల
దానరుడు కులీను డధికు డార్యుండతడే
ధీనిధి ధన్యుడు నేర్పరి
నానా గుణ గణము కాంచనంబున నిలుచున్"8

కలిమియే సకల సౌఖ్యాలకు నిలయం. కలిమి లేనివాడు ఏ కులము వాడైనా విలువలేనివాడే అని వేమన ఇలా అన్నాడు—

కలిమి గలుగ సకల కులముల కెక్కువ
కలిమి భోగభాగ్యములకు నెలవు
కలిమిలేని వాని కులమేమి కులమయా ॥విశ్వ॥9

ఇంకా 'కులము గలుగువాడు గోత్రము కలవాడు, విద్యచేత విఱ్ఱవీగు వాడు, పసిడి కలుగువాని బానిస కొడుకులు' వంటి పద్యాలు వింటూనే ఉన్నాం.

ఖయ్యామ్ కాలంనాటి సమాజంలో కూడ ధనం కలవాడె సర్వసమర్థుడనే భావం ఉండి ఉంటుంది. ధనమున్నవాడే ప్రయోజకుడు, అతడే కళాపూర్ణుడు, వంశసంజనితుడని ఖయ్యామ్ ఇలా అంటాడు—

"పురుషుడు ప్రయోజకుడు, కళాపూర్ణు డిద్ధ
వంశ సంజని తుండు గావలయు నంద్రు
కాని, యివి యెల్ల బొల్లు లీ కాలమందు
కనక ముండిన జాలు సంకరములేదు"10

నాటి సాంఘిక పరిస్థితి ఈ పద్యంలో స్పష్టంగా కనిపిస్తూంది. నాటినుండి ఈ నాటివరకు ధనికుని విలువను వెల్లడించే పద్యాలు అసంఖ్యాకంగా వెలువడుతునే ఉన్నాయి. ఇన్నిపద్యాల్ని మింగి వేస్తూందా అన్నట్లు సుప్రసిద్ధ ఆధునిక కవి బాల గంగాధర తిలక్ తమగేయంలో అన్న ఒక్కమాట ఈ సందర్భంగా పేర్కొడం అవసరమనుకొంటాను.

"భూమి నతచుట్టూతాను తిరుగుతూ
ధనవంతుడి చుట్టూ తిరుగుతోంది"11

---

8. భర్తృహరి సుభాషితము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1968 పు. 49
9. ఎస్. టి. జి. వరదాచార్యులు, సంకలన కర్త, సుమతి వేమన శతకాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, పు, 76
10. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 116
11, బాలగంగాధర తిలక్, అమృతం కురిసిన రాత్రి, 1976, పు 119

## చిత్త శుద్ధి

ఆత్మశుద్ధితో భగవంతుని ఆరాధించాలి. మనసులో బయటి విషయాలపై కోర్కెలుండరాదు. ఈకోర్కెలతో ప్రార్థనాలయాలకు వెళ్లడం వల్ల సుఖము దక్కదు. ఉపయోగంలేదు. చిత్తశుద్ధి అలవరచు కోవడం అతిముఖ్యం. ఈవిష యాన్ని ప్రబోధిస్తూ వ్యంగ్యంగా ఖయ్యామ్ క్రింది పద్యం చిత్రించాడు—

"ఏదియొ కోర్కె తోడనె మసీదునకున్ జనుచుంటి మంతె, ఆ
మోదముతో నమాజునకు పోవుటలే దొకనాడు నేను మ
స్జీదు కవాటమందు నొక చెప్పును దొంగిలిపోయి యిప్పుడా
పాదుక పాతగిల్లెనని వచ్చితి రెండవసారి యర్థినై"12

నాడు సైతం కొందరిలో చిత్తశుద్ధి లేకపోవడాన్ని ఈపద్యం వివరిస్తూంది. మొత్తంపైని సంఘ సంస్కర్తగా ఖయ్యామ్ ధ్వజమెత్తాడు. అతని మనస్తత్వానికి ఈపద్యం ప్రతిబింబంగా భాసిల్లుతూంది.

వేమన రచించిన

"ఆత్మశుద్ధి లేని ఆచార మది యేల
భాండ శుద్ధి లేని పాక మేల
చిత్త శుద్ధి లేని శివపూజ లేలరా ॥విశ్వ॥"13

అనే పద్యంలో సైతం ఈ అంతరార్థమే ఉంది.

మరోచోట ఖయ్యామ్ తిరిగి ఇలా అన్నాడు—

"చిత్త మొక చోట లగ్నంబు సేయకున్న
సుస్థిరత వంక నెద ద్రిప్పి చూడకున్న
సర్వ మాభాస మానంద సాంద్రమైన
విభవ మబ్బునె యెట్టి కోవిదునకైన"14

12. ఉమర్ అలీషా, ఉమర్‌ఖయ్యామ్, పు. 142
13. ఎస్. టి. జి. వరదాచార్యులు, సంకలనకర్త, సుమతి వేమన శతకా సంస్కృతానువాదం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, పు.62
14. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు, 157

## దయాను రాగాలు

"ఇద్ధ దయానురాగములు నెవ్వని మానసవీధియందు సం
సిద్ధివహించు నాతడు 'మసీదు' న నున్న గుడిన్ వసించినన్
శుద్ధుడె—వేని పేరు పరిశోధన చేసిన ప్రేమ సంహితన్
బద్ధగతిన్ లిఖింపబడు వానికి లెక్కయె బంధమోక్షముల్"15

స్పష్టంగా ఆపాతమధురంగా ఉన్న ఈ పద్యం అనంతమైన అమర భావాన్ని మనసుల్లో చెరగని విధంగా నిలుపుతూంది. దయ, అనురాగం కలవాడే ఉత్తమ మానవత్వం నిలుపుకొన్నవాడు. ఈ రెండు గుణాలు కలవాడు ఏమతస్థుడైతేనేమి? అతడు మసీదుకు వెళ్లినా, గుడికి వెళ్లినా పవిత్రుడే. ప్రేమమూర్తిగా అతనిపేరు ప్రేమ సంహితలో వ్రాయబడుతుంది. అతనికి బంధం, మోక్షం వంటి వాటితో లెక్క యేమిటి? దయానురాగాలు లేని మనస్కులు ఏ ప్రార్థనలు చేసినా విలువలేనివని, ఆ ఉత్తమ గుణాలు కలవాడెవ్వడైనా పవిత్రాత్ముడే అని ఖయ్యూమ్ స్పష్టపరిచాడు.

## యోగుల తత్త్వవేత్తల స్వభావాలు

నేతి బీరకాయలా ఉండి పైకొకటి చెబుతూ లోన మరొకటి దాచుకొన్నవారిని నిర్దాక్షిణ్యంగా మొహమాటం లేకుండా ఖయ్యూమ్ వేలెత్తి చూపాడు. యోగులైనా మతాచార్యులైనా తత్త్వవేత్తలైనా కల్మషహృదయులైతే అతని విమర్శనుండి తప్పించుకోలేక పోయారు.

ఇంద్రియవాంఛలకు బానిసలై జితేంద్రియుల్లాగా ప్రవర్తించే కపట స్వభావుల గుట్టు బట్టి బయలు చేశాడు.

"పరకీయంగని యోగి యొక్కడు' మహాపాపంబుల జేయుదే
తరుణీ!' యంచన నామె 'పైకెటులనే తర్కింపగా నుంటి నా
కరణిన్ లోపల నుంటి- నీవెటు పయిన్ గాన్పింతువో లోన నా
కరణిన్ గ్రాలెదవొక్క చెప్పు' మన దిగ్భ్రాంతిన్ గనెన్ యోగితాన్"16

15. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యూమ్, పు.152
16. ,, పు.144

అనువాదమైనా ఘాటయిన పదాలు లేకుండా చురక తగిలేలా పైపద్యం రచించి నైపుణ్యం ప్రదర్శించారు అలీషాగారు.

ఖయ్యామ్ తనకాలంనాటి తత్త్వవేత్తల స్వభావాన్ని నిశితంగా పరిశీలించాడు. వారిలో కొందరు కేవలం వేషధారులని, ఐహిక సుఖాలపై వాంఛకలవారని, ఉండవలసిన పవిత్రత వీరివల్ల శూన్యమైందని గ్రహించాడు. వీరందరు ఐహికమనే తెర ఎత్తివేస్తే ఈశ్వరాలయానికి కొన్నియోజనాల దూరంలో ఉంటారట.

"కొందరు తత్త్వవేత్త లతి ఘోర మృషోక్తుల నాడు చుంద్రు సీ!
కొండరు కర్మలన్ సలుపు కూళలు డంభల గూడ నెంత్రు, వీ
రందరు మూర్ఖు లీశ్వరుని యాలయ వీధికి నెన్ని యోజనా
లుందురొ యైహికంబనెడు నూగెడు నీతెర యెత్తి వేసినన్"17

## కాబాయాత్ర

ఈశ్వరుని గూర్చి సరియయిన రీతిని బోధించే గురువును ఆశ్రయించి అతని ఉపదేశం పొందడం, సాధుసేవ చేయడం కర్తవ్యమట. నూరుకాబాల కన్నా సాధుహృదయమే పూజనీయం. అందువల్ల కాబాయాత్ర చేయనేల! సాధుసేవయే సర్వవిధాల పాటించదగింది అని ఖయ్యామ్ అభిప్రాయం.

"ఈశ్వరుని జెప్పు గురుని నార్జించు మెపుడు
మృత్స్వరూప 'కాబాల' నూఱిటి కంటె
సాధు హృదయంబె పూజ్యంబు సాధుసేవ
సేయు మెపుడు 'కాబా' యాత్ర సేయనేల"18

## బాహ్యకర్మలు

ఖయ్యామ్ సృష్టించు కొన్న మధువును ధ్యానామృతమని కదా కొందరు పెద్దలన్నారు. ఈ మధువుకన్నా తూసు, కైకుబాద్ కోటలు, సామ్రాజ్యాలు గొప్పవికావట. ఖయ్యామ్ మధువుకన్నా భిన్నమయిన బాహ్యకర్మల్ని నిరసిస్తాడు. దయలేని కర్మిష్ఠికన్నా, దయుతలచే కర్మబాహ్యుడు ఉత్తముడట.

17. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 174
18 " పు. 45

" 'తూసు' కంటెను 'కైకుబాద్కోట' కంటె
'కావుసును' ప్రాజ్యరాజ్యము కంటె మధువె
ఘనము - కర్మిష్ఠి బాహ్య ప్రార్థనము కంటె
కర్మబాహ్యుని యొక యశ్రుకణము ఘనము"19

"ప్రజలకు జూపగా జపతపంబులు కర్మలు జేయు శుంఠలే
నిజముగ దోష దూషితులు"20

అని బాహ్యకర్మల్ని ఖయ్యామ్ నిరసిస్తాడు.

ఈ విధంగా ఖయ్యామ్ తనకాలంనాటి సాంఘిక పరిస్థితుల్ని పరిశీలించి రాజుల్ని నిందించాడు. కపటయోగుల వేషధారుల స్వభావాల్ని బట్టబయలు చేశాడు. దయానురాగాలతో ప్రవర్తించేవారిని ప్రశంసించాడు. కుటిలాచారాల్ని ఖండించాడు.

ఇక ఖయ్యామ్ లోకానికి అందించిన నీతులు ఉపదేశాల్ని గూర్చి పరిశీలిద్దాం.

* * * *

## ఖయ్యామ్ నీతులు - బోధలు

### సహనశక్తి

పరులు మన మనస్సు బాధపడేలా దూషించినా ఓర్పు వహించడమే శ్రేయస్కరం. వారి వల్ల హానికలిగితే ప్రతీకారం తలపెట్టకుండా, మహాత్ములను ఆశ్రయించడం ఉత్తమమట.

"ఒరులు నిను నొవ్వ నాడిన నోర్చుకొనుము
ఎదిరిచే హాని సతము సంధిల్లుచున్న
కోవిదుల చాటు జొచ్చి దాగుటయు లెస్స
మన్ను జలవాయు వహ్నులే మనుజకోటి"21

---

19. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 138
20. ,, పు. 171
21. ,, పు. 31

ఈ పద్యంలోని పైపాదం వినగానే ఆంధ్రమహాభారతంలోని క్రిందిపద్యం స్ఫురిస్తుంది.

"ఒరులేయవి యొనరించిన
నరవర! యప్రియము తన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపదముల కెల్లన్"22

# ధనార్జన

జీవితం గడపడానికి సరిపడే ధనంమాత్రమే ప్రతిమానవుడు ఆర్జించడానికి ప్రయత్నంచేస్తే ధనికులని పేదలని వర్గ విభేదం ఎందుకేర్పడుతుంది. సామ్యవాద లక్ష్యం ఆర్థికంగా సకలజనులు సమానం కావాలనేకదా! ఈ దృష్టితో అధిక ధనార్జనను ఖయ్యాామ్ వ్యతిరేకించాడు.

"తినుటకు సరిపడు ద్రవ్యం
బును దగ నార్జింపు మధికము గడింపగ గో
రిన వ్యర్థము సుమ! జీవిత
మును వృథ గావింప కట్టి మూర్ఖత్వమునన్"23

స్వామీ! నాకుటుంబం బ్రతకడానికి సరిపడె ధనం మాత్రం ప్రసాదించు. నేను ఆకలి గొని ఉండరాదు. నాఇంటి కేతెంచే అతిథి ఆకలితో వెళ్లరాదు. అని కబీర్ దాసు అన్నక్రింది 'దోహా' కూడ ఖయ్యాామ్ అభిప్రాయాన్ని బలపరుస్తూంది.

"సాఈ ఇత్‌నా దీజియే జామే కుటుంబ్ సమాయ్
మైంభీ భూఖా న రహూఁ సాధూ న భూఖా జాయ్"24

లోకశ్రేయస్సుకోరి కవిత వ్రాసే మహాకవుల దృష్టి వారేదేశం వారైనా, ఏకాలం వారయినా ఒకేవిధంగా ఉంటుంది. ఆధునికకవి జాషువగారి హృదయంనుండి కదలి వచ్చిన పద్యం ఇలా ఉంది.

"నివసించుటకు చిన్న నిలయమొక్కటి దక్క
గడన చేయుట కాస పడను నేను"25

---

22. తిక్కన్న, ఆంధ్రమహాభారతము, శాంతిపర్వము, పం. ఆ. ప. 220
23. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యాామ్, పు. 35
24. కబీర్ దాస్, కబీర్ దోహావళి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ. మద్రాసు, 1952, పు. 43
25. జాషువ, ఖండకావ్యము, 5వ భా, బుక్‌లవర్స్ ప్రైవేట్ లిమిటెడ్, గుంటూరు, 1963, పు. 1

## నొసటి వ్రాతను బట్టి భాగ్యం

నొసటి వ్రాతను బట్టి మన కెంత ప్రాప్తమో అంతే ఇంతకు మించి మరేమీ లభించదు. ఉన్నదానితో తృప్తి పడు. దురాశను దరికి చేరనీయవద్దు. అని హితముపదేశించాడు ఖయ్యూమ్.

> "నుదుటను వ్రాసియున్న యొక నూకకు మించి లభింపబోదు—నీ
> మది విషయాభిలాషలను మాడ్చి దురాశలకేగ—కీజగ
> త్పదనము మాయ—మాయమయి సాగియు గ్రమ్మఱ వచ్చిపోవుచున్
> బొదలెడు-దీనికై వగవబోలునె స్వాంతము తన్ను గ్రుచ్చిలన్"26

భర్తృహరి కూడ నొసటి వ్రాతను బట్టే సొమ్ము లభిస్తుందంటాడు. అర్థ పద్ధతిలోని ఒక శ్లోకానికి అనువాదమయిన తెలుగు పద్యమిది—

> "వనజభవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము ఘనంబొ కొంచెమో
> విను మరు భూమి కేగిన లభించును - మేరువు జేరబోయినన్
> ధనమధికంబురాదు కడు దైన్యము మాను ధనాఢ్యులందు న
> వ్వననిధి నూత దుల్యముగ వారి గ్రహించు ఘటంబు నూడుమా"27

## శ్రమ-ఫలం

కష్టపడి శ్రమ కోర్చకపోతే సరియయిన ఫలం దక్కదు. శ్రమను బట్టి ఫలితం ఉంటుంది. ఈ నగ్న సత్యాన్ని మహానుభావులెందరో విభిన్న ఉదాహరణలతో వివరించారు. ఏరంగంలోనయినా సరే గణనీయమయిన స్థానం లభించాలంటే శ్రమపడక తప్పదు. కష్టాలనంతరం తగిన స్థానం, సౌఖ్యం రెండూ లభిస్తాయి. వివిధశాస్త్రాలలో అఖండమయిన పరిశ్రమ చేసి ఖండ ఖండాంతరాల్లో పేరు ప్రతిష్ఠలు గడించిన ఖయ్యూమ్ అనుభవపూర్వకంగా అందజేసిన సందేశమిది.

---

26 ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యూమ్, పు. 163
27. భర్తృహరి సుభాషితము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, 1968

తాను మొదట బద్దలు కానిదే దువ్వెన కారూపం రాదట. ప్రియురాలి కురులను దువ్వజాలదట. ఈ పద్యం గమనించండి.

"ఉర్వికష్టాలుపడి శ్రమ కోర్వకున్న
భోగములు, నిష్ట సిద్ధులు పొందలేవు
కంకతిక వంద బ్రద్దలు కాకయే ప్రి
యాలకంబులు దువ్వగాఁ జాలఁగలదె"28

## పరులకు ఉపకృతి

పరులెంతగా నిందించినా ఆనిందలు చెల్లవట.మన మొక్కసారి పరులను దూషిస్తే లేక కీడు చేస్తే అదినూరురెట్లయి మన విలువను తగ్గిస్తుందట. అందు వల్ల పరులాడే నిందలు సహించి వారికి ఉపకారం చేయడం గొప్పతనం అని ఖయ్యామ్ వివరణ—

"పరులాడు తిట్లు చెల్లవు
పరులకు మన మొక్క కీడు బఱపిన నూఱై
చెరుచును గావునఁ బూనికఁ
బరులకు నుపకృతులె సేయవలయును సతమున్"29

ఈ భావసామ్యం కల సుమతి శతకకర్త పద్యమిది—

"ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడె నేర్పరిసుమతీ"30

---

28. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 38
29. ,, పు. 38
30. ఎస్. టి. జి. వరదాచార్యులు, సుమతివేమన శతకాలు సంస్కృతాను వాదం, పు. 8

## మేలు - కీడు

పరులొనరించే బాధలు సహించి మహాత్ములు పరహితాచరణ మతులై ప్రవర్తిస్తారు. అది వారి నైజం. వీరికి ఆటంకం కలిగించేవారు ఏమేలు పొందలేరు. ఆటంకం సహించిన మహాత్ములకు ఏకీడు జరుగబోదు. దుష్టులు నామరూపాలు లేకుండా నశిస్తారు. కష్టాల కోర్చినిలిచిన మహానుభావులకు విశిష్టస్థానం దక్కుతుంది. ఈ భావాన్నే ఖయ్యామ్ ఇలా ఉద్బోధించాడు.

"నీవు పరుల మేలు నెంచిన, వారలు
నీదు కీడు సతము నెంతు రేని,
వారు మేలు చూడ నేరరు - నీ వెప్డు
కీడు జీవితాన చూడ బోవు"31

## దుర్జనుడు

సజ్జనునికై ప్రాణమైనా ధారపోయవచ్చుగాని, దుర్జనునితో స్నేహం మాత్రం చేయరాదట.

"విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ
దొడరి వర్జింపనగుఁ జుమీ దుర్జనుండు
చారు మాణిక్య భూషిత శస్త మస్త
కంబు గల పన్నగము భయంకరము గాదె"32

అని భర్తృహరి దుర్జనుని స్నేహం భయంకరమైందిగా వర్ణించాడు.

ఇక ఖయ్యాం—

"సుజనునకుఁ బ్రాణమిడవచ్చు జొక్కవాని
చరణములకును జోహరు సలుపవచ్చుఁ
గాని కుజనునితో మైత్రిఁ గలుపరాదు
నరక కూపంబదే యెన్ని నాళ్లకైన"33

అని ఆ స్నేహం నరక కూపమని చిత్రించాడు.

31. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 38
32. భర్తృహరి సుభాషితము, పు. 63
33. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పు. 33

ఈ విధంగా తన కాలాన జడీభవించిన సాంఘిక దురాచారాల్ని ఖయ్యామ్ అధిక్షేపించాడు. సంఘసంస్కారార్థం ప్రజలభాషలో రుబాయిలు రచించాడు. నీతులు బోధలు అసంఖ్యాకంగా తన రచనల్లో చొప్పించాడు.

అనువాదకులు ప్రతిభాపరిపూర్ణులై ఉభయ సాహిత్యాల్ని సంప్రదాయాల్ని సంపూర్ణంగా జీర్ణించుకొన్న వారైతే, వారిఅనువాదం ఒకపరిపూర్ణత, సౌష్ఠవం సంతరించు కొంటుందన్న విషయం సర్వజన సమ్మతం. అలీషాగారిలో ఈ గుణాలు మూర్తీభవించాయి.

అలీషాగారి విధంగా సూఫీతత్త్వం, ముస్లిమ్ సంప్రదాయం, పారశీక సంప్రదాయం ఆమూలాగ్రంగా తెలిసి, జ్ఞాన సభవంటి ఆధ్యాత్మిక సభకు పీఠాధిపతులై, తత్త్వబోధకులై, ఆంధ్రంలో అసంఖ్యాకంగా గ్రంథరచన చేసిన వారు ఉమర్ ఖయ్యామ్ రుబాయిల అనువాదకులలో మరొకరు లేరు.

అతి మధుర కంఠస్వరంగల ప్రవక్త అహనె దావూదీ [పద్యం. 380], తండాలచే పట్టుకోబడి పదిదీనారాలకు విక్రయించబడ్డ యూసూఫ్ ప్రవక్త (ప. 314), ఖిజరు, ఇలియాస్ ప్రవక్తలు [ప. 401], మహర్షి అబూసయీర్ (ప. 553), పంచభూతాలపై అధికారం కలవాడని ఖ్యాతిగన్న సులేమాన్ చక్రవర్తి [ప. 610], పారశీక ప్రేయసీ ప్రియులు షీరీన్, పర్హాద్-వంటివారు ఉమర్ అలీషాగారి అనువాద గ్రంథంలో మాత్రమే ప్రత్యక్షమవుతారు దువ్వూరి రామిరెడ్డిగారి పానశాలలో పారశీక దేశానికి సంప్రదాయానికి సంబం ధించిన కొన్ని విషయాల ప్రసక్తి ఉన్నా ఉమర్ అలీషాగారి గ్రంథంలో ఉన్నం తగాలేదు. బూర్గుల రామకృష్ణారావుగారి అనువాదం 30 పద్యాలకు మాత్రమే పరిమితమైంది. ఆదిభట్ల నారాయణదాసుగారి అనువాదం అందరికి అందు బాటులో లేదన్న విషయం స్పష్టం.

ఆంగ్లానువాదం అనుసరించి ఆంధ్రీకరణ చేయబడిన గ్రంథాల్ని బట్టి ఉమర్ ఖయ్యామ్ తాత్త్వికచింతన సమగ్రంగా గ్రహించ వీలుపడదు. ఉమర్ ఖయ్యామ్ నీతులు, బోధలు వాటిల్లో కనిపించవు.

కాబట్టి ఉమర్ ఖయ్యామ్ తాత్త్విక చింతన ఎలాంటిదో సమగ్రంగా అర్థంచేసుకోడానికి, నాటి సాంఘిక పరిస్థితులు అంచనావేయడానికి, ఖయ్యామ్ హృదయం, అతని నీతులు బోధలు తెలుసుకోడానికి—అన్నిటిని మించి పారశీక సంప్రదాయాలు, పారశీక పురాణాలకు సంబంధించిన అనేక విషయాలు గ్రహించడానికి ఉమర్ అలీషాగారి ఉమర్ ఖయ్యామ్ గ్రంథమే మిక్కిలి ఉపయోగకారి.

ఆత్మోన్నత్యానికి, సాంఘికప్రయోజనానికి ఎంతయినా తోడ్పడగల ఈ గ్రంథం ఒక విశిష్టతను వెలారిస్తూంది.

ఇది నాలుగో ప్రకరణం.

ఉమర్ అలీషాగారి ఉమర్ ఖయ్యామ్ గ్రంథం తాత్త్విక చింతన కల ఉత్తమ గ్రంథమని స్పష్టమైంది. అనువదించిన ఈ గ్రంథమేకాదు, వారి పెక్కు స్వతంత్ర రచనలు కూడ ఆధ్యాత్మిక విద్యాబోధయే లక్ష్యంగా కలిగి ఉన్నాయి. మరికొన్ని రచనల్లో దేశభక్తి, సంఘసంస్కరణ ప్రధానంగా ఉన్నాయి.

విభిన్న సాహితీ ప్రక్రియల్ని చేపట్టి పెక్కు గ్రంథాలు రచించి తెలుగు సాహిత్యానికి ఉమర్ అలీషాగారు చేసిన సేవ ఎలాంటిదో పరిశీలించడం కూడ అవసరం.

"రచియించినాడ విభ్రాజిత దివ్య ప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసినాడను గల్పనాసక్తమతి పది
నాటకంబులను గర్నాట ఫక్కి
కూర్చినాడను గళాకోవిదుల్ గొనియాడ
నవలలు పది నవ నవత లనగ
తెనిగించినాడ నుద్దీపితా ఖండ పా
రసి కావ్యములు పది రసికు లలర

రసము పెంపార నవధాన క్రమము నందు
ఆశువుల యందు పాటల యందు కవిత
చెప్పినాడ నుపన్యాససీమ లెక్క
అవని ఉమ్రాలిషా కవి యనగనేను"1

"వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వ రసైకచారు వి
న్యాసములున్ మతాంతర మహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారత భూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాడను 'ఉమ్రలిషా' కవీంద్రుడన్"2

---

1. ఉమర్ అలీషా, ఉమర్ ఖయ్యామ్, పీ. పు. 11
2. ,, పీ. పు. 11

అని మహాకవి ఉమర్ అలీషాగారు సాహితీ రంగంలో తాము చేసిన విశిష్టమైన కృషిని గూర్చి స్వయంగా వివరించారు. పతిష్ఠమైన వీరి కవిత వీరికి మంచి పేరు ప్రతిష్ఠలు గడించి పెట్టింది. బాల్యంలోనే కవిత చెప్పి కావ్యాలు వ్రాసి సహజకవులనిపించు కొన్నారన్న విషయం పూర్వోక్తం.

ఇక లభించిన వీరి గ్రంథాల్ని పరిశీలిద్దాం.

## బర్హిణీ దేవి

ఇది ఆరు ప్రకరణాలుకల చారిత్రక ప్రబంధం. విజయనగరాన్ని బుక్క రాయలు పాలిస్తున్న కాలంనాటి కథయిది. ఇందులో నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు ప్రతిబింబించాయి.

బర్హిణీదేవి బుక్కరాయల కుమార్తె. మతసామరస్యానికి సహగమన నిషేధానికి ఆమె పాటు పడినట్లు చిత్రించబడింది. మతసామరస్యం గూర్చి బోధచేసే ఉమర్ అలీషాగారికి ఇలాంటి కథావస్తువులే ఇష్టం. సాంఘిక దురాచారాలు సమసిపోయి సంఘ సంస్కరణ జరగాలన్నది వీరి అభిలాష.

విజయనగర ప్రభువు బుక్కరాయలు గర్భవతి యయిన తన భార్యను వెంట పెట్టుకొని అడవికి వేటకు వెళ్తాడు. ఒంటరిగా ఒక గుడారంలో ఉన్న అతని భార్యను సింహ మొకటి చంపుతుంది. ఆమెకు కలిగిన బిడ్డ బర్హిణి. తల్లి సింహం వాతపడి ప్రాణం కోల్పోగా సమీపంలో ఏడుస్తున్న పసిపాపను నెమిళ్లు తమపింఛాలతో కప్పి కాపాడుతాయి. బర్హములతో కప్పబడింది కాబట్టి 'బర్హిణి' అని ఆశిశువుకు పేరు కలిగింది. హస్తి పురాధీశుడు ఆ పాపను హస్తి పురికి తీసుకొనిపోయి పెంచు కొంటాడు. అనంతరం బుక్కరాయలు బర్హిణి తనకూతురని గ్రహిస్తాడు. బర్హిణికి యుక్తవయస్సు వచ్చినా అవివాహితగా సంఘసేవ చేయాలన్నదే ఆమె నిర్ణయం,

ముస్లిములలోని షియా సున్నీ మతవైరుధ్యాలు ఎలా దారుణ హత్యలకు దారితీస్తాయో ఈ గ్రంథంలో వివరించ బడింది. సుల్తాను మతసామరస్యం కుదర్చడానికి ప్రయత్నం చేస్తాడు.

బర్హిణీదేవి యుద్ధాల్లో బందీలను విడిపించి జరగబోతున్న సతీసహగమనాన్ని ఆపుతుంది. బాల్యవివాహాలు, కన్యాశుల్కాలు, సతీసహగమనం వంటి దురాచారాల్ని కవిగారు నిరసించారు.

కావ్యంలోని రచనధారావాహికం. శైలి మృదు మధురం.

హస్తిపురీశుడు బర్హిణిని తన నగరానికి కొనిపోయి పెంచిన సందర్భంలోని క్రింది పద్యం అలీషాగారి మధుర శైలికి మచ్చు తునక.

"క్రీడాభ్యంతర సౌధవీధుల గుమారీ యంచు బ్రేమంబుతో
భాడున్ జోలలు బాల నుయ్యేలలపై బన్నుండగా బెట్టి పూ
బోడుల్ బాల శశాంక ఫాలయని సంపూర్ణాను రాగంబుతో
నాడింతుర్ బొమరింఢ్ల కామెగొని తామల్లారు మోదంబునన్"3

## ఖండ కావ్యాలు

'ఉమర్ అలీషా కవి ఖండకావ్యములు' అనే గ్రంథం శ్రీ ఉమర్ అలీషా కవి గ్రంథ ప్రచురణ సంఘంవారిచే 1950లో ప్రచురించబడింది. 1908 నుండి 1944 వరకు రచించిన వివిధ శీర్షికలు గల ఖండికల నుండి లభించిన వాటిని సేకరించి ఈ సంపుటిగా వెలువరించారు. 122 ఖండికలు మొదటి భాగంగాను, రెండు వందల పద్యాలు (ఇవిముక్తకాలు) రెండోభాగంగాను, ఈ గ్రంథంలో ఉన్నాయి. ఖండికలన్ని వివిధవిషయాలకు సంబంధించినవి. అవి పారమార్థికాలు, ప్రశంసలు, దేశభక్తిప్రబోధకాలు, స్మృతి ఖండికలు, భావకవితలు అనువాదాలు మొదలైనవి.

పారమార్థిక తత్త్వం ఉపదేశించడానికి అలీషాగారు ఎన్నో కవితలు, కావ్యాలు వ్రాశారు. అయితే ఒకచోట పారమార్థిక సారాంశమంతా ఒక్క కంద పద్యంలో స్పష్టపరచారు. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన ఇది.

"నేను పరబ్రహ్మంబది
దానంచు నెఱింగి తనకు దానై దపమం
దానంత మొందువానికి
గానగబడు తత్త్వగాథ గాథలు తొలగన్"4

3. ఉమర్ అలీషా, బర్హిణీదేవి, పు. 19

స్వాతంత్ర్యోద్యమ కాలంలో కలంపట్టి జాతిని మేల్కొలిపిన కవులలో శ్రీ ఉమర్ అలీషా గారొకరు. దేశభక్తి ప్రపూరితమైన వారి కవితకు ఒక ఉదాహరణ—

"యూరపు దేశ మట్టిటుల నూగగ శౌర్య పరాక్రమంబునన్
భారత వీరకోటి రణపాండితి వైరుల జీల్చి రక్త సి
క్తారుణ మూర్తులై నిజ జయ ధ్వజముల్ నెలకొల్పినప్పుడే
ధారుణి మెచ్చె దద్రుధిరధారలు భోరున పొర్లిపారగన్"5

అవతార పురుషులలో ముహమ్మద్ ప్రవక్తను గూర్చి సొంపయిన అలంకారంతో సరళశైలిలో ఇలా వ్రాశారు.

"చిమ్మ చీకటిలో నెల చెలగినట్లు
కొండ కనుమల గోయిల కూసినట్లు
ముండ్ల వికసించిన గులాబి పువ్వుపగిది
అరబులలోన బొడమి సొంపారినావు"6

శ్రీ కొమరరాజు లక్ష్మణరాయ నిర్యాణవార్త విన్న ఉమర్ అలీషాగారి హృదయం నుండి బయల్వెడలిన కవిత ఒక స్మృతికావ్యతుల్య మైంది. ఆయన మృతివల్ల అంతా అంధకారమయ మైందంటూ మొదటి పద్యం క్రింది విధంగా చిత్రించారు.

"తెలుగను నాట్యరంగమున దివ్యులు మెచ్చ ప్రధాన పాత్రవై
నిలిచి విమర్శ గీతముల నీతి కథావళి పాడిపాడి చం
చలవలె నిష్క్రమించితి వజాండము చీకటివార-ఉన్నవా
రలు గన నేర్తురే కొమరరాజ కులాగ్రణి లక్ష్మణాగ్రణీ!" 7

ఈ విధంగా వీరి భావ కవితలకు ప్రశంసా ఖండికలకు మధురశైలిలో నడచిన ఎన్నోపద్యాల్ని ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

---

4. ఉమర్ అలీషాకవి, శ్రీ ఉమర్ అలీషాకవి ఖండకావ్యములు, పు. 294
5. ,, ,, పు. 22
6. ,, ,, పు. 286
7. ఉమర్ అలీషాకవి, శ్రీ ఉమర్ అలీషాకవి ఖండకావ్యములు, పు. 286

## తత్త్వసందేశము

ఉమర్ అలీషాగారు తత్త్వప్రచారం కోసం వెళ్లినపుడు శిష్యుల కోరిక ననుసరించి కీర్తనలు వ్రాసి ఇచ్చేవారు. ఈ కీర్తనల సంపుటే తత్త్వసందేశము. ఇది 1952లో ప్రచురించబడింది.

అజ్ఞానాంధకారంలో అల్లాడే జీవుని బ్రహ్మగామార్చే మార్గం చూపించే తత్త్వం అలీషాగారు ప్రచారం చేశారు. తత్త్వసందేశములో పూజ, ధ్యానము, నివేదనమువంటి 18 శీర్షికల తత్త్వగీతాలున్నాయి. ప్రబోధము, ప్రార్థన, ప్రార్థన-2 అనుబంధంగా గద్యంలో ఉన్నాయి.

ఈ తత్త్వాలలో గంభీరభావం దాగి ఉంది.

ఉదాహరణకు-

"బురద లోపల పద్మమైతె
ఉఱుము లోపల మెఱపు మెఱసితె
తరువులోపల నగ్నియుంటే
నరునిలో దేవుండు గలడు"8

## స్వర్గ మాత

ఐహిక సుఖదుఃఖాలు తాత్కాలికాలు. భగవంతుని చిత్త శుద్ధితో ధ్యానించి ఐక్యమొందడమే నరజన్మకు సార్థకత అని దైవభక్తిని బోధించే కందార్థాలు ఇందులో ఉన్నాయి. మొత్తం శీర్షికలు 31.

బ్రతుకు అశాశ్వతమైంది. తామరాకుపై బొట్టువంటిది. ఇదే శాశ్వతమ భావించక పుణ్యగతి పొందడానికి జ్ఞానులై ప్రయత్నించండి అని సుగ్రాహ్యమైన శైలిలో రచించిన కందార్థపు దరువిది-

"బ్రతుకనునది క్షితిపైమన
కతి యల్పము తామరాకునందలి జల మ
ట్లతి చలితము మేఘంబుల
గతి ప్రతినిమిషంబు మారు

8. ఉమర్ అలీషా, తత్త్వసందేశము, పు. 10

గతులు లేవండి! తను తాగన దుర్గతులు లేవండి
మతిమంతులై పుణ్యగతికై యత్నించుట
సతము శాశ్వత పదము నితరమే దైనను ॥గతులు॥"9

## సూఫీ వేదాంత దర్శనము

ఈ దార్శనిక గ్రంథం 1939లో ప్రచురించబడింది. సూఫీలు పరమాత్మ సాయుజ్యానికి కావలసిన ఏకత్వసిద్ధి సాధించిన విధం ఈ గ్రంథంలో వివరించబడింది.

ప్రబోధకము, ఆస్తికము, అణువు, సాధన, లక్ష్యము, నిస్పృహ, అవధూత, సిద్ధులు, వంచకులు, మహాత్మ్యములు, వైరాగ్యము, శీలము, ప్రత్యుత్థానము, భ్రాంతులు, భక్తుడు, త్యాగము, జీవుడు, రాగము—వంటి అనేక శీర్షికలతో పద్యరచనచేసి పారమార్థిక తత్త్వం వివరించారు.

కొందరు కనిపించే జగత్తు మిథ్య అంటారు. మరికొందరు కనిపించని బ్రహ్మ మిథ్య అంటారు. వాస్తవం తెలిస్తే ఏది కూడ మిథ్య కాదట.

"జగము మిథ్యని కొందరు చాటుచుంద్రు
బ్రహ్మ మిథ్యని కొందరు బలుకుచుందు
రిర్వురిటుల మి థ్యావాదులే జగాన
నేదియును మిథ్యకాదు నీవెరిగియున్న"10

ఈశ్వరుడు ఎవడు తానెవడు అనే రహస్యం తెలుసుకొన్నవాడు ఈ ప్రపంచానికవతల ఉండే వాస్తవపదార్థాలు చూడగలడట.

"ఎవ్వడు నీశ్వరుండు ప్రభువెవ్వడటంచు విమర్శజేసి తా
నెవ్వడొ యున్న మర్మము లెఱింగిననాడె యగోచరంబు తా
నివ్వసుధాతలంబున ననేక విచిత్ర కళా ప్రపంచమం
దవ్వలనుండు వాస్తవ పదార్థములెల్ల నెఱుంగ నయ్యెడున్"11

---

9. ఉమర్ అలీషా, స్వర్గమాత, పు. 1
10. ఉమర్ అలీషా, సూఫీవేదాంత దర్శనము, పు. 25
11. ,, పు. 24

కావ్యాంతమున సూఫీ వేదాంత మహత్తును గూర్చి ఇలా వివరించ బడింది.

"ఈ సూఫీ వేదాంతము
భాసుర విజ్ఞాన తత్త్వ పథ విశ్రుత వి
న్యాస సముల్లాసము సము
పాసితముక్తిప్రదంబు భక్తుల కెలమిన్"12

* * * *

## మహమ్మద్ రసూల్ వారి చరిత్ర

ఈ గ్రంథం 1955 లో ప్రచురించబడింది. ఇందులో ప్రవక్త మహమ్మద్ జీవిత చరిత్ర, ఇస్లామ్ మత ప్రచార చరిత్ర రచించబడి ఉన్నాయి. మహమ్మదు జన్మించే నాటికి అరబ్ దేశం అనేక దురాచారాలకు లోనయి ఉండేది. ప్రజలు సాంఘిక దుస్థితికి లోనయి సదసద్విచార రహితులై ప్రవర్తించేవారు. మూఢవిశ్వాసాలు, అర్థంలేని పట్టుదలలు దేశాన్ని నిర్వీర్యం చేశాయి. తరతరాలుగా వస్తున్న పూర్వాచారాల్ని ఒక్కసారిగా ఎదిరించి సత్యస్వరూపం ఎఱిగించి సంఘాన్ని సరియయిన మార్గంలో నడపడం అతి ప్రమాదకరం. అయినా సత్యసమ్మతమైన మార్గం గూర్చి ప్రబోధించడానికే మహమ్మదు పూనుకొన్నాడు. ఎన్నో కష్టాలు అనుభవించాడు. సత్యస్థాపనకై తనను పంపించిన భగవంతుడే అన్నికష్టాలు తొలగించగలడని, భగవంతునిపై అంచచల విశ్వాసంతో దీక్షపూని ధర్మప్రచారం సాగించాడు.

కవి కావ్యారంభంలో ప్రవక్త మహమ్మదును స్తోత్రం చేశారు. కరకు రక్కసుల గుండెలలో ప్రేమరసాన్ని నింపినవాడు మహమ్మదు అని భావి పేతంగా నడపిన పద్యం—

"అరబుల జాతి గుండియల నన్నిటిఁ బ్రేమర సైక కాంతి సం
భరితముఁజేసి, యీశ్వరుని భక్తిని బ్రోసి, ప్రపంచవాంఛలన్
దొఱఁగ నమాజు శీలమును దోరపు శౌచము పూసి, పుణ్య స
న్నిరతము సల్పినట్టి మహనీయు మహమ్మదు నాత్మ నెంచెదన్"13

12. ఉమర్ అలీషా, సూఫీవేదాంతదర్శనము, పు. 117
13. ఉమర్ అలీషా, మహమ్మద్ రసూలువారి చరిత్ర, పు. 5

అరబ్ దేశంలో నాడు జరుగుతుండిన బానిసవర్తకం కన్నులకు కట్టినట్లు కరుణ రసాత్మకంగా క్రింది పద్యంలో వర్ణించబడింది.

"ముకు పచ్చలారని ముద్దుబిడ్డల దెచ్చి
దుగ్గానులకు నమ్మ దొడరువారు
కాంతల గొనివచ్చి కాసువీసాలకు
బాని సలుగ నమ్మ బూనువారు
... ... ... ...
... ... ... ...
ఆటకత్తెల పెక్కు రందకత్తెల దొంగి
లించి వేలమువేయ నెంచువారు

పెక్కుచోట్ల చాల బీభత్సకరులైరి
పేదలకును దిక్కు లేదు గడచి
పోయినట్టి కాలమునకు వగవలేము
కాని చరిత మాయ గలదె తలప"14

ఎన్నో భయంకరమైన కష్టాల్ని ఎదుర్కొని ప్రయత్నం విరమించక మహమ్మదు చివరకు సాధించిన మహోన్నత సంస్కరణను అలీషా ద్రాక్షాపాకంలో క్రింది విధంగా అభివర్ణించారు.

"ప్రజలందు భ్రాతృభావంబులు నెలకొల్పె
నశిథిల రాగ రసాను భూతి
స్త్రీలందు స్వాతంత్ర్య జీవితంబును గూర్చె
శౌచశీలాచార సాధనమున
దాయ భాగంబుల ధర్మంబు నిలిపెను
బడతుల కర్థంబు పంచి యిచ్చె
విగ్రహారాధన విషవృక్షమును గూల్చె
గూకటి వేళ్లతో గ్రుంగిపోవ

14. ఉమర్ అలీషా, మహమ్మద్ రసూలువారి చరిత్ర, పు. 58

ఆసవమును మాన్చె వ్యభిచార మణచి వైచె
హింస బరిమార్చె విద్యాప్రవృత్తి నిలిపె
శాంతి నెలకొల్పె నెల్లదిశాంతములను
శ్రీ మహమ్మదు స్వామి జేజే యనంగ"15

## బ్రహ్మ విద్యా విలాసము

ఇది పారమార్థిక శతకం. పదారేండ్ల వయసులోనే అలీషాగారీ శతకం వ్రాయడం ప్రశంసనీయమైన విషయం. ఇందలి పద్యాల సంఖ్య 103. ఛందస్సు తేటగీతి.

జ్ఞాని యొక్క బుద్ధిని ఆశ అనేగుణం తొంగదీసుకోలేదని అందంగా క్రింది విధంగా వివరించ బడింది.

"రాతిపైనీళ్లు ప్రవహించి రాత్రిబగలు
నెట్లు ముక్కలు జేయుదో అట్లు జ్ఞాని
బుద్ధిపై ఆశబారిన బొగిలిపోదు"1

బ్రహ్మనిర్ణయము, మాయోత్పత్తి, సుగుణ నిర్గుణ బ్రహ్మనిరూపణ, ఆత్మ స్వరూప విచారము మున్నగు శీర్షికలతో బ్రహ్మవిద్యను బోధిస్తూ చక్కని ఉదాహరణలతో శతకం సాగింది.

ఇక అలీషాగారి నాటక సాహిత్యం గూర్చి పరిశీలించ వలసి ఉంది. పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలు వీరు రచించారు. ఏ కథ స్వీకరించినా నాటకోచితంగా రచనాచాతుర్యంతో తీర్చిదిద్దారు. చెప్పదలచుకొన్న విషయం లోకానికి స్పష్టపరచేందుకు శ్రవ్యకావ్యాలకన్నా దృశ్యకావ్యాలే బాగా ఉపకరిస్తాయి. పాత్రపోషణలోను, సన్నివేశకల్పనలోను, కథానిర్వహణలోను అలీషాగారు ఆరితేరినవారు. వీరిపేక్కు నాటకాలు పలుచోట్ల ప్రదర్శించబడ్డాయి.

---

15. ఉమర్ అలీషా, మహమ్మదు రసూలు వారి చరిత్ర, పు 187
1. ఉమర్ అలీషా, బ్రహ్మవిద్యావిలాసము, పు 11

## అనసూయాదేవి

ఉమర్ అలీషాగారి సతీమణి ఒక మహాపతివ్రత చరిత్ర రచించండని కోరగా 1918వ సం॥ కవిగారు ఐదంకాల అనసూయాదేవి నాటకం వ్రాశారు. కథావస్తువు పురాణ ప్రసిద్ధమైంది. అనసూయాదేవి పాతివ్రత్య మహాత్మ్యం వెల్లడిచేయడం రచయిత ఉద్దేశం.

"సూర్యునిన్ దీపములు పెట్టి చూపినట్లు
సేట నాలుక కలదని నుడివినట్లు
ఆ సతి పతివ్రతా మహాత్మ్యంబు శుష్క
వాక్యముల చేత వర్ణింప వశము కాదు"2

అని ద్వితీయాంకంలో నారదు డంటాడు.

కన్యాశుల్కం, వరకట్నం వంటివి స్వీకరించడం ఎన్నో అన్యాయాలకు దారితీస్తుందని కవిగారి భావం.

ద్వితీయాకంలో నర్మదచెప్పే పద్యం గమనించదగింది.

"తల్లి దండ్రిలేని తమ్ములు లేని య
నాథ నయ్యునాకు నాథుడెట్లు
వచ్చు? సొమ్ములియ్య వచ్చినవారికే
పెండ్లిగాని - నాకు బెండ్లియగునె?"3

ఇంకా

"ముక్క ముక్కలుగా మిన్ను రక్కవచ్చు
దిక్కలన్నియు నొకమూల ద్రొక్కవచ్చు
పంచ భూతంబు లల్లలాడించవచ్చు
కాని సాధ్వుల దాక నెవ్వాని తరము"4

వంటి పద్యాలు నీతిదాయక మయినవి. అనేక జాతీయాలు, లోకోక్తులతో ఈ నాటకం మనోజ్ఞంగా రూపు దిద్దుకొంది.

---

2. ఉమర్ అలీషా, అనసూయాదేవి, ద్వితీయాంకము, పు. 23
3. ఉమర్ అలీషా, అనసూయాదేవి, పు. 17
4. ,, పు. 25

## కళ

ఇది సాంఘిక నాటకం. అయితే ఇది వైదిక కాలానికి చెందింది. పాతివ్రత్య మాహాత్మ్యాన్ని గూర్చి వివరించే ఇందలి కథావస్తువు కల్పితం. నాటకంలోని అంకాలసంఖ్య ఐదు. రంగవిభజన కూడ జరిగింది. ఇందులో పద్యాలతోపాటు పాటలు కూడ ఉన్నాయి. పాటలన్ని భక్తితత్త్వం కలవి. పాత్రల చిత్రీకరణ అద్భుతం.

నాంద్యనంతరం ప్రస్తావనలో ఇతివృత్తాన్ని సూచిస్తూ సూత్రధారుడు ఇలా అంటాడు—

"కళ మహా పతివ్రత జ్ఞాన కళను నేర్చి
కష్టకాలాన బతినంటి కాపురంబు
జేసి ధర్మంబు దప్పక వాసికెక్కె
ఆయుదంత నాటకమె నేడాడవలయు"5

జ్ఞానకళను నేర్చిన కళయనే ఆమె కష్టకాలంలో ధర్మం తప్పకుండ పాతివ్రత్యం నెరపిన కథయిది.

జ్ఞానసాధన కెట్టి అర్హత ఉండాలో, మతము నిలువడానికి ఎటువంటి విలువకలిగి ఉండాలో, పతివ్రత ఎంత శక్తిమంతురాలో ఈ నాటకంలో అక్కడక్కడ అమూల్యమయిన మాటలతో పద్యాలతో స్పష్టపరచబడింది.—

"దురాచారములు, పాపములు, నీతిబాహ్యములు మున్నగు మలీమసములయిన కర్మకళంకము లామూలాగ్రము నశించినగాని జ్ఞానసాధనమునకు మానవులర్హులు కాజాలరు"6

"ఎన్ని రహస్యముల్ తెలిసి యెన్ని మహత్తులు కల్గియుండినన్
దిన్నని మార్గమందు దన దృష్టిని నిల్పి దరిద్రమందు సం
పన్నతయందు ధర్మమును బాయక అగ్ని పరీక్ష కాగు వా
రున్ననె కాని వారి మతముండదు - ఉండదు వారి సంఘమున్"7

---

5. ఉమర్ అలీషా, కళ, పు. 4
6. ,, పు. 10
7. ,, పు. 15

"ఖలుల హృదయాలలో నీతి నిలువబోదు
బోడితలలను బంతులు జారిపోవునట్లు"8

"అగ్ని మ్రింగవచ్చు హాలాహలము గొంతు
బంటి దాచి బ్రతుకవచ్చు గాని
ధర్మ పతివ్రతలను దాకి జీవింపగా
గలరె-మిడుత దీపకళిక బోలె"9

* * * *

బిల్హణీయమనే నాటకాన్ని గూర్చి కురుమెళ్ల వేంకటరావుగారు క్రింది విధంగా ప్రస్తావించారు.

"... [మాబాల్యంలో] మాచేతే ఒకనాటకం వేయించారాయన [ఉమర్ అలీషాగారు] ఆయన రచించిన బిల్హణీయం నాటకం ఒకసీనులో ఆడపిల్లల స్కూలు. ఒక బాల వితంతువు—

'కాసులకాసజేసి కనుగానని వృద్ధుని నాకు తండ్రియే
చేసెను పెండ్లి'—

అని ఏడుస్తుంది.

ఇంకొక యువతి

'నడువన్ పాదములైన లేని మగనిన్ నాల్గేండ్ల ప్రాయంబునన్
ముడివైచెన్ జనకుండు నాకకట!... ... ఈ
బడుగున్ గూడి సుఖించుటెట్లు'

అని వాపోస్తుంది.

ఇలాంటి దురాచారాలను నిరసిస్తూ బాలికల రంగం ఒకటి బిల్హణీయంలో కల్పించారు షాగారు "10

8. ఉమర్ అలీషా, కళ, పు. 32
9. ఉమర్ అలీషా, కళ, పు. 61
10. కురుమెళ్ల వేంకటరావు, మాపిఠాపురం, పు. 130

## చంద్రగుప్త

ఇది అరంకాల చారిత్రక నాటకం. 1955లో ప్రచురించబడింది. కథ లోక ప్రసిద్ధమైంది. చాణక్యుని శపథానికి సంబంధించింది.

ఈ నాటకంలో పాత్రల చిత్రీకరణ సన్నివేశాల కల్పన అత్యద్భుతం. స్త్రీలు అబలలు కారని, అవసరమైనపుడు సబలలని నిరూపించ బడింది. దేశ భక్తిప్రపూరితమైన ఎన్నో పద్యాలు నాటకంలో ఉన్నాయి. జాతీయతను, దేశ సేవాపరాయణతను రచయిత అత్యుత్తమంగా ప్రోత్సహించారు.

సెల్యూకస్ భారతదేశౌన్నత్యాన్ని వర్ణించి అటువంటి దేశాన్ని స్వాధీన పరచుకోవాలంటాడు. సెల్యూకస్ వర్ణించే ఈ అద్భుత వర్ణనలో కవికుండే దేశాభిమానం ఎంత ఉన్నతమైందో స్పష్టమవుతుంది. ఆ పద్యమిది—

"ఏ మహారాజ్ఞికి హిమవన్నగంబులు
కులగిరుల్ పెట్టని కోటలొక్కొ
ఏ లతాతన్వికి హిందు గంగానదుల్
దరిలేని మంచి ముత్యాల సరులొ
ఏ సరోజాస్యకు నా సింహళ ద్వీప
మత్యంత రత్న సింహాసనంబొ
ఏ రమారమణికి భారత యోధులఁ
గాళిదాసా దులఁ గన్నకడుపొ

అట్టి సుగుణ రత్నాకరమై జగాన
నసదృశ విలాసినిగ నలరారు చుండు
భరత వర్ష వధూటిని బడయవలయు
సమర భూమిని రాజుల సంహరించి"11

---

11. ఉమర్ అలీషా, చంద్రగుప్త, పు. 44

ఈ నాటకంలో విశేషంగా స్త్రీ సాహసం వర్ణించ బడింది. ఇందుకు ఉదాహరణ —

"నరకున్ దున్మించెను సత్యభామ శరముల్ నాటించి, యమ్మహిషా
సురు మర్దించెను బార్వతీ సతి, ధరన్ స్త్రీ లోకులై యెందఱో
తరుణుల్ యుద్ధము లాచరించి గుణద్యో ర్దర్పంబుతో దేశమున్
గరమున్ గాచి కృతజ్ఞులై వెలయరే కాంక్షించిరే ప్రాణముల్"12

ఈ నాటకంలో అలంకారాలు, నుడికారాలు కొల్లలు.

ఇంకా మణిమాల, మహాభారత కౌరవరంగము, దానవవధ వం!
పెక్కు నాటకాలు అలీషాగారు రచించారు.

పద్మావతి, తారామతి, శాంత అనే నవలలు ప్రభాత కథావళి (కథ సంగ్రహము), వందవ్యాసాలు గల వ్యాస సంపుటి కూడా ప్రముఖం పేర్కొదగినవి.

నాటి పెక్కు పత్రికల్లో వీరిరచనలు ప్రచురించబడ్డాయి.13

ఇలాజుల్ గుర్భా అనే వైద్య గ్రంథం ఉర్దూ నుండి అనువదించా ఉమర్ ఖయ్యామ్ కాక గులిస్తాన్, ఖురానె షరీఫ్, ఈశ్వరుడు, సాధన పథమ వీరి అనువాద గ్రంథాలు. ఇవన్నీ ఎంత ప్రయత్నించినా లభ్యం కాలేదు.

ఈ విధంగా పద్యకావ్యాలు, ఖండకావ్యాలు, నాటకాలు, నవల కథలు, కథానికలు, అనువాదాలు వంటి అనేక సాహితీ ప్రక్రియలకు అలీ బలం చేకూర్చారు. ప్రజల్లోని అజ్ఞానాన్ని తమ ఆధ్యాత్మికబలంతో తొలగిం లనే తపన వీరిది. అందుకు సాహిత్యాన్ని ఆయుధంగా చేపట్టి నిరంతర కృ చేసి గ్రంథరచన చేశారు. తెలుగు సాహిత్యానికి ఈ రీతిగా వీరు చేసిన అనన్యసామాన్యమైందిగా భావించబడింది.

---

12. ఉమర్ అలీషా, చంద్రగుప్త, పు. 59
13. ఉమర్ అలీషా, మహమ్మదు జీవితము, ఆంధ్రపత్రిక సంవత్సర సంచిక, ఏప్రెల్, 19
    „ కవిత్వము, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక, 1925.
    „ జీవితత్త్వము, „ 1934.
    „ నిర్వాణము, „ 1936.

వీరి అన్ని రచనల్లోను 'ఉమర్ ఖయ్యామ్' ప్రత్యేకత కలది. ఖయ్యామ్ తత్త్వాన్ని తెలియజేయడమే ఈ కావ్యోద్దేశం కావచ్చుకాని ఇందలి ఇతర అంశాలు అమూల్యమైనవి. భారతీయ పురాణేతిహాసాదులలోని గాథలను మాత్రమే తెలుసుకొన్న తెలుగువారికి పారశీక పురాణేతిహాసాలు తెలుసుకోవాలనే ఆసక్తి కలిగిస్తుంది గ్రంథం. కులగోత్రాల గొడవలు, ప్రాంతీయాభిమానాలు, కల్మషాలు, కక్షలకు అతీతమైన విశాల దృక్పథం, నూతన సందేశం ఈ కావ్యం అందజేస్తుంది. ఇలాంటి అనువాదాలు విశ్వసాహిత్యానికి ఎంతయినా బలం చేకూరుస్తాయి. విశ్వమానవ సౌభ్రాత్రాన్ని పెంపొందింప జేస్తాయి. అందువల్లనే ఉమర్ అలీషాగారి కృతులలో ఈ కావ్యానికి ఉత్కృష్టమయిన స్థానం ఉంది.

"శ్రీ ఉమర్ ఆలీషాగారి ఆంధ్రీకృత ఉమర్ ఖయ్యామ్ పద్యకావ్యమును గూర్చి పెక్కురు మహామహులు విశేషముగా పొగడిరి. ఈ గ్రంథమును చదువునపుడు ఉమర్ ఖయ్యామ్ శ్రీ ఉమర్ ఆలీషా కవిగారి రూపమున వచ్చి ఆంధ్రీకరించెనా! యని పించును" అని ఉమర్ ఖయ్యామ్ కావ్య పీఠికలో ఉన్న వాక్యాలు ఉమర్ అలీషాగారికి మరింత ఘనత చేకూరుస్తున్నాయి.

ఇది ఐదో ప్రకరణం

# ముగింపు

ఉమర్ అలీషాగారి 'ఉమర్ ఖయ్యామ్' గ్రంథాన్ని పరిశీలించి అందలి అమూల్యాంశాలు ఇంతవరకు ఈ సిద్ధాంతవ్యాసంలో వివరించే ప్రయత్నం జరిగింది.

ప్రథమ ప్రకరణంలో ఉమర్ ఖయ్యామ్ ఉమర్ అలీషాల జీవిత రేఖల్ని విశదీకరించడం జరిగింది. ఉమర్ ఖయ్యామ్ జన్మించిన పారశీకదేశం దాని పూర్వరంగం పరిశీలించ బడింది. ఉమర్ ఖయ్యామ్ జన్మ సంవత్సరం నిర్ధారించడం క్లిష్టమైన విషయమని, ఖయ్యామ్ శబ్దానికిగల అర్థం విభిన్నాభిప్రాయాలకు దారితీసిందని స్పష్టం చేయబడింది. ఖయ్యామ్ విభిన్న శాస్త్రాల్లో గడించిన విజ్ఞానం, అతని రచనలు, లభించిన బిరుదాలు, కవిగా, జ్యోతిష్కుడుగా, వైద్యుడుగా హేతువాదిగా అతనికి దక్కిన ఖ్యాతి, అతడు అధ్యయనం చేసిన గ్రంథాలు మున్నగువిషయాల్ని పరామర్శిస్తూ అతడు అఖండ ప్రతిభ కలవాడని నిరూపించబడింది.

ఉమర్ ఖయ్యామ్ రుబాయీలను అపూర్వంగా ఆంధ్రీకరించిన ఉమర్ అలీషాగారి జీవిత చరిత్ర వివరించే ప్రయత్నం కూడా జరిగింది. అలీషాగారి విద్యాభ్యాసం, బాల్యంలోనే వ్యక్తమైన ప్రతిభ, రచనలు, జ్ఞాన పీఠాధిపత్యం, పొందిన బిరుదాలు, శిష్యసంపద మున్నగు అంశాల్నిగూర్చి చర్చించి ఈయన మహామనీషి అని నిర్ధారించడం జరిగింది.

ఉమర్ ఖయ్యామ్ ఉమర్ అలీషా జీవితరేఖల్ని పోల్చడంతో పాటు ఇరువురు సాధించిన జ్ఞానాన్ని సంపాదించిన అనుభవాన్ని లోకానికి అందచేశారని వివరించబడింది.

రెండో ప్రకరణంలో ఖయ్యామ్ పొందితీ ప్రకర్ష పరిశీలించబడింది. పారశీక సాహిత్య చరిత్రలో ఖయ్యామ్‌కు గల స్థానం గూర్చి చర్చించడం జరిగింది. పారశీక ఛందోరీతుల్లో ఖయ్యామ్ చేపట్టిన రుబాయీ ప్రక్రియ విశిష్ట స్థానం కలది అని స్పష్టపరచబడింది. ఉమర్ ఖయ్యామ్ రచించిన రుబాయీల సంఖ్య ఎంతో తేల్చి చెప్పడం కష్టసాధ్యమని వివరించ బడింది. ఖయ్యామ్ కీర్తి పాశ్చాత్యదేశాల్లో వ్యాపించడానికి అతడు రుబాయీల్లో వ్యక్తం చేసిన

అపూర్వభావాలే కారణమని, పాశ్చాత్య కవి ఫిట్జ్‌రాల్డ్ కీర్తి రుబాయీల అనువాదం వల్లనే నల్దిశల వ్యాపించిందని, అలీషాగారి పద్యాలలో వ్యక్తమయ్యే ఖయ్యామ్ కవితా కౌశలం, పాండితీ ప్రకర్ష, జ్ఞానబలం, తిరుగులేనివని విశద పరచ బడింది.

మూడో ప్రకరణంలో అనువాదకళను పరామర్శించడంతో పాటు ఉమర్ అలీషాగారు ఆంధ్రీకరణలో సిద్ధహస్తులని నిర్ధారించ బడింది.

అలీషాగారు రుబాయీల అనువాదంలో సందర్భాన్ననుసరించి భావాన్ని విస్తృతపరచారని, కుదించారని, రసపోషణ చేశారని, అలంకారాలు ప్రయో గించారని సోదాహరణంగా వివరించడం జరిగింది.

ఉమర్ ఖయ్యామ్ రుబాయీలలోని మధువు, మానినులకు సాధారణా ర్థంగాక ఆధ్యాత్మికమైన విశిష్టార్థముందని స్పష్టం చేయబడింది.

ఖయ్యామ్ కాలంనాటి సూఫీమతం - దాని పరిస్థితులు వివరించబడ డంతోపాటు చార్వాకమతం, ఎపిక్యూరియన్ మతం రెండూ ఖయ్యామ్ మతానికి భిన్నమైనవని నిరూపించ బడింది.

సృష్టి - జీవుడు, ఈశ్వరతత్త్వం, జీవన్మిథ్యత్వం, ఆత్మ - పరమాత్మ, విధి, స్వర్గనరకాలు, నేడు-రేపు మున్నగు అంశాలను గూర్చి ఖయ్యామ్ వ్యక్తం చేసిన అభిప్రాయాల్ని బట్టి అతని తాత్త్వికచింతనపరిశీలించబడింది.

నాలుగో ప్రకరణంలో రుబయీల అనువాద గ్రంథాల్లో ఉమర్ అలీషాగారి అనువాద గ్రంథానికి గల స్థానం నిర్ధారించడం జరిగింది.

శ్రీయుతులు బూర్గుల రామకృష్ణారావు, దువ్వూరి రామిరెడ్డి, ఆదిభ( నారాయణదాసు ఫారసీనుంచి రుబాయీలను అనువదించారు. ఇంకా పెక్కు మంది ఆంగ్లం నుంచి ఆంధ్రీకరించారు. వీరందరికన్నా ఉమర్ ఆలీషా అనువ దించిన రుబాయీల సంఖ్య అత్యధికం. ఖయ్యామ్ హృదయం అర్థంచేసుకో డానికి అతని తాత్త్వికచింతనను సమగ్రంగా పరిశీలించడానికి ఉమర్ అలీష గారి గ్రంథమే మిక్కిలి ఉపయోగకరమైందని, ఏ అనువాద గ్రంథంలోను కనిపించని సాంఘిక విమర్శ, నీతులు, బోధలు ఈ గ్రంథంలోనే ఉన్నాయని

కనుక ఉమర్ అలీషాగారి గ్రంథానికి గల స్థానం ఉన్నత మైందని స్పష్టం చేయడం జరిగింది.

ఐదో ప్రకరణంలో ఉమర్ అలీషాగారు తెలుగు సాహిత్యానికి చేసిన విశిష్ట సేవ పేర్కొ బడింది. వీరి అన్ని రచనల్లోను 'ఉమర్ ఖయ్యామ్' శిరోమణి అని వివరించ బడింది.

ఈ విధంగా ఉమర్ ఖయ్యామ్ తత్త్వం ఉమర్ అలీషాగారి గ్రంథంలోనే అపూర్వంగా చిత్రించబడిందని, ఈ గ్రంథం తెలుగు అనువాద గ్రంథాల్లో విశిష్టస్థానం కలిగి వుందని ఈ సిద్ధాంతవ్యాసంలో నిరూపించడం జరిగింది.





# కొన్ని ముఖ్యవివరణాలు

| | | |
|---|---|---|
| ఇమామ్ | - | మార్గ దర్శకుడు |
| కాబా | - | మక్కా ప్రార్థనాలయమందలి పవిత్రశిల |
| ఖిజరు, ఇలియాస్ | - | ప్రవక్తల పేర్లు |
| జంషీదు కలశము | - | జంషీదు అనే చక్రవర్తి పానపాత్ర. ఇందులో అతడు ప్రపంచంలోని అన్నివిషయాలు చూడగలిగేవాడట. |
| తఖల్లుస్ | - | కవులు తమ కవిత్వంలో వాడుకొనే ఉపనామం |
| తూసు | - | తూసు నగరపుకోట |
| బహరామ్ | - | పూర్వపారశీకరాజు |
| మౌలవీ | - | పండితుడు |
| సాఖి | - | పాత్రవాహిక |



# ఉపయుక్త గ్రంథసూచి

## తెలుగు పుస్తకాలు


అప్పారావు, గురజాడ - ముత్యాల సరాలు, ఎమ్. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, 1972,

అర్క సోమయాజీ, డి - సుభాషితములు [సంకలనం] ఆంగ్లానువాదము, తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 1979.

అస్గర్ ఖానమ్; ఆలమ్‌కుంద్‌మిరి - ఇస్లామ్ దర్శనము, తెలుగు అకాడమీ, హైదరాబాదు, 1971

గోపాలకృష్ణరావు, కె - తెలుగుపై ఉర్దూపారశీకముల ప్రభావము, ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు, 1968,

చంద్రశేఖరశర్మ, అవధానము - ముద్రారాక్షసము నాటకము, సాహితీ స్రామాజ్యము, పోరుమామిళ్ల, 1957

చలం - ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు, బుక్ సెంటర్, విశాఖపట్నం—1. అక్టోబరు, 1968.

జాషువ, జీ - కొత్తలోకము, ప్రచురణ: హేమలతా లవణం, పటమట, విజయవాడ, 1974

జాషువ, జీ - ఖండకావ్యము, ఐదవభాగము, బుక్ లవర్స్ ప్రైవేట్ లిమిటెడ్, గుంటూరు 1963.

తిక్కన - శ్రీ మదాంధ్ర మహాభారతము, శాంతి పర్వము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, చెన్నపురి, 1965

నన్నయ - శ్రీమదాంధ్ర మహాభారతము, ఆది పర్వము

నన్నెచోడుడు - కుమార సంభవము

నారాయణదాసు, ఆదిభట్ల - Rubaiyat of Omar Khaiyam బ్రిటిష్ ఇండియాప్రెస్, బొంబాయి, 1932

పోతన, బమ్మెర - ఆంధ్ర మహాభాగవతము, అష్టమ స్కంధము, రామా అండ్ కో, ఏలూరు, 1952.

బాలగంగాధర తిలక్ - అమృతం కురిసినరాత్రి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1978

బుచ్చిసుందరరామశాస్త్రి, మాధవపెద్ది - ఉమర్ ఖయాం, శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి, 1951.

భర్తృహరి - భర్తృహరి సుభాషితము (ఆంధ్రానువాదము సహితము) వావిళ్ల రామస్వామి శాస్త్రులు & సన్స్, చెన్నపురి 1968.

రంగయ్యప్పారావు - ఉమర్ ఖయాం రుబాయ్యాత్, వంశీ ప్రచురణలు, విజయవాడ-3, 1965

రామకృష్ణారావు. బూర్గుల - సారస్వత వ్యాస ముక్తావళి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, దుర్ముఖి.

రామిరెడ్డి, దువ్వూరి - పానశాల, కవికోకిల గ్రంథమాల, పెమ్మారెడ్డి పాళెం, నెల్లూరు జిల్లా, 1958.

వరదాచార్యులు, ఎస్. టి. జి - సుమతి వేమన శతకాలు, సంస్కృతానువాదము, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు.

వేంకటరావు, కురుమెళ్ల - మా పిఠాపురం, కురుమెళ్ల వేంకటరావు, మంగయమ్మారావుపేట, పిఠాపురం, 1968.

శ్రీనాథుడు - భీమేశ్వరపురాణము, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్‌సన్స్, చెన్నపురి, 1967

షేక్ దావూద్ - మహాకవి ఉమర్ అలీషాగారి జీవిత సంగ్రహము, తెలుగు వైతాళికులు, సంపుటము-3, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1979.

సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల- ఆంధ్రరచయితలు, ప్రథమ భాగము.

సదాశివ, ఎస్ - అమ్జద్ రుబాయీల అనువాదము, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1964

సదాశివ, ఎస్ - పారసీకవుల ప్రసక్తి, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1975.

సుబ్బారావు, రాయప్రోలు - మధుకలశము, లలితా కుటీరము, నెహ్రూనగర్, సికింద్రాబాదు. 1959

స్ఫూర్తిశ్రీ - తెలుగులో ఉమర్ ఖయ్యామ్, సాహితీ వాల్లభ్యము, ద్వితీయభాగము శ్రీ నరేంద్రనాథ సాహిత్య మండలి, తణుకు.

స్ఫూర్తిశ్రీ - మధుపాలిక, శ్రీపతిప్రెస్, కాకినాడ, 1963.

## సంపుటాలు (తెలుగు)

విజ్ఞాన సర్వస్వము, మొదటి సంపుటము, చరిత్ర - రాజనీతి
,, నాల్గవ సంపుటము, తెలుగు సంస్కృతి
,, ఆరవ సంపుటము, విశ్వసాహితి
,, ఏడవ సంపుటము, దర్శనములు-మతములు
సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము, రెండవ సంపుటము.

## సంస్కృత గ్రంథాలు

నన్నయ - ఆంధ్రశబ్దచింతామణి

కృష్ణమిశ్రుడు - ప్రబోధచంద్రోదయ నాటకము, నిర్ణయసాగర్ ప్రెస్, బొంబాయి, 1935

## హిందీ గ్రంథాలు


అంబికా ప్రసాద్ వాజ్‌పేయీ - హిందీపర్ ఫార్సీకా ప్రభావ్, హిందీ సాహిత్య సమ్మేళన్, ప్రయాగ్, ద్వితీయ సంస్కరణ్

కబీర్‌దాస్ - కబీర్ దోహావళి, దక్షిణ భారత హిందీ ప్రచారసభ మద్రాసు, 1952

గోపీనాథ్ అమన్ (సంపాదకుడు) - నయాచమన్, దక్షిణ భారత హిందీ ప్రచారసభ, మద్రాసు, 1950.

రాజశేషగిరిరావు, కర్ణ - దిశా ఔర్ దృష్టి, ప్రచురణ, రామ్ నారాయణ్ లాల్ బేనీ ప్రసాద్, అలహాబాద్, 1978

శివకుమార శర్మ - సూఫీమత్‌కా ఉద్భవ్ ఔర్ వికాస్, హిందీ సాహిత్యాయుగ్ ఔర్ ప్రవృత్తియా, అశోక్ ప్రకాశన్, ఢిల్లీ-6,1970

షేక్ మహమ్మద్ ఇఖ్బాల్ - తెలుగుకే ఆధునిక్‌కవి డా. ఉమర్ అలీషాహ్‌కా వ్యక్తిత్వ వ కృతిత్వ [ఆంధ్రవిశ్వవిద్యాలయం ఎమ్. ఏ. (హిందీ) పట్టం నిమిత్తం ఒక భాగంగా 1970లో సమర్పించిన అముద్రిత సిద్ధాంత వ్యాసం]


## ఉర్దూ ఫారసీ గ్రంథాలు


అల్లామా షిబ్లి నౌమానీ - తన్ ఖీద్ షేయరుల్ అజమ్, 191[illegible]

రియాజ్ జునేదీ - జజ్‌బాత్-ఎ- ఉమర్ ఖయ్యామ్ రియాజ్ అకాడమీ, బల్‌దా, హైదరాబాద్, 1943

సయ్యద్ ఏజాస్ హుసేన్ - తారీఖ్ అదబ్ ఉర్దూ, ఉర్దూకితాబ్ ఘర్, ఢిల్లీ.

సయ్యద్ ముర్తజా హుస్సేన్ - ముషాయర్-ఎ- ఆలమ్-ఎ-అర్ వాహ్.
- యునైటెడ్ ఇండియా ప్రెస్, లక్నో, 1955

## ఆంగ్ల గ్రంథాలు

Bankey Behari - Sufis Mystics and Yogis of India, Bharateeya Vidya Bhavan, Bombay, 1971.

Edward Fitzgerald - The Rubaiyat of Omar Khayyam, First and Second Editions, Printed in Great Britain.

Hakim, H. E - Islam and Sufism, The Theosophical Islamic Association, Adayar, Madras, 1975.

William Morris (Editor) - The American Heritage Dictionary of the Englisho Language, American Heritage Publishing Company, New York, 1973.

The illustrated Chambers's Encyclopedia, Volumes VII and VIII; Chambers Ltd, London, 1930

The children's Encyclopedia, volume VIII, The Educational Book company Ltd, London, E. C. 4.

## పత్రికావ్యాసాలు

ఉమర్ అలీషా - కవిత్వము, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1925-26

,, - ఉమర్ ఖయ్యాము-ఈశ్వరుడు, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1928-29

,, - జీవతత్త్వము, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1934-35

,, - నిర్వాణము, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1636-37

తమ్మయ్య, బండారు - ఉమర్ ఖయ్యామ్—ఉమరు అలీషాకవి, భారతి, నవంబరు, 1951.

రాజశేషగిరిరావు, కర్ణ- ఉమర్ ఖయామ్ము, భారతి జూన్, 1968

## ఈ సిద్ధాంతవ్యాసంలో పరిశీలించబడిన ఉమర్ అలీషా గారి గ్రంథాలు.

అనసూయాదేవి

ఉమర్ ఖయ్యామ్

కళ

ఖండకావ్యములు

చంద్రగుప్త

తత్త్వసందేశము

బర్హిణీదేవి

బ్రహ్మవిద్యావిలాసము

మహమ్మద్ రసూలువారి చరిత్ర

సూఫీవేదాంత దర్శనము

స్వర్గమాత



# సవరణలు.



| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 7 | 15 | సాహీతిప్రియులు | సాహితీప్రియులు |
| 7 | 17 | ప్రాయంలొ | ప్రాయంలో |
| 17 | 17 | అలీషా:గారె | అలీషా:గారే |
| 23 | 23 | 1961 | 1916 |
| 28 | 2 | జ్ఞాన స | జ్ఞాన సభ |
| 28 | 13 | ఏటా జరిగె | ఏటా జరిగే |
| 31 | 1 | రేల్వే | రైల్వే |
| 31 | 11 | మహామనిషి | మహామనీషి |
| 40 | 4 | ర్చి | గూర్చి |
| 42 | 2 | ఉదహరిస్తాను | ఉదాహరిస్తాను |
| 45 | 24 | ఇదె | ఇది |
| 46 | 1 | ఆఏతెరవెనుక ముందో | ఆతెరవెనుక ఏముందో |
| 47 | 9 | ఉత్త్పన్నంమైది | ఉత్పన్నమైంది |
| 50 | 23 | మహాజానుల | మహాజ్ఞానుల |
| 61 | 6 | భూయిష్టం | భూయిష్ఠం |
| 69 | 20 | నేరుమే | నేర్తుమే |
| 72 | 24 | సమ్మితయోపదేశముజే | సమ్మితతయోపదేశయుజే |
| 74 | 13 | మాటలతొ | మాటలతో |
| 75 | 14 | పైకొడక | పైకోడక |
| 78 | 2 | చేతులలో | చేతులతో |
| 78 | 3 | చేతులనే | చేతులనె |
| 82 | 19 | పె | పై |
| 84 | 7 | కంటే | కంటె |
| 85 | 13 | ఆతనికీ | అతనికి |
| 86 | 2 | కూర్చోనేవారు | కూర్చొనేవారు |
| 86 | 14 | సిధ్ధాంత | సిద్ధాంత |
| 86 | 17 | క్తిమంతమైంది | శక్తిమంతమైంది |

